శ్రీమాత్రే నమః

గణపతయే నమః

నమః పరమఋషిభ్యః

# వివాహతత్త్వము

కావ్యతీర్థ, పురాణవాచస్పతి

**బంకుపల్లె మల్లయ్యశాస్త్రి**

రచించినది.

శారదా వివాహశాసనము శాస్త్రసిద్ధము.

సర్వే జనా స్సుఖినో భవన్తు.

ఓం తత్సత్.

19-12-1933 శ్రీముఖ సం. పుష్య శుక్ల ద్వితీయ జయవారము.

# ప రి చ య వా క్య ము లు

ప్రపంచపరిణామమునందు ధర్మనిర్ణయము సాపేక్షము. ప్రవృత్తియందు నిరపేక్ష ధర్మము దుర్లభము. ప్రపంచాధారమైన ధర్మము దేశకాలపాత్రావరణములయందు సాపేక్షమగుచున్నది. జీవు డనవరతమును ప్రకృతిపరిసరములయందు ధర్మయాత్రను జేయుట జీవపరిణామమునకు సహజధర్మము. జీవాణువు జననమరణపరమైన ప్రపంచయాత్రయందు పరబ్రహ్మపరిణామమును పొందుట పురుషార్థము. జీవుడు పశువు, పశువు పశుపతిపరిణామమును పొందుట జీవపరిణామ ధర్మము. జీవుడు జీవయాత్రయందు సాపేక్షధర్మము లయిన వర్ణాశ్రమాచారధర్మావరణములను, దేశకాలపాత్రావరణములను నతిక్రమించి నిరపేక్షమైన ధర్మారోహణము చేయుట పురుషార్థము. జీవుడు సకలకర్మలను, సర్వధర్మములను పరిత్యజించి నిరపేక్ష ధర్మారోహణమును జేయుటకు మతసాంఘికార్థిక రాజకీయసాహిత్యకళాప్రపంచ మంతయును సాధనముగ నున్నది. సాధకులకు సాధ్యమును బడయుట కవసరమైన సాధనములు, దేశకాలపరిసరానురూప మైనను, సాధకసత్త్వాధీనములు. సాధకులు స్వానుభవ స్వాధికారసిద్ధములయిన సాధనములను విడిచి పరాధీన పరానుభవసాధనముల నారాధించుట పురుషార్థమునకు నిరర్థకము. ప్రపంచపరిణామమున కవసరమైన ధర్మములందు వివాహధర్మము ప్రధానధర్మముగ నున్నది.

. సకలసృష్టికిని మూలాధారమైన స్త్రీ పుంసయోగము మానవసంఘమునందు వివాహపరిణామమును పొందుట జీవ యాత్రయందు దివ్యసాంఘికపరిణామము. జీవునకు దేహబల సంరక్షితమైన స్వార్థపరత్వము, స్వాభిమానము, స్వప్రయో జన పరాయణత్వము, స్వసుఖారాధనము, స్వరక్షణము స్వభావసిద్ధములు. మానవులు వివాహమును స్వార్థారాధన మునకై కల్పించిన విధమును వివాహచరిత్రమును, బ్రాహ్మ దైవార్షప్రాజాపత్యాసుర గాంధర్వ రాక్షస పైశాచాది వివా హములును విశదము చేయుచున్నవి. ప్రాచీన వర్తమాన కాలములందు పురుషులు వందలవేలభార్యలను వివాహమాడెడి యాచారము కలదు. ఒకస్త్రీ యనేకమంది పురుషులను పెండ్లి యాడుటయును కలదు. ఈజిప్టునందు పూర్వకాలమునం దేక గర్భసంజాతులైన సోదరీసోదరులకు వివాహము లుండినటులు తెలియుచున్నది. స్త్రీ పురుషులు యథేచ్ఛముగను వివాహ విచ్ఛేదమును జేయుటయును గలదు. వివాహధర్మములందు కాలక్రమమునను వావి వరుసలు, కులములు, గోత్రములు, ధన రూపవిద్యాదులు ప్రమాణములై ఏకపత్నీపతి వివాహ ములు ప్రబలినవి.

కామదహనానంతరము గలిగిన పార్వతీ పరమేశ్వరపరి ణయము వివాహపరిణామమునకు ప్రమాణము. పార్వతీపరమే శ్వరులపరిణయము, రాధాకృష్ణులవిలాసము, సీతారాముల కల్యాణమువలెను మానవకల్యాణములును ప్రేమత్యాగసా ధ్యము లయినవి. వర్తమానకాలమునందు భరతఖండమునందు

బ్రాహ్మ కల్యాణములు రాక్షసవివాహపరిణామమును బడసి
నవి. వివాహప్రయోజనమే నిరాశ్రయమైన వర్తమానసమ
యమునందు వివాహతత్త్వమును పరిశీలించి వివాహప్రయో
జనమును, ధర్మమును గ్రహించి నిర్ణయించుట సకలహిందువు
లకు నత్యంతావసరము. శ్రీయుత కావ్యతీర్థ బంకుపల్లె మల్ల
య్యశాస్త్రిగారు రచించిన వివాహతత్త్వము వర్తమాన వివా
దసమయమునందు సనాతనధర్మపరాయణులకును, సంస్కార
ప్రియులకును వివాహధర్మమును గ్రహించుటకు పఠన
యోగ్యముగ నున్నది.

శారదావివాహశాసనము చైతన్యరహితమై నిద్రావస్థ
యందు మునిగియున్న హిందూసంఘముమీద నొక బ్రహ్మా
స్త్రమువలెను పడినది. బాల్యవివాహములును, వృద్ధవివాహ
ములును సనాతనధర్మసదాచారములయిన హిందూసంఘము
నందు వివాహతత్త్వార్థమే దుర్బోధ్యమయి వివాహము నిందా
పాత్రమైనది. బాల్యవివాహములను నిర్మూలముచేయుటకు
హరవిలాస శారదాగారు కంకణమును గట్టుకొనిరి. లక్షల
మంది స్త్రీలు, పురుషులు శారదగారి ప్రయత్నములను కొని
యాడి సఫలముచేయుటకు దీక్షను బూనిరి. పూర్వాచార
పరాయణులు శారదాబిల్లును ఖండించి నిరసించిరి. కాని
ప్రజాసామాన్యమునకు వివాహధర్మమును సువ్యక్తము చేయుట
పండితులకు ధర్మమై యున్నది. శ్రీమల్లయ్యశాస్త్రిగారి ధర్మ
మును బాగుగను వ్యవహరించినవిధమును వారిగ్రంథము
వెల్లడిచేయుచున్నది. శాస్త్రిగారు వారి గ్రంథమునందు వివా

హాత్త్వమును శాస్త్ర ప్రమాణములతోను, లౌకికపారమార్థిక దృష్టితోను, హేతువాదముతోను చేసిన విమర్శనము సనాతనులకును, సంస్కారులకును పఠనపరిశీలనార్హముగ నున్నది.

వివాహస్వరూప స్వభావము:—వివాహ కర్మయందు కన్యాదానము, శచీపూజ, వివాహము, చతుర్థియను నాలుగు కర్మలు కలవు. వివాహకర్మ కన్యాదానముతో నారంభమై గర్భాధాన హోమాది కర్మలతో ముగియుచున్న విధమును వేదమంత్రములు, ధర్మశాస్త్రములు, పురాణములు, కర్మకాండలు వెల్లడి చేయుచున్నవి. వివాహమునకు పరమార్థము భార్యాభర్తలకు సాహచర్యము, సహవాసము, సహధర్మచర్యము, సంతానము. ఈపరమార్థప్రాప్తికి స్త్రీపుంసయోగమే శరణ్యము. ఈపరమార్థము యౌవనులవలనను సాధ్యము కాని కౌమారులవలన సాధ్యము కాదు. సంతానమున కనుకూలమైన వివాహము వివాహనామమునకు దగియుండును. కన్యాత్వమునకు భంగమును గర్భాధానము గలుగజేయుచున్నది. వివాహఫలము కన్యాదానపాణిగ్రహణకర్మలతో గాకను, గర్భాధాన హోమకర్మల మూలమునను సిద్ధించుచున్నది. మల్లయ్యశాస్త్రిగారు శాస్త్రార్థమువలనను, ఆచారకాండమూలమునను రజస్వలానంతర వివాహములే వివాహకర్మకు దగియున్నటులు నిరూపించిరి. రజస్వలానంతర వివాహములును, శారదావివాహశాసనములును ధర్మశాస్త్రసమ్మతము లని ధర్మశాస్త్ర పరిశోధనలు విశదము చేయుచున్నవి. వివాహతత్త్వాంతర్భూతములైన సమావేశనము, భర్తృగోత్ర

ప్రాప్తి, యువతి వివాహము, ఋతుమతీదానము, స్త్రీప్రసవనము, స్నాతకము, బాలికావివాహము, స్త్రీపునర్వివాహము మొదలగు విషయములు శాస్త్రప్రమాణముగను గ్రంథమునందు వేర్వేరధ్యాయములందు మీమాంసాశాస్త్రానుసారముగను విమర్శించి నిర్ణయింపబడినవి. గ్రంథమునందలి క్రిందివాక్యములు ధర్మశాస్త్ర ప్రమాణములు:—

"నీకు గృహకృత్యమున తోడుగానుండుటకును, సంతానముకనుటకును ఈకన్య నిచ్చుచున్నాను"

"ధర్మార్థకామములలో ఈకన్య నెడబెట్టరాదు."

"సంతానముకొఱకు నీచేయి పట్టుకొన్నాను. నాగృహమున కధికారిణిగా నిన్ను సోమగంధర్వాగ్నులు నాకు నిచ్చినారు."

"మన మిద్దఱము ఏడడుగులు నడిచినందువల్ల స్నేహితులమైనాము. సుఖించుము. నేను సుఖింతును. మన మిద్దఱము ప్రమాణము చేసుకొనుచున్నాము. మనము చేయబోవు పను లొకరితో నొకరు చెప్పకొందము. క్షేమించి యుండుదము. మంచిమనసుతో నుండుదము. అన్న వస్త్రముల ననుభవింతము. ఆకాశము భూమియువలెను, సామఋగ్వేదములవలెను ఎడబాయకుందము. నేను బీజమును, నీవు బీజమును ధరించుదానవు. నిన్ను పుత్రులకొఱకు సంపదకొఱకును పెండ్లాడుచున్నాను. నన్ననుసరించి యుండుము. సత్యము తప్పనిదానివై నావెంట రమ్ము."

"నాపెనిమిటి దీర్ఘాయువన్తుండగునుగాక. సంతానము గలుగునుగాక. శత్రువులు వీగిపోదురుగాక. మేము మంచిమనసుతో నుండునట్టు దేవత లనుగ్రహింతురుగాక."

"ఈయిల్లు నీది. ఇవిగో నాపశువులు, ధనము, వస్తువులు."

"ఓపుత్రులను కోరుచున్న ప్రియురాలా! నేను నీకు పుత్రరూపముగా పుట్టుదును."

"విశ్వేదేవతలు మన హృదయములను కలుపుదురుగాక."

"ఓ ప్రియుడా! నీవు నాయందు పుట్టుము."

ప్రపంచధర్మపరిణామమునందు వివాహ ధర్మపరిణామము మానవస్వాతంత్ర్యధర్మపరిణామమునకు కీలకము. స్త్రీపుంసయోగోద్భవమైన ప్రపంచధర్మ పరిణామమునకు స్త్రీపురుషులు సమానాబాధ్యాధికారులు. పురుషులు బలశౌర్యప్రతాపములను వినియోగించి వివాహములను జేసికొనిన విధమునకు రాక్షసాసురగాంధర్వ పైశాచాది వివాహములు ప్రమాణములు. స్త్రీ స్వాతంత్ర్యవివాహములును కొన్ని దేశములందు సదాచారములు. వరశుల్క, కన్యాశుల్క వివాహములును నీ తరగతికె చెందుచున్నవి. ప్రపంచకల్యాణనిమిత్తములైన మానవకల్యాణములు పరమార్థకల్యాణములు గావలసిన విధమునకు శ్రీవాణీగిరిజాకల్యాణాదులు ప్రమాణములు. వివాహములందు పురుషులకు గల స్వాతంత్ర్యము స్త్రీలకును నవసరమని మానవధర్మాభ్యుదయము చాటుచున్నది. జీవయాత్రయందు స్త్రీ, పురుషునకు సహధర్మచారిణి. ఆత్మస్వరూపమును ధరించి, భరించి, కని, పోషించి రక్షించుచున్నది. ఆత్మస్వరూప సంరక్షణమును జేయగల మాతృశక్తి యమేయము. మాతృశక్తి ఆత్మను మాతృస్వరూపముననను కనుచున్నది, భార్యారూపముననను సృష్టించుచున్నది. ఆత్మజననమునకును, పుత్రజననమునకును కీలకమైన స్త్రీపుంసయోగ వివాహము ప్రపంచపరిణామమునందు పరమార్థధర్మము. దాంపత్యానురూపమైన సంతానము గలుగుట శాస్త్రపురాణేతి

పశన ప్రసిద్ధవిషయము. ధృతరాష్ట్ర పాండురాజ విదురుల జననోదంత మీపరమార్థమునకు ప్రమాణము.

వివాహమునందు కన్యాదానమహత్త్వమువలెను, వరదాన మహత్త్వమును గ్రహించుట మానవకల్యాణసాధ్యమైన ప్రపంచకల్యాణమునకు పరమార్థము. వివాహబీజమే లేని అతిబాల్యవివాహములును, వివాహకీలకము లేనిబలవంతపు వివాహములును, వివాహశక్తిలేని సామంత వివాహములును కామార్థభోగపరాయణములై వివాహప్రయోజనమునే నిర్మూలము చేయుచున్నవి. పురుషులవలె స్త్రీలును ధర్మార్థకామమోక్షములకు సాధకాధికారిణులు. వర్తమానమానవస్వాతంత్ర్యసంరంభసమయమునందు ప్రపంచశాంతికిని, మానవకల్యాణమునకును స్త్రీ ధర్మాభ్యుదయ సంరక్షణములు పరమసాధనములు. స్త్రీ ధర్మాభ్యుదయమునకు వివాహస్వాతంత్ర్యము కీలకము. ధర్మశాస్త్రము లేమినిర్ణయించుచున్నను, నిర్బంధ బాల్యవివాహములు క్రమముగ తగ్గుటయును, శారదాశాసనము ప్రయోగయోగ్య మగుటయును బహిరంగరహస్యములు.

యువతీవివాహములు, సామాన్యము లగుచున్న సమయమునందు ధర్మశాస్త్రాన్వేషణ మనవసర మైనను, ప్రపంచ పరిణామమునందు వివాహధర్మ పరిణామ జ్ఞానము సందేహనివృత్తికిని, కార్యాచరణమునకును సాధనము. శ్రీ కావ్యతీర్థ పురాణవాచస్పతి బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు రచించిన వివాహతత్త్వము వారి మీమాంసాసామర్థ్యమును, ధర్మనిరీక్షణశక్తిని, శాస్త్ర పరిశోధనపాండిత్యములను విదితము చేయు

చున్నది. శాస్త్రీగారు చేసిన వివాహతత్త్వ సమన్వయము శ్లాఘ్యమై ప్రజాదరణమునకు పాత్రముగ నున్నది. సనాతన ధర్మాభిమానులును, సంస్కారప్రియులును గ్రంథమును చదివి సకలార్థసాధనమైన వివాహధర్మోద్ధరణమునకు బూనుకొనుట శ్రేయస్కరము.

హిందూసంఘమునందు వివాహము మతసంస్కార మైనను స్వధర్మవిఘాతమైన సంస్కార మారాధ్య యోగ్యము గాదు. మతసంస్కారములును పురుషార్థమైన స్వధర్మ నిర్వహణమునకు సాధనములు. సంసారయాత్రయందు జగదాధార మైన ధర్మనిర్వహణమునకు ధర్మవివాహము సులభసాధనము. సంసారయాత్రను ధర్మానందయాత్రనుజేయుటకు స్వధర్మపరాయణమైన వివాహము సువ్యక్తసాధనము. సంసారప్రవృత్తి యందు శాంతసుందరశివానందానుభవమునకు శృంగారకరుణారసానందానుసంధానమైన ధర్మదాంపత్యము కీలకము. ధర్మ దాంపత్యమునకు బాల్యవివాహములును, నిర్బంధశుల్కవివాహములును ప్రతిబంధకములై వివాహప్రయోజనమును విధ్వంసము చేయుచున్నవి. పురుషార్థసాధనమైనవివాహము కేవలము పురుషులకామభోగార్థములకుగాకను త్యాగప్రేమపరాయణమైన ధర్మయాత్రకును, సుఖదుఃఖముల కద్వైతసిద్ధిగలుగుటకు పరమార్థసాధనమగుటకు వివాహతత్త్వార్థమును పండితులు, పామరులు గ్రహించి కృతార్థులగుటకు భగవంతు డనుగ్రహించుగాత !

యువ సం. జ్యేష్ఠ
బ. ౧౨ గురువారం

కా. నాగేశ్వరరావు

శ్రీమాత్రేనమః, గణపతయేనమః

# వివాహతత్త్వము

## ప్రథమభాగము

---

### ప్రమాణవివేకము

ధర్మశాస్త్రములు విమర్శించునపుడు విజ్ఞానేశ్వరుడు మాధవాచార్యులు మొదలగు మన పూర్వులు పూర్వమీమాంసా న్యాయముల ననుసరించియే తమతమ వ్యాఖ్యానములలో ధర్మనిర్ణయమును చేసియున్నా రనుట, ఆగ్రంథములను పరిశీలించినచో స్పష్టమగును. అట్లే నాగ్రంథమున గూడా మీమాంసాన్యాయముల ననుసరించియే ధర్మనిర్ణయము చేయుదును.

౧. ధర్మమును నిర్ణయించుటకు ప్రమాణములు మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములును, పురాణములును, ఆపస్తంబుడు,ఆశ్వలాయనుడు మొదలగు వారి గృహ్యసూత్రములును, ముఖ్యముగా వేదమును ప్రమాణము లని యందరును అంగీకరింతురు. వాటినే నేనును విమర్శించి చూపుదును. ఏవిషయమైనను ఇది యీలాటిది అని నిర్ణయించుటకు ప్రమాణములు నాలు గని శాస్త్రవేత్త లంగీకరించిరి. అవి ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము అనబడును. వేదము, మన్వాదిస్మృతులు, పురాణములు, గృహ్యములు మొదలయిన గ్రంథము లన్నియును శబ్దప్రమాణము.

ప్రత్యక్ష మనగా విషయమును ఇంద్రియములద్వారా నిర్ణయించుట. ఉదా. అగ్ని వేడిగా నున్న దని నిర్ణయించుట చేతితో దానిని తాకితే

తెలియును దానిని తెలియుటకు గ్రంథములు విమర్శించ నవసరము లేదు. అనుమానప్రమాణ మెట్టిదంటే తలుపులు మూసికొని యింటిలో కూర్చు న్నపుడు గర్జనధ్వని వినినవెంటనే ఆకాశమున మేఘ మావరించియున్న దని నిర్ణయింతుము. అనగా సరియైన హేతువులనుబట్టి మనకంటికి గోచ రించనివిషయమును నిర్ణయించుట. ఉపమాన మనగా ఒక విషయమును ప్రత్యక్షముగా చూపి దేశాంతరమందున్న అప్రత్యక్షవిషయమును తెలియని వారికి బోధించుట. ఉదా. అడవిలోని కెపుడును ప్రవేశించని గ్రామవాసికి పులి యెట్లుండునో తెలియదు. పులి నెఱిగినవాడు గ్రామములో నందఱు నెఱిం గిన పిల్లిని జూపి "పులియాకారము పిల్లిని బోలియుండును" అని బోధించును. ఆపిమ్మట వాడొకప్పుడు పులిని చూడగానే వెనుక తాను వినినదానిని జ్ఞాప కము తెచ్చుకొని పిల్లినిబోలియున్నది గావున "ఇది పులి"యని తెలిసికొనును.

౨. ఇక శబ్దప్రమాణమను ధర్మగ్రంథములు విమర్శింతము. ధర్మశాస్త్ర ములలో నేవి ప్రమాణములో, ఏవి అప్రమాణములో నిర్ణయించుటకు విద్యారణ్యులవారు ఒకసూత్రమును దెల్పినారు. అదేమన—

"మానాంతరావిరుద్ధానాం
మన్వాది స్మృతీనాం ప్రామాణ్యమ్."

అని. ప్రత్యక్షము మొదలయిన యితరప్రమాణములకు విరుద్ధముగానట్టి మను స్మృతి మొదలగు గ్రంథములే ప్రమాణములు. దీనినిబట్టి శబ్దప్రమాణముతో చెప్పినవిషయము ఒకవేళ ఇతరమయిన ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధ మయితే అది ప్రమాణము కానేరదు అని తాత్పర్యము గ్రహింపవచ్చును. అనగా అగ్ని చల్లగా నుండును అని ఒకగ్రంథమున వాక్యము ఒకవేళ కనం బడినట్లయితే అది ప్రత్యక్ష ప్రమాణమునకు విరుద్ధ మగుటచేత గ్రాహ్యము కానేరదు. కావున ఆ వాక్యము ప్రమాణము కాదు. ఇట్లే యితరప్రమాణ ములకును ప్రామాణ్య మూహింపవలెను.

3. ఇదికాక యింకొకవిధముగాగూడా స్మృతివచనములుగాని పురాణవచనములు గాని ఇవి "ప్రమాణములు, ఇవి అప్రమాణములు" అని నిర్ణయించుటకు సూత్రము గలదు. —మనుస్మృతి - అధ్యా ౧౧, శ్లో-౯౬.

"ఉత్పద్యంతే వ్యథన్తేచ యాన్యతోఽన్యాని కానిచిత్,
తా న్యర్వాక్కాలికతయా నిష్ఫలా న్యనృతానిచ,
యావేదబాహ్యాః స్మృతయో యాశ్చకాశ్చ కుదృష్టయః."

ఇత్యాదిగా చెప్పినాడు. కొన్ని వచనములు మధ్యవారు కల్పించుదురు. అవి కొన్నాళ్లు నిల్చి నశించును. కావున నిట్టి యితర వచనములు అనగా మనుస్మృతికి దరిమిలావి నిష్ఫలములు అనృతములును అగును. వేదమును అనుసరించనివిన్నీ కుత్సితదృష్టితో చేసినవిన్నీ ప్రమాణములు కానేరవనీ దాని తాత్పర్యము. దీనినిబట్టి చూచితే మన మిపుడు చూచుచున్న గ్రంథము లన్నీ ప్రమాణములు కానేర వనిన్నీ, విమర్శించి చక్కగా ప్రమాణములు కనిపెట్టవలసియున్నదనిన్నీ మన మూహింపవలయును. మనువులోనే "వేనే రాజ్యం ప్రశాసతి" అన్న శ్లోకము మధ్యవారలు చూర్చినారు. వేనుడు మనువు మనమల మనమడు మనువునాటి కెట్లు వచ్చెను.?

౪. ఒకస్మృతిలో చెప్పినవిషయమే మఱొకస్మృతిలోగూడా కనబడుచున్నది. దానివల్ల వేరువేరుకాలములయందు వేరువేరు ఋషులచేత నాయాగ్రంథములు వ్రాయబడిన వని యూహింపవచ్చును. కాని కొంద ఱనుకొన్నట్లు అన్ని గ్రంథములును ఏకకాలమందే వ్రాయబడిన వనుట అసంగతము. వేరువేరుచోట్ల, వారు వ్రాసినా రని వీరికిని, వీరు వ్రాసినా రని వారికినీ, తెలియక సమాన విషయములను వ్రాసియుందు రనియైనా ఊహింపవలెను. లేకుంటే పునరుక్తి రానేరదు.

౫. ధర్మశాస్త్రవచనములకు తాత్పర్యము నిర్ణయించుటకు సూత్రము కూడా మాధవాచార్యులవారే వ్రాసినారు.

"ప్రతీతేఽర్థేఽఖిలం శాస్త్రం ప్రమాణం బాధయా వినా"

అని. ఏవచనమునకుగాని తాము చెప్పినతాత్పర్యము ఇతరవచనములకు గాని, యితర ప్రమాణములకుగాని బాధకము కానంతవరకును ప్రమాణమే. బాధకమంటే యితర ప్రమాణములకు వ్యతిరేక మనుట. చిట్టచివర నింకొకమాట కూడా చెప్పినారు. అదేమన—

"ఫలంతు జగన్నిర్వాహః"

మనము చర్చించి తేల్చిన వచనతాత్పర్యము లోకమునకు క్షేమమును గలుగజేయునది యైయుండవలెను- అని దానితాత్పర్యము. మఱియు నీసందర్భములోనే, ఒక వచనమున కర్థము ఒక రొకలాగున చెప్పినారు, మఱొకరు మఱొకలాగున చెప్పినారు. ఈరెంటిలో నేది ప్రమాణ మంటే ఎవరు చెప్పిన యర్థమువల్ల ధర్మశాస్త్రమున మఱొకవచనము ప్రవర్తించుటకు అవకాశము లేకుండునో ఆయర్థము తప్పు. కావున రెండుశ్లోకములయర్థమున్ను సార్థకమగుటట్లుగానే నప్పి తాత్పర్యము చెప్పవలెను.

౭. "సంయోగినోశ్చ" అను మీమాంసాన్యాయము ననుసరించి ఒకవిషయమై యెన్నెన్ని యితరగ్రంథములలో వచనము లుండునో యన్ని వచనములను ఒకచోటకు దెచ్చి అన్నింటికీ ఐక కంఠ్యము కలిగేటట్లు ఒక తాత్పర్యము చెప్పవలెను. అట్లు చెప్పుటకే ఏకవాక్యత యని పండితు లందురు. ఏకవాక్యత ననుసరించని విమర్శనమును ప్రమాణము కా దందురు. ఆయాచారము ననుసరించియే నేను వ్రాయు నీగ్రంథమందుగూడా ఏకవాక్యతను గమనించుచునే తాత్పర్యము తేల్చుదును. ఒకవేళ పరస్పర విరుద్ధమైన రెండు విషయములను బోధించువచనము లుంటే బహుగ్రంథములేకీభవించిన తాత్పర్యమే ప్రమాణముగా తీసుకొని తక్కినవాటిని త్రోసివేయవలెను. సమసంఖ్యాకలప్పుడు ఆరెండువిషయములును ప్రమాణములే.

¹కల్ప మని పేరు.

"విరోధో యత్ర వాక్యానాం ప్రమాణం తత్ర
భూయసామ్." కాత్యా.

౭. మహర్షోక్త విషయము ముఖ్యము.

"స్మృతే ర్వేదవిరోధే తు పరిత్యాగో యథా భవేత్,
తథైవ లౌకికాచారం స్మృతిబాధా త్పరిత్యజేత్."

వేదములో చెప్పిన విషయమునకు విరుద్ధముగా చెప్పిన స్మృతులు, పురాణాదులు ప్రమాణములు కావు. అట్లే స్మృతులకు, పురాణములకును విరుద్ధమయినవిషయమును చెప్పు లోకాచారము అప్రమాణము. అనగా స్మృతులలో చెప్పినదానికి విరుద్ధముగా లోకాచారముంటే అది విడువదగినదే యగునని తాత్పర్యము.

అయితే లోకాచారము ధర్మమునకు ప్రమాణము కాదా? అందురేమో వినుడు. ఏవిషయము శ్రుతిస్మృతులలో చెప్పబడనిదో అది లోకాచారమువల్లనే తెలియవలసియున్నది. దాని కాచారమే ప్రమాణము.

ఉదా. పెళ్లికూతురి మెడలో కట్టే మంగళసూత్రమున పుస్తె గుండ్రడగా ఉండవలెనా, లేక తమలపాకుమాదిరిగా ఉండవలెనా? అని ప్రశ్న వచ్చినపుడు వారిదేశాచారము వారికులాచారము ఎట్లుంటే అట్లే చేయవచ్చును-అని సమాధానము చెప్పుకోవలెను. వేదములోగాని ధర్మశాస్త్రములలోగాని పుస్తెనుగుఱించిన విషయమే లేదు.

౮. ధర్మశాస్త్రములు ఇవి ప్రమాణ మయినవి యని యాజ్ఞవల్క్య ఋషి తనస్మృతిలో చెప్పినాడు.

"మన్వత్రివిష్ణుహారీత...... ధర్మశాస్త్ర ప్రవర్తకాః"

అని. మనుస్మృతి - అత్రిస్మృతి-విష్ణు - హారీత-యాజ్ఞవల్క్య-ఉశన - అం

గిర-యమ-ఆపస్తంబ-సంవర్త - కాత్యాయన-బృహస్పతి-పరాశర-వ్యాస - శంఖలిఖిత-దక్ష-గౌతమ-శాతాతప-వసిష్ఠ - అని పందొమ్మిది స్మృతులు పేర్కొనబడినవి. ఇటీవల మఱి కొన్ని పేర్లతో వచనములు కనబడు చున్నవి. అవి యిటీవల కల్పించిన వనవలసియున్నది. మీాద వివరించిన స్మృతు లన్నియు "స్మృతిసముచ్చయ" మను పేరున నాగరాక్షరము లతో అచ్చుపడియున్నవి.

౯. స్మృతులు పురాణములు కాక ధర్మమును బోధించునట్టివి గృహ్యసూత్రగ్రంథములును గలవు. అవియును పూర్వఋషులు చెప్పినవే. ఈ గృహ్యసూత్రములు ఎందు కంటే—స్మృతులలో చెప్పిన కర్మలకు ఫలానాఫలానామంత్రముతో ఫలానాఫలానాకర్మ చేయవలయును అని బోధించును.

"మన్వాదయః ప్రయోక్తారో ధర్మశాస్త్రస్య కీర్తితాః,
తత్ప్రియుక్త ప్రయోక్తారో గృహ్యకారాస్తు మంత్రతః."

అని వైద్యనాథదీక్షితీయావచనము గలదు.

౧౦. మనుస్మృతి. అ. ౧౧ శ్లో ౧౦౫-౧౦౬లో ధర్మమును శుద్ధమయినదానిని తెలుసుకొనుటకు ముఖ్యమయినవి మూడు ప్రమాణము లని చెప్పబడెను.

"ప్రత్యక్షుం చానుమానంచ శాస్త్రంచ వివిధాగమమ్,
త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధి మభీప్సతా."

ప్రత్యక్షము, అనుమానము, వేదము మొదలగు శబ్దప్రపంచము అని. తరువాత,

"ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా,
యస్తర్కేణాభిసంధత్తే స ధర్మం వేద నేతరః."

ఎవడు వేదాలకు శాస్త్రాలకును విరోధించని తర్కముతో అనగా మీమాంసాశాస్త్రానుసారముగా ఋషిప్రోక్త మయిన ధర్మశాస్త్రమును విమర్శించునో వానికే ధర్మము తెలియును, తదితరునకు తెలియదు – అని యర్థము. ఈవిషయమున అద్వైతబ్రహ్మసిద్ధిలో ని ట్లున్నది. ౨౪ పుట. కలకత్తా ప్రతి.

" పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగవిస్తరః,
వేదాః స్థానాని చత్వారి ధర్మస్యచ చతుర్దశ. "

అను యాజ్ఞవల్క్య వచనమును వ్యాఖ్యానించుచో " వ్యాకరణ శాస్త్రేణ పదవ్యుత్పత్తౌ జాతాయాం న్యాయవైశేషికదర్శనాభ్యాం పదార్థవ్యుత్పత్తిః, అనన్తరం మీమాంసా = వేదవాక్యార్థ విచారః. తస్మాచ్చ ధర్మస్వరూప జ్ఞానం తదనుష్ఠానంచ భవిష్యతి " వ్యాకరణమువల్ల పదవ్యుత్పత్తి కలిగిన తరువాత తర్కశాస్త్రమువల్ల పదార్థము బోధపడును. అటుపిమ్మట మీమాంసవల్ల ధర్మస్వరూపము తెలియును. ఆతరువాత ధర్మమును ఆచరించుట కలుగును అని యర్థము.

౧౧. వచన మంటే వాక్యము. వేదవచనములు గాని ధర్మశాస్త్రాది వచనములు కాని మూడువిధములుగా విభజింపబడినవి. విధులని – నిషేధములని – అర్థవాదము లని, ఉదా. ప్రతిదినమును సంధ్యావందనము చేయవలెను అనునది విధివాక్యము. కల్లు త్రాగకూడదు అన్నది నిషేధవాక్యము. ఇక నర్థవాద మనేది రెండు విధములు. ఒకవిషయమును స్తుతించునది యొకటి. ఒక విషయమును నిందించునది యొకటిన్నీ. ఉదా. నూతులు చెఱువులు త్రవ్వించితే పుణ్యము వచ్చును—అన్నది స్తుతి. దీనివల్ల అట్టిపని చేయుటకు ఉత్సాహము గలిగించును. విధి ప్రత్యక్షముగా ఫలానాపని చేయవలె నని బోధించును. స్తుతి యట్లు చెప్పక ఫలానాపనిచేసితే ఫలానా

లాభము అని మాత్రమే బోధించును. ఇక నిందార్థవాదము చాల సూక్ష్మ దృష్టితో చదువరులు గ్రహింపవలసియున్నది.

...చేతితో నీరు త్రాగితే నరకములో పడుదురు అన్నది. ఎడమ రు దాహము త్రాగరాదు అని నిషేధము చెప్పలేదు. అట్లు నరకహేతు వని నిందించినాడు. ఇట్టివచనములు నిషేధము లన లనంబడును. నింద నిందింపబడిన విషయమును నిందించుటకు తదితరమునకు స్తుతి యనిన్నీ మీమాంసాన్యాయము చెప్పును.

“నహి నిందా నింద్యం నిందతి కింతు, ఇతరస్య స్తుతిః”

అని. ఈనిందార్థవాదములవల్ల ప్రయోజన మేమంటే నిందించబడినవిషయముకంటె తదితరము శ్రేష్ఠము అనునదియే. దీనినిబట్టి విచారించితే మీద జూపినయుదాహరణవల్ల ఎడమచేతితో నీరు త్రాగుటకంటె కుడిచేతితో త్రాగుట మంచిది అన్నబోధ కలుగును. నిషేధించినవిషయము చేయచేరాదు. నిందించినవిషయము చేయుట అప్రశస్తము. అవసరము వచ్చినపుడు చేసినను దోషములేదు అని దీని తాత్పర్యము. నిందానిషేధముల భేదము తెలియక చాలామంది భ్రమపడుచున్నందున ధర్మములు తారుమా రగుచున్నవి. ఈ ప్రకరణమును బాగుగా ముందు మనసున కెక్కించుకొననివారు నావిమర్శనమును ఇకముందు గమనింపజాలరు. ఆయాయిచోట్ల నీవెనుక జూపిన పదకొండు సూత్రములును నావాదమున జూపబడును.

ఇది ప్రమాణవివేకము - ప్రథమభాగము

# వివాహతత్త్వము

## ద్వితీయభాగము

---

### వివాహస్వరూపము

వివాహతత్త్వమును విమర్శించవలసినపుడు గృహ్యసూత్రములలో వివాహములోని కర్మలును ఆప్రక్రియయును వరుసగా తెలియవలసి యుండును గావున దానిని ముందుగా చూపుచున్నాను. బ్రహ్మచర్యము పూర్తియయినవెంటనే గురువువద్ద సెలవు పుచ్చుకొని స్నాతక మనుకర్మను అచటనే చేసుకొనవలెను. స్నాతకు డైనవెంటనే వివాహమాడుటకు అధి కారి యగును. బ్రహ్మచర్యములో నున్నంతకాలమును పిల్లనడుగుటకుగూడా హక్కు లేదు. వివాహమునకు హక్కును బొందినవానికి వరు డని పేరు. ఇట్లే వివాహమునకు హక్కును బొందినస్త్రీకి వధు వని పేరు. అంతవరకు కన్య. వరుడు తనయింటిలోనే వివాహకర్మ జరిపించుకొనుటకు అప్పటి కప్పుడు ఒక గృహమును నిర్మించుకొనవలెను. దీనికి బదు లిప్పుడు పందిరి వేయుచున్నాము. ఆగృహము నలంకరించుకొని అదివరకుతనవారలనివాసమగు నింటినుండి శకునమంత్రములు చదువుకొనుచు వివాహగృహమునకు రావలెను.

“నే జేయబోవు కర్మకు అపశకునములు రావలదు. వచ్చిన యపశకునముల ఫలము శత్రువులకు చెందునుగాక. నాకు శుభములు రుద్రు డిచ్చును గాక.” అని ఆమంత్రార్థము. వివాహగృహమునకు వెళ్లి “గృహస్థధర్మ కార్యములు చేయుటలో నాకు సహాయురాలుగా నుండుటకును, సంతానము కనుకొనుటకునుగా నొక స్త్రీని ఉద్వాహము చేసుకొనుచున్నాను” అని

సంకల్పించవలెను. తరువాత తనయందు స్నేహభావము కలిగి వేదము యొక్క అర్థజ్ఞానముకల నలుగురు బ్రాహ్మణులను పిలిచి "మీరు నాకొఱకు కన్యను అడిగి రండు" అని చెప్పవలె. వారు "అట్లే అడిగెదము" అని బదులు చెప్పుదురు. వారు బయలుదేరునపుడు తాను రెండు మంత్రములు చదువవలయును. "మీరు పోవుదారి తిన్ననై సుఖమును ఇచ్చుగాక. ఇంద్రుడు, అర్యముడు, భగుడు, అనే ముగ్గురుదేవతలున్ను దారిలో మిమ్మ రక్షించుగాత" అని మంత్రార్థము.

వారు కన్యాదాతయింటికి వెళ్లి "అయ్యా! మీకన్యను మేమొకని కడుగుచున్నాము. వాని తండ్రిపేరు ఫలానా, తాతముత్తాతలు ఫలానావారు, వానిపేరిది, గోత్ర మిది" యని స్పష్టపఱుతురు. పిదప కన్యాదాత "అడగండి యిస్తాను" అనవలెను. ఉదకము ముట్టి యిస్తా నని చెప్పవలెను. ఇది వాగ్దానము. ఈచోట హోమముకూడా కొన్ని దేశములలో చేతురు.

తరువాత నీబ్రాహ్మణులు వరునియింటికివచ్చి జరిగినసమాచారము చెప్పి వరుని తోడ్కొని దాతయింటికి పోవుదురు. కన్యాదాత వరునకు అర్ఘ్య మిచ్చును. కాళ్లు కడుగును. అతనిచేతిలో పాలు పెరుగు తేనె కలిపిన మధుపర్క మనేదానిని పోయును. వరుడు దానిని త్రాగును. దాత తనయింట వరుని భోజనము చేయు మని కోరును. అతడు మాంసాహారి యయితే మాంసముతోను లేకుంటే మాంసము లేకుండాను భోజనము పెట్టవలెను. ఆసంగతి తెలియుటకు గోవును వరునియెదుటికి తెచ్చి చూపవలెను. అతడు మాంసాహారి అయితే "సరే" యనును. శాకాహారియయితే "విడిచివేయుడు" అని పలుకును. అదే అచట గుర్తు. ఇపుడు ఆచోట "గౌః" అనుచు ఒకి దర్భకట్టను చూపుదురు. "ఓ ముత్సృజత = (సరే. విడువండి) అని వరుడు పలుకుచున్నాడు. పూర్వకాలమున నీచోట చూలు తగలని ఆవుపడ్డను చంపి ఆమాంసము వండి పెట్టేవారు. అపని మానినా ఆమాటలుమాత్ర మిప్పటికీ పెండిండ్లలో చెప్పుచున్నారు. వరునిభోజనా

న్తరము కన్యాదానము చేయును. "నీకు గృహకృత్యమున తోడుగానుండు టకును సంతానము కనుటకును ఈకన్య నిచ్చుచున్నాను" అని చెప్పుచు న్యచేతిని వరునిచేతిలో ఉదకముతోగూడా ఇచ్చును. వాగ్దానకాలమందు ఇస్తానని సంకల్పము, ఉదకదానకాలమందు ఇచ్చుచున్నానని సంకల్పమును చెప్పుదురు. కన్యాదానకాలమందు వరునకు తనశక్త్యనుసారము దక్షిణ ఇవ్వవలెను. కొన్నివివాహములలో "ధర్మార్థకామములలో ఈకన్య నెడ బెట్టరాదు" అని కరారు చేయింతురు. కొన్నిటిలో అక్కర లేదు. ఇప్పటి వివాహములలో నీమాట తప్పకుండా చెప్పించుచున్నారు. దీనివిషయము మున్ముందు వివరింతును. వధూవరులతలమీద బెల్లముతో కలిపి ముద్దచేసిన జీలకఱ్ఱ నుంపింతురు. ఇచట నొకవిశేషము చదువరులు గమనించవలెను. సిద్ధాంతులచేత నిర్ణయింపించుకొన్న వివాహముహూర్తకాలమందే కన్యా దానము దానితోనే జీలకరబెల్ల ముంచుట సర్వత్రా ఆచారముగా నున్నది. ఉపనయమునలోకూడా బ్రహ్మోపదేశకాలమందు పిల్లవానితలమీద జీలకర బెల్ల ముంతురు. వివాహములో కన్యాదానకాలమం దుంచుచున్నారు. దీనినిబట్టి ఉపనయనములో బ్రహ్మోపదేశ మెంత ముఖ్యమయినకర్మయో వివాహమున కన్యాదాన మంత ముఖ్యమయినకర్మ యని మనవారల యభి ప్రాయ మని యూహింప నవకాశము గలదు. ఇంతతో తండ్రి చేయవలసిన పని వివాహములో ముగిసినది. సర్వగ్రంథములలోను ఇపుడు పురోహితులు చెప్పుచున్న మంత్రతంత్రములలోనుకూడా తల్లిదండ్రులపని యికమీద రవంతయు లేదు. ఇపుడు వివాహములలో కన్యాదానము తరువాత వధూవరుల తలిదండ్రులచేత చేయించుచున్న యితరపను లన్నీ యిటీవలవారి స్వకపోల కల్పితములే. ఇంతవరకు జేసిన కర్మపేరు ఉద్వాహ మనబడును. ఉద్వాహ మంటే పెండ్లాడుటకు కన్యను ప్రతిగ్రహించుట అని యర్థము. ఇది కన్యా సంస్కారము. ఇపుడే కన్య వధు వయింది. ఉద్వాహము వివాహమునకు సాధన మని తెలియవగును. కన్యాదాన మయినవరకును కన్యను వరుడు

చూడను. దానానన్తరము మంత్రములతో కన్యనుచూచును. ఈమంత్రములు కన్యకుండే దోషములన్నీ పోవుటకు అని వాటి యర్థమునుబట్టి తెలియుచున్నది.

అటుతర్వాత వధూవరు లిద్దఱును సంకల్పింతురు. ఎట్లన "మన మిద్దఱము కర్మలు చేయుదము, పిల్లలను కనుకొందము" అని. ఇక్కడ నుండి వివాహప్రారంభము. ఉద్వాహము కన్యకే సంస్కారము. వివాహము ఉభయులకును సంస్కారమే. కనుకనే ఉద్వాహములో వరు డొక్కడే తనయింట ఉద్వాహము చేతును అని సంకల్పించినాడు. కన్య యేమీ ప్రత్యేకము సంకల్పించలేదు. వివాహములో నిద్దఱును సంకల్పించినందున అట్లు చెప్పవలసియున్నది. తరువాత వరుడు కన్యకయొక్క బొమలనడుమ నుండి మంత్రముతో నొకదర్భపుడకను తుడిచి కన్యతలమీదుగా ఆమె వెనుకకు పారవేయును. కన్యాదోషము లన్నీ దానితో పోవు నని మంత్రార్థమువల్ల తెలియుచున్నది. ఇట్లే కన్యాదోషనివారణమునకే దుక్కిపూజు (కాడి) కన్నములో బంగార ముంచి కన్యతలమీద నభిషేకింతురు. అభిషేకోదకము మంత్రములతో బ్రాహ్మణులు తెచ్చియిత్తురు. స్నానానన్తరము రెండు వస్త్రములు కన్య కివ్వవలెను. అవి ఉత్తరించినవి కారాదు. ఒకదర్భత్రాడు కట్టి బట్టమీదనుండి మూడుచుట్లుగా కన్యమొలకు కట్టుదురు. ఈపనులన్నీ మంత్రములతోనే చేయుదురు. తరువాత పుస్తె గట్టుచున్నారు. మంత్రము లేదు. గ్రంథములలో ఋషులు పుస్తెనుగురించి యేమీ వ్రాయలేదు. కొందఱు పుస్తె మొదటనేకట్టి దానము తర్వాత చేతురు. ఉత్కళబ్రాహ్మణులలోను మఱికొన్ని దేశములలోను పుస్తె కట్టనేకట్టరు. మనదేశములో పురోహితు లొకశ్లోకము చదువుదురు. అది మంత్రమేఅని భ్రమపడిన పురోహితులుకూడాకలరు. మంత్రపన్నాలలో లేదు. కావున వేదమంత్రము కాదని యెఱుంగవలయును. దీనిసంగతి మున్ముందు వ్యక్తమగును. తడిపిన అక్షతలు తలబ్రా లని వధూవరులు తలలమీదను బోసికొందురు. ఇదికూడా మధ్యకాలములో ఆచారమువల్ల వచ్చిన దని భాష్యకారులు వ్రాసిరి. ఇచటకూడా

మంత్రము చదువుదురు. కాని అది మంత్రపన్నములలోనిది కాదని పెద్దల వ్రాత. తరువాత బ్రహ్మముళ్లు. అటుతర్వాత నాశీర్వాదము. ఆచారములో నీచోట ఆశీర్వాద మెందుకు వచ్చిందంటే నాయభిప్రాయము కొంతకాలము బాలికావివాహము లంతతోనే నిల్పివేసేవా రని.

తరువాత కన్యచేతిని వరుడు పట్టుకొని తీసుకొనివచ్చును. ఆమంత్రములో "నాయింటికి రథముమీద రమ్ము. వచ్చినపుడు దేవతలు నిన్ను కాపాడుచు నడిపింతురు" అని యర్థము కలదు. రథముమీదికి తెచ్చేముందు కన్యాదాతయింటనే యగ్ని యొకచోట ప్రతిష్ఠించి యచట ప్రదాన హోమము చేయును. పేలాలు కన్య దోసిలితో వరుడు హోమము మూడు మార్లు చేయించును. మూడుమార్లు ప్రదక్షిణ మగ్నిహోత్రమునకు చేతురు. సన్నెకల్లు కన్యచేత త్రొక్కింతురు. ఏడడుగులు నడిపించి యేడవయడుగున కన్యను నిలువబెట్టి ఒడంబడిక చేయుదురు. అన్నిచోట్ల మంత్రము లున్నవి. వరుసగా వాటితాత్పర్యము వ్రాయుచున్నాను. 'ఓకన్యకా! నీకు సోముడనే దేవత పతి. తరువాత కొన్నాళ్లు గంధర్వుడు. మూడవవాడు అగ్నిహోత్రుడు. నాల్గవవాడు మనుష్యుడు. సోముడు గంధర్వునకిచ్చినాడు. గంధర్వుడు అగ్నికి నిన్నిచ్చినాడు. ఆయగ్నిహోత్రుడు ధనమును పుత్రులను బొందుమనినిన్నిపుడు నాకు ఇచ్చినాడు.' అని. ఈమంత్రమే మగపిల్లవానిని దత్తత చేసుకొన్నపు డుపయోగించుచున్నారు. దీనినిబట్టి యూహిస్తే మొదట తండ్రి యిచ్చిన దానమును ఈయగ్నిహోత్రు డంగీకరించి కన్యను వరున కిచ్చుచున్నా డని తాత్పర్యము వచ్చును. కావున నీకర్మకూడా దానకర్మయే యగును. తండ్రి చేసినదానమునకు మంత్రము లేదు. అపుడు చదువుచున్నమంత్రము వివాహ మంత్రములలోనిది కాదు. ఇచట మంత్రపూర్వకముగా దానప్రతిగ్రహము జరిగినది, కావున నిది ప్రదానహోమ మనవలెను. ఈవిషయమును చక్కగా గుర్తింపక విద్వాంసులే కొందఱు ప్రధానహోమ మని దాను వత్తు పెట్టి పెండ్లిలో ఇది ముఖ్యమయినకర్మ కనుక ప్రధానహోమము అనవలెను కాని

ప్రధానహోమము అనరాదందురు. పుస్తకములోగూడా ధకారము వచ్చి పడింది. "శతాంధాః కూపం ప్రవిశంతి" అనుసామెత సరిపడినది. మంత్రార్థముమాత్రము వారివాదమునకు చేయూత నివ్వదు. ఇదే ప్రధానకర్మ గాదు. ప్రధానమయినకర్మ లింకను వివాహమున గలవు. వీరెందు కట్లనుచున్నారంటే పూర్వ మొకప్పుడు సప్తపదితోనే బాల్యవివాహములు పూర్తిచేసే వారు. చిత్రము! ఆఁ! మఱచితిని. ఈప్రధానహోమముదగ్గిర కూర్చొని యుండగా కన్యచేయి పట్టుకొని 'నీకు కొడుకు కావలెనా ? ముందుగా కూతురు కావలెనా' యని వరుడు అనవలెనట. కొడుకు కావలెనంటే కన్యబొటనవ్రేలిని వరుడు పట్టుకొనవలెను. కూతురు కావలెనంటే బొట్టన వ్రేలు వదలి మిగిలిన నాలుగువ్రేళ్లను కలిపి పట్టుకొనవలెను. అని సూత్రకారులు వ్రాసియున్నారు. మంత్రములోగూడా అట్టియర్థమే కలదు. దీనిని మరవకుడు. వివాహవయసు కన్య కేదో ఇది నిర్ణయించుచున్నది. తరువాత 'సంతానముకొఱకు నీచేయి పట్టుకొన్నాను. నాగృహమున కధికారిణిగా నిన్ను సోమగంధర్వాగ్నులు నాకు నిచ్చినారు.' అని మంత్రమున కర్థము. అది చదువుచు అగ్నికుత్తరముగా ఏడడుగులు నడిపించి యేడవయడుగున "మన మిద్దఱము ఏడడుగులు నడిచినందువల్ల స్నేహితుల మైనాము. సుఖించుచుము. నేను సుఖింతును. మన మిద్దఱము ప్రమాణము చేసుకొనుచున్నాము. మనము చేయబోవు పను లొకరితో నొకరు చెప్పుకొందము. ప్రేమించి యుందుదము. మంచిమనసుతో నుందము. అన్నవస్త్రముల ననుభవింతము. ఆకాశము భూమియువలెను, మనోవాక్కులవలెను, సామఋగ్వేదములవలెను ఎడబాయకుందము. నేను బీజమును నీవు బీజమును ధరించుదానవు. నిన్ను పుత్రులకొఱకు సంపదకొఱకును పెండ్లాడుచున్నాను. నన్ననుసరించి యుండుము. సత్యము తప్పనిదానివై నావెంట రమ్ము." అని సప్తపదీ మంత్రార్థము. ఈసప్తపది కానిదీ తండ్రియిచ్చినదానము చెల్ల నేరదు. అందుకు ప్రమాణములు ముందు విమర్శింతును. ఈతరువాతనే లాజహోమము.

"నా పెనిమిటి దీర్ఘాయుష్మంతు డగునుగాక. సంతానము గలుగునుగాక. శత్రువులు వీగిపోదురుగాక. మేము మంచిమనసుతో నుండునట్లు దేవతలను గ్రహింతురుగాక" అని కన్య మంత్రముతో ప్రార్థించును. ఇదయినవెంటనే బండిదగ్గరకు రావలెను.

కన్యను తండ్రియింట బయలుదేరించునపుడు మూడుమంత్రములు చదువవలెను. అవి యిపుడును చదువుచున్నారు. బండి పూచునపుడు మంత్రము. త్రోవ నడచునపుడు మంత్రము. ఏఱు తగిలితే దాటునపుడు మంత్రము. అపశకునములు కలిగితే శాన్తిమంత్రము. ఈమంత్రములు కొందఱు పురోహితులకు రానేరావు. పుస్తకాలలోగూడా ఇటీవల నచ్చువేయుటయు లేదు. కారణ మే మందము? తనయింట జరుగవలసిన వివాహమిపుడు కన్యాదాతయింటనే జరుగుచుండుటచేత ప్రయాణమే లేదని అనవలసియున్నది. బండి యెక్కునప్పటి మంత్రార్థము—నీవు బండెక్కుము. నామీద నీదే యధికారము. అత్తమామలమీద నీదే యధికారము. తోటి కోడండ్రమీద నీదే యధికారము. సంతానముమీద నీదే యధికారము. మరదులమీద కోడండ్రమీద నీదే యధికారము, మనము పిల్లలను కనుకొందము." ఇచట విశేషము గలదు. చూడండీ! యీపిల్ల అత్తగారి పెళ్లిలో మామ యిల్లే అన్నాడు కదూ! దీని బావమరుదు లిల్లే యందురు కదా! దీనికొడుకుగూడా తనపెళ్లిలో ననవలెనుగదా! అయితే ఎవరిమీద నెవరికి పెత్తన ముండవలెను? దీనినిబట్టి పెండ్లి యాడేవాడు స్వతంత్ర జీవనము గలవాడయి యుండియే తనయిల్లు తాను వేరుగా జేసుకొనియే మఱీ పెండ్లాడవలెను గాని తండ్రిచాటున అన్నదమ్ములచాటునను బ్రతికేవానికి పెండ్లి కాదేమో యని యనవలసియున్నది. పూర్వఋషుల యభిప్రాయమిట్లే యనవచ్చును. ఇకమీద గృహప్రవేశకర్మ.

ఇంటికి వెళ్లగానే "యీయిల్లు నీది. ఇవిగో నాపశువులు. ధనము, వస్తువులు." అని మంత్రముతో చూపించును. ఇపుడును ఈమంత్రముతో

చూపించుచున్నారు. కన్యాదాత యిల్లు వస్తువులు తప్ప అచట తనయి
ల్లేది? వస్తువు లేవీ? దాని క్షేమి. ప్రకృతమున — అప్పుడే వొల్చి తీసినయెద్దు
తోలు, [రక్తము కారుచుండవలెను.] రోమములు మీఁది కుండునట్లు
ఇంటిలో పరచి యిద్దఱును ఒక్కమారే దానిపైని కూరుచొని యిల్లంత
వప్పగింత జరుగును. ఆమె మంత్రము చదువుచు "నే నీయిల్లు జాగ్రత్తగా
కాపాడుదును. మంచిమనసుతో పిల్లలను పెంచుదును. ఐశ్వర్యమును వృద్ధి
చేతును." అనుచు ఇల్లు అప్పగింత చేసుకొనును. అచట అగ్నిని ప్రతిష్ఠించి
అందులో హోమము "గోవులు అశ్వములు పురుషులు ధనము కలిగి వృద్ధి
నొందుగాక" యని హోమము చేయును.

ఇచట మతభేదము కలదు. ప్రధానహోమసప్తపదు లయినతరువాత
అగ్నిచల్లార్చక కన్యతోనే బండిమీఁద ఒకకుండలో పెట్టి త్రోవలో
జాగ్రత్తచేసికొనుచు తెచ్చి ఆయగ్నినే తనయింట ప్రతిష్ఠించుట ఒకమతము.
అదంతా చాలాప్రయాససాధ్య మని సమిధలో అగ్నిని ఆరోపణచేసి
(మంత్ర మున్నది) ఆసమిధ తనతో తెచ్చుకొని తనయింటికి వచ్చి వేఱ
యగ్ని రవిల్చి ఆసమిధ. దానిలో వేసితే ప్రధానహోమమునాటియగ్ని
యగు నని యట్లు చేయవచ్చు ననిరి. ఏది యెట్లయినను ఆయగ్ని తనజీవిత
కాలమంతా తనయింట కాపాడుకొనవలసినదే.

అనన్తరము మగపిల్లలను గన్నతల్లియొక్క కొమారుని తెచ్చి పెళ్లి
కూతురితొడమీఁద కూర్చోపెట్టి "ఇట్లే బలవంతులైన కొడుకులను కనుము"
అని వరుఁడు సమంత్రకముగా చెప్పును. "నేను పెండ్లాడినయీవధువునకు
గొడ్డుతనము రాకుండునుగాక" యని మంత్రార్థము. తరువాత మఱొక
మంత్రముతో వధువును మంత్రించును. దానియర్థము—నాయింట సుఖ
ముగా కాపురము చేయుము. సంతానము కనుము. ప్రీతితో నన్ను జూడుము"
అని. తరువాత నక్షత్రోదయమువరకును మౌనముతో నుండవలెను. అపుడు
ధ్రువనక్షత్రమును, అరుంధతీనక్షత్రమును వధువునకు జూపవలెను. తర్వాత

నొక మోదుగకఱ్ఱను చందనపుష్పములతో పూజించి క్రొత్తవస్త్రము చుట్టి వధూవరులమధ్య నుంచుకొనవలెను. ఒకరాత్రిగాని మూడు రాత్రులుకాని ఆరురాత్రులుకాని పన్నెండురాత్రులుకాని ఒకసంవత్సరము కాని ఆదండమును మధ్య నుంచుకొని ఏకశయ్యపై నేలను పవ్వళించవలెను. ఒకరి నొకరు తగలరాదు. వారియిద్దఱమధ్యను దండము నందుకే యుంచుదురు. ఆహారము ఒక్క పగలే తీసుకొనవలెను. అందైనా ఉప్పు కారము వర్జించవలయును. మధురపదార్థములే తినవలెను. బ్రహ్మచర్యమే ఆదినములలో సంగమము చేయరాదు. మీద వివరించినకాలములలో నెంత యధిక కాలము బ్రహ్మచర్యవ్రతము చేయగలుగుదురో అంత అధికగుణవంతులగు కొమారులను గందు రని వ్రాసియున్నది. ఇపుడు సర్వత్రా మూడురాత్రుల పక్షమే ఆచారములో నున్నది.

వివాహమధ్యను ప్రయాణ మీకాలమున మాని కన్యాదాత యింటిలోనే తంతంతా నడిపించుటచేత గృహప్రవేశాన్తకర్మ ఒకనాడు, మూడు రాత్రులు బ్రహ్మచర్యవ్రతము, తరువాత నొకరాత్రి శేషహోమాన్తకర్మ, మొత్తము అయిదురాత్రులు అగుచున్నది. మరునాడు నాగవల్లి జరుగుచున్నది. ఈకర్మ ద్రావిడ్లు చేయరు. నాకబలి వివాహకర్మలలో ఋషులు వ్రాయలేదు. ఏలాగో మధ్యను వచ్చింది. దాని కేమి అభ్యాండనిందు.

గృహప్రవేశకర్మానన్తరము స్థాలీపాక మనుకర్మ జరిగించుచున్నారు. అది పెండ్లిలోని యొకభాగము కాదు. ఎందుకో మధ్యను తెచ్చిపెట్టినారు. దానికారణము ముందు వివరింతును. స్థాలీ యనగా వంటచేసేపాత్ర. పాక మంటే వంట. ఆవండిన యన్నముతో హోమము చేయవలెను. ఆయన్నమునకు బియ్యము వధువే దంచవలెను. వధువే వంటచేయవలెను. ఆహోమానంతరము "నేను ఔపాసనమును ఆరంభించుచున్నాను. ఈ ఔపాసనహోమము యావజ్జీవము చేతును." అని సంకల్పించును.

ఔపాసనహోమము ప్రతిదినము ఉదయాస్తమయకాలములం దక్షత లతో మూడాహుతులు హోమము చేయుటకు నిర్ణయము. అది పెళ్లినాటి యగ్నిలోనే. అందుకే ఆయగ్ని తనయింట నొకచోట నిలువచేయవలెను. అట్టివాడు ఆహితాగ్ని యనబడును. అట్టివా రిపుడు వేయి కొక రున్నారా ? సాధారణముగ తక్కినవా రందఱును తద్దినమునాడుమాత్రము తప్పక చేయు చున్నారు. ఆతద్దినంనాడు ఆయగ్నియందే అక్షతహోమము ఉదయమున చేసి శ్రాద్ధకాలమున అన్నహోమము చేయవలెను. ఇపు డన్నిహోమములును అపరాహ్ణకాలమందే జరుగుచున్నవి.

బ్రహ్మచర్యము జరుగుచున్నదినములలో ఔపాసనమునందు సంక ల్పము—ఈ క్రొత్తవధువుతో ఉదయసాయమౌపాసనము చేయుచున్నాను.' అనిమాత్రమే చెప్పుదురు "అనయా నవోఢయా వధ్వా సహ" అనుదాని కిదే యర్థము. చూడండీ! తన గోత్రముతో కలిపి "ఫలానాగోత్రుడనైన నేను ధర్మపత్నీసమేతుడనై యౌపాసనహోమము చేయుచున్నాను" అని నాగవల్లి మరునాటినుండి చెప్పినట్లు చెప్పరు. 'ధర్మపత్నీసమేతః' అను సంకల్పము నాగవల్లినాడే ఆరంభింతురు. కారణ మేమంటే శేషహోమాది వివాహకర్మ యింకా కాలేదు. కావున వివాహముపూర్తికాలేదు. పెళ్లి పూర్తి అయ్యేవరకూ ఆమె వధువే కాని యింకా భార్య కాలేదు. వధు వంటే పెండ్లికూతు రని యర్థము. ఇపుడుకూడా పెళ్లి నాలుగురోజులున్న అనగా, మెడలో కుత్తిగంటు కట్టేవరకున్న 'ధర్మపత్నీసమేతస్య అముకగోత్రస్య' అనే సంకల్పము చెప్పరు. కుత్తిగంటు నాగబలి చేయనివారు శేషహోమా నన్తరము అగ్నిహోత్రముదగ్గరనే కట్టింతురు. చేయుచున్నవారు పందిరిలో నాగబలికాలమందు కట్టింతురు. ఆతంతునకు ఒకమంత్రమైనను లేదు. తంతునుబట్టి ఒకవిధమైన శాంతికర్మగా కనంబడుచున్నది.

తాము జరుపదలంచుకొన్నన్నిరాత్రులు బ్రహ్మచర్యము జరిపి ఆమరునాడు తెల్లవారుజామున గంధర్వదండమును కడిగివేసి తమమధ్యనుండి తీసి శేషహోమము చేయుదురు. శేషహోమములోగూడా "వధ్వాసహ"

అనే సంకల్పమే చెప్పుదురు. హోమము నేతితో కొన్ని ఆహుతులు వేసి మిగిలిన నేతిని వధువుతలమీద మంత్రముతో నూఱుమారులు అంటింతురు. తరువాత వధువు "ఓప్రియుడా! నీవు నాయందు పుట్టుము" అనే మంత్రము చదువుచు వరుని జూచును. అట్లే తరువాత "ఓపుత్రులను కోరుచున్న ప్రియురాలా! నేను నీకు పుత్రరూపముగా పుట్టుదును" అను మంత్రము చదువుచు చూచును. ఇంకను మిగిలిన నేతితో చేతులు పూసుకొని వరుడు వధువు ఱొమ్మున అంటించును. "విశ్వేదేవతలు మన హృదయములను కలుపుదురుగాక" అను మంత్రము అపుడు చదువును. తరువాత మఱి మూడుమంత్రములు జపించును. "బహుమంది కొడుకులు కలుగుదురుగాక, కామముతో మనుష్యులు స్త్రీయందు బీజము నుంతురు. ఆబీజము నో దేవతలారా! రక్షింపుడు" అని దాని యర్థము.

ఈపని యంతయును వివాహగృహమందే అగ్నికి ఉత్తరముగా పానుపుమీద జరుగవలెను. నేయి అంటించుట వధువును తూర్పు శిరస్సుగా గాని ఉత్తరశిరస్సుగాగాని పరుండబెట్టియే యని గృహ్యాసూత్రములలో గలదు. ఇపుడు ఆంధ్రదేశమున వాడుకలోనున్న ఆపస్తంబగృహ్యాసూత్రమున కూర్చో పెట్టవలె నని పరుండబెట్టవలెనని ద్వంద్వార్థము నిచ్చుపద మున్నది. దానివ్యాఖ్యాకారుడు ఈకర్మలో వధూవరు లిద్దఱును ఏకశయ్యపై పరుండవలసినట్లు "వధ్వాసహ మైథునార్థం శయనం" అని స్పష్టముగా వ్రాసినాడు. దీనివిమర్శ ఆయాప్రకరణమున జూపగలను. ఉత్కళ - వంగ దేశములలో నిపుడుకూడ వధూవరులను నాల్గవరాత్రి ఒకమారు ఏకశయ్యపై పరుండబెట్టి లేవనెత్తు నాచారము గలదు.

బ్రహ్మచర్యానంతరము చేయు శేషహోమాదికర్మకు చతుర్థీకర్మ యని సంస్కృతనామము. భాషాంతరమున "చౌర్థి" అందురు. మంత్రములభేద ముండును గాని అన్నిగృహ్యాసూత్రములలోనూ ముఖ్యకర్మ లిట్లే చెప్పంబడెను.

ఇది వివాహానుక్రమణిక యను ద్వితీయభాగము.

---

# వివాహతత్త్వము

## తృతీయభాగము

---

### వివాహలక్షణము

ఇదివరకు వివాహానుక్రమణికవల్ల స్వరూపము మంత్రములతోసహా తెలిసినది. స్వరూపము చూపకుండా వివాహమంటే యేమో మాటలతో లక్షణము చెప్పుటకూడ పదార్థజ్ఞానమున కవసరము. దానినిబట్టికూడా బాలికావివాహము న్యాయ్యమో యువతీవివాహము న్యాయ్యమో స్పష్టపడును. పూర్వఋషులు వ్యాఖ్యాతలుఏమి వ్రాసిరో చూపుచు నావాదము చూపుదును.

శ్లో. "కన్యాదానం శచీయోగో వివాహోఽథ చతుర్థికా,
వివాహ మేత త్కథితం యత్ర కర్మ చతుష్టయమ్."

—అగ్నిపురాణము - అ. ౧౫౪.

కన్యాదానము, శచీపూజా, వివాహము, చతుర్థి—ఈనాలుగున్ను కలిసి వివాహ మనబడును అని యర్థము.

ఇందులో వివాహపదములు రెండున్నవి. అందు మొదటిది పుంలింగము రెండవది నపుంసకలింగము. అమరములో పుంలింగమే కలదు. మీాద వివరించిన నాలుగుకర్మలమొత్తమునకు వివాహ మనిన్నీ నాలుగు అవాంతరకర్మలలో మూడవది వివాహ మనిన్నీ దీనివల్ల కనంబడుచున్నది. మనము ముందుముందు విచారింపబోవునట్టిదిన్నీ బాలికావివాహము శాస్త్రీయమా యువతీవివాహము శాస్త్రీయమా అని వివాదపడుచున్నదిన్నీ ఇం దేదని ర్ణయించుకొని వాదించవలసియుంటుంది. కాని దీనికి సదుత్తరము ఈతగువు

లాడువారు చెప్పలేరు. అది స్పష్టపడనపుడు ప్రశ్నయే తెలియనపుడు జవాబు చెప్పడముకూడా దుర్ఘటమే. అయితే ఒకలాగు సమాధానము చెప్ప వచ్చును. ఇప్పుడు మనము చేయుచున్న వివాహము ఈరెంటిలో ఏదైతే దానికే తగువని. అయితే ఇపుడు మనము చేయుచున్న వివాహము శేష హోమము సమావేశనము అంతముగాగలకర్మ యగునుగదా! అనగా వధూ వరులను పానుపుమీద కూర్చోపెట్టి తాంబూలాదు లొకరిచేత నొకరి కిప్పించుచు పెళ్లికూతురుబుజముమీద పెండ్లికుమారునిచేయి ఉంపిచి "ఆరో హోరు ముపబర్హస్వ బాహుం" నాతొడలమీద నీవు ఆరోహించుము. నన్ను కౌగలించుకొనుము. ఇత్యాదిమంత్రము చెప్పి సంస్కరించు చున్నారా? లేదా? అట్లు చేయించలే దని యెవ్వరూ అనలేరు. గ్రంథాలే నిదర్శనము. పురోహితు డొక్కడయినను కాదనడు. కనుక మీదిశ్లోక ములో చెప్పిన నాలుగుకర్మల మొత్తమునే మన మిపుడు చేయించుచున్నాము. దానివిషయమన్యే బాల్యముననా? యౌవనముననా కన్యకు వివాహము? అని మీమాంస.

ఇక నాదము ప్రారంభించునపుడు సంకేతము లేర్పఱచుకొనవలసి యున్నది. నాలుగుకర్మల మొత్తమయిన సమావేశనాంతమునకు సంపూర్ణ వివాహ మని, మూడవదానికి అంగకర్మ యని మనసంకేతము. ఇది చదు వరులు గుర్తు నుంచుకొందురు. సంపూర్ణవివాహములో నాలుగు అవయవములు కలవు. కన్యాదాన మొకభాగము, శచీపూజ రెండవభాగము, వివాహ మనున దొకభాగము, మూడవది, నాల్గవది, చతుర్థి. మొదటిభాగము ప్రసిద్ధమె. రెండవది మనదేశములో నెవరూ చేయరు. గుజరాతీలలో చెరువువద్దకు వెళ్లు నాచారముమాత్ర మున్నదట. కన్యాదాన మయినతరువాత వరుడు తనయింటికి గృహప్రవేశమునకు కన్యను తెచ్చునప్పుడు చెఱువువద్దకు తీసు కొనివెళ్లి కుమ్మరిమన్నుతో శచీవిగ్రహమును చేయించి అచ్చటనే పెండ్లి కూతురిచేత శచీపూజ చేయించి పిమ్మట బాజాబజంత్రీలతో తనయింటికి

తోడ్చుకొని రావలెను. కన్యాదాతయింటికి కన్య చెలువునుండి మరి వెళ్లనవసరము లేదు. అగ్నిపురాణమున ఆయధ్యాయములోనే,

"వైవాహికేఽహ్ని కుర్వీత కుంభకారమృదా శచీమ్,
జలాశయేతు తాంపూజ్య వాద్యాద్యైఃస్త్రీం గృహంనయేత్."

అని యున్నది. ఇపుడు శచీపూజ లేదు కాని గౌరీపూజ ఉన్నది. కనుక యిప్పుడుకూడా వివాహములో అంగకర్మలు నాలుగున్నట్లే రెండవకర్మగా నుండుటకు బదులు మొదటికర్మ అయినది. అదట్లుండనిండు. ప్రకృత మనుసరింతము.

కన్యాదానము-దానములో యిద్ద ఉండకతీరదు; ఇచ్చేవాడు, పుచ్చుకొనేవాడు. కనుక యిచ్చుట ఉన్నదగ్గర పుచ్చుకొనుటకూడా ఉండక తప్పదు. కనుక, కన్యా + ఆదానం అని పదచ్ఛేదము చెప్పవచ్చును. కన్యా + దానం అనిన్నీ పదచ్ఛేదము చెప్పవచ్చును. కాని యేది కవితాత్పర్య మందాము. కన్యా + ఆదాన మనేదే కవితాత్పర్యమని విమర్శపైని స్పష్ట పడును. గృహప్రవేశానకు తనయింటికి ప్రయాణ మయినపుడు చెలువువద్ద శచీపూజ చేయించి తీసుకొనిరమ్మన్న వచనము మనకంటికి గనబడుచున్నది కదా! అంతకుముందు జరుగవలసిన కర్మ యెంతవరకు కావలసియుండును? సప్తపది ఒడంబడిక అయి పిల్ల తనతో నడిస్తేకదా తీసుకొనిరావడము? కనుక సప్తపది అయిందనకతీరదు. దానము తండ్రిచేసినతరువాత సప్తపదికి ముందు జరుగవలసినకర్మ కొంత ఉన్నది. కన్యాభిషేకము మొదలు ప్రదానహోమమువరకూ తంతు ఎపుడు జరుగును? కనుక దాన మన్నపద చ్ఛేదము చేసి తండ్రిచేయు కన్యాదానము అని చెప్పితే తప్పు. మరేమంటే ఆదానమే. ఆదానమంటే స్వీకారము. అనగా స్వాధీనము చేసుకొనుట. తండ్రివల్ల పుచ్చుకొనుట కాక ప్రదానహోమకాలమున సోమగంధర్వా గ్నులవల్లకూడా తాను గ్రహించవలెను. ఈరెండున్ను అయినప్పటికీ పిల్ల

సప్తపది నడచి అంగీకరింపవలెను. కనుక వరుడు పెండ్లాడుటకు కన్యను తాను వశపఱచుకొనుట (కన్యా + ఆదానము) కన్యాస్వీకారము అని అర్థము చెప్పితే ఆదాన మనియే పదచ్ఛేదము సాధువు.

మొదటి అంగము సంపూర్ణ వివాహములో సప్తపద్యంతము అని తేలినది. రెండవది శచీపూజ. నాల్గవది చతుర్థిక. ఈమధ్య మూడవది యేది? మూడవదానిని నిర్ణయించుట కాధారము, స్త్రీని శచీపూజతరువాత నింటికి తేవలసినది అని చెప్పినందున, గృహప్రవేశము మొదలుకొన్నకర్మ యనక తప్పదు. కనుక మూడవదాని మొదలు తెలిసినది. ఎంతవర కన్నది నిర్ణయింపవలసియున్నది. అది నిర్ణయిస్తే ఆమిగిలిన దంతా చతుర్థికయే యని నిశ్చయము కలుగును. అందున్న శేషహోమము చతుర్థి యని అందురు. అది నిర్వివాదము. శేషహోమము మొదట చతుర్థియంటే మూడవకర్మ గృహప్రవేశాది బ్రహ్మచర్యవ్రతాంతము అగును. బ్రహ్మచర్యాది చతుర్థి అంటే నక్షత్రదర్శనాంతము నాలవది. ఇదే ముందు సిద్ధాంతమతము. దానిని తరువాత ఋజువుచేతును. ఇంతవరకు చేసినచర్చవల్ల తేలినఫలిత మెంత? వివాహ మన్నది ఒక్కటే కర్మ గాదు. అందు నాలుగు ముఖ్య భాగము లున్నవి. ఆనాలుగింటిమొత్తము సంపూర్ణ వివాహము. ఆభాగములలో మూడోదానికిగూడా వివాహమని పేరుకలదు. కాని దానితోమాత్రం సంపూర్తిగా పెండ్లి అయిం దనుకోరాదు. చతుర్థీకర్మ అయితేనే పెండ్లి పూర్తి యగును-అని. అయితే ఏపని చేస్తే కన్య యని మఱి ఆస్త్రీని చెప్పరాదో అది సంపూర్ణవివాహము. కనుక కన్యాత్వమును పోగొట్టుకర్మ సంపూర్ణవివాహము. నక్షత్రదర్శనాంతకర్మకు వివాహ మన్నపే రున్నను అదిమాత్రము కన్యాత్వమును నివృత్తి చేయదు. కావున నది అసంపూర్ణ వివాహము.

కన్యాత్వము ఎక్కడితో పోవునో వ్యాకరణమహాభాష్యములో చెప్పినారు. సప్తపదిమొదలయిన కర్మలు మొదట జరిగి తరువాత సంభో

గము జరిగితేనే కన్యాత్వము పోవు ననీ. సప్తపద్యాదికర్మ జరగనిదే సం భోగము జరిగినను ఇంకా ఆమె కన్యయే అనియు చెప్పబడినది. దీనినిబట్టి సంభోగము లేనంతవరకు [చతుర్థి అయేవరకు అన్నమాట] నక్షత్రదర్శ నాంతకర్మ జరిగినా కన్యాత్వము నివృత్తి కానేరదని యూహింపవచ్చును. అందుచేత కన్యాత్వమును నివృత్తిచేయని వివాహము అసంపూర్ణము. దీనికి అభిసంబంధ మన్న నామము భాష్యకారుడు వాడినాడు. నక్షత్రదర్శనాంత కర్మకు అభిసంబంధ మను సంజ్ఞ అప్పటివాడుకలో నుండవచ్చును.

"కన్యాయాః కనీనచ" పాణినిసూత్రము. అచటిభాష్యార్థ మిట్లు— ప్రతిపదార్థము. "ఇది విరుద్ధముగా నున్నది? ఏమిటి ఆవిరోధము? సంతాన మని యున్నది. కన్య యయితే సంతాన మెట్లు? సంతాన ముంటే కన్య కాదు. కన్య సంతానము అనురెంటికీ విరోధము, అయితే ఏలాగు? [కానీను డనుమాట మరేలాగు కుదురుతుం దని ప్రశ్న] ముందుగా పురు షునితో ఒడంబడిక (సప్తపది) చేసుకొని సంభోగము చేసితే కన్య కానే రదు. ఎవ్వతె ఒడంబడిక కాకుండానే సంభోగించునో అది యింకా కన్యయే యగును. దానికి పుట్టినవాడు కానీనుడు–అని. భాష్య మిట్లు—

"ఇదం విప్రతిషిద్ధం. కో విప్రతిషేధః? అపత్య మితి వర్తతే. యది కన్యా నాపత్యం. అథాపత్యం నకన్యా. కన్యా చాపత్యం చేతి విప్రతిషిద్ధం. కథం? కన్యాశబ్దోఽయం పుంసా అభిసంబంధపూర్వకే సంప్రయోగే నివర్తతే. యా చేదానీం ప్రాగభిసంబంధాత్పుంసాసహ సంప్రయోగం గచ్ఛతి, తస్యాం కన్యాశబ్దో వర్తత ఏవ. కన్యాయాః – కనోక్తాయాః–కన్యాభి మతాయా స్సుదర్శనాయా యదపత్యం స కానీనః."

అని. సంప్రయోగశబ్దమునకు సంభోగమర్థము. వ్యాఖ్యానములలో కైయటుడు—

"అభిసంబంధో వివాహః తత్పూర్వకే పురుషసంయోగే కన్యాత్వం నివర్తతే."

అనుటవల్ల అభిసంబంధమంటే వివాహ మని యర్థము వ్రాసినాడు. అతని ఉద్దేశము నక్షత్రదర్శనాంత అసంపూర్ణమునకే ఆపేరని. అయినను అతడు కూడా సంభోగముతోనే కన్యాత్వనివృత్తి చెప్పినాడు. కనుక వివాహలక్షణము అభిసంబంధపూర్వకసంప్రయోగ మని దీనివల్ల తేలినది.

ఉద్వాహతత్త్వ మనుగ్రంథములో రఘునందనభట్టాచార్యులు "భార్యాత్వసంపాదకగ్రహణం వివాహః" అన్నాడు. ఏపని చేసితే భార్య యగునో అట్టిపనితో స్త్రీని స్వీకరించుట అని యర్థము. సమావేశనాంతకర్మ కానిదీ భార్య కాదు. అంతవరకూ వధువే. చూడండి. దానంవరకూ కన్య. అక్కడ నుండి సమావేశనమువరకూ వధువే. సమావేశన మయినదిమొదలు భార్య. భావ్యకారునివ్రాతనుబట్టి వధువు అనుసమయమునగూడా కన్య యనువ్యవహారమే అంగీకరించినాడు. సంభోగ మయినతరువాతనే కన్యాత్వనివృత్తి చెప్పినందున అట్లూహించవలెను.

"ఇయ మాభవనం భార్యా బీజ మస్యాం నిషిచ్యతే"

అను బృహత్పరాశరవచనమునుబట్టి బీజనిషేక మయినతరువాత భార్య అను శబ్దము వర్తించును. బీజమును భరించున దగుటచేత భార్య అని వ్యుత్పత్తి.

"నోదకేన న వాచా వా కన్యాయాః పతి రిష్యతే,
పాణిగ్రహణసంస్కారా త్పతిత్వం సప్తమే పదే."

అను మనుస్మృతిలో వాగ్దానమువల్లగాని ఉదకదానమువల్లకాని పతి యనం బడడు. సప్తపదిలో పతిత్వము వచ్చును అని అన్నాడు. నిజమే కాని పతిత్వము ప్రారంభించునుగాని పూర్తికాదని ఆవచనార్థము. లేదా పతిత్వపత్నీత్వములు జత. భర్తృత్వభార్యాత్వములు జత. బీజసేకమువరకు అతడు

భర్త కాడు. ఆమె భార్యయు కాదు. మనుస్మృతివచనమువల్ల సప్తపది లోనే ఆమె పత్ని కారాదా? అని ప్రశ్నింపవచ్చును కాని పత్నీత్వమే వస్తే అప్పుడే 'ధర్మపత్నీసమేతస్య' అన్న సంకల్పము గ్రంథములలోగాని పురోహితులు కాని యేల చెప్పరు? "నవోఢయావధ్వాసహ" అని యేల చెప్పుదురు? కావున సమావేశనముతోనే భార్యాత్వము పత్నీత్వమున్ను వచ్చును. రఘునందనునితాత్పర్య మదే అందుము. దానితో మహాభాష్యమున్ను ఏకీభవించును.

ఇదికాక మనుస్మృతియొక్క వ్యాఖ్యాకారుడు మేధాతిథి"కన్యాశబ్దశ్చ అత్ర ప్రకరణే అప్రవృత్తపుంసంప్రయోగాయాం యోషితి వర్తతే"ఈ వివాహప్రకరణములో కన్య యంటే పురుషసంపర్కము లేనిది అని అర్థము వ్రాసినాడు. దీనినిబట్టికూడా కన్యాత్వము సంభోగముతోనే పోవును. కనుక సంభోగము చతుర్థిలో నొకభాగ మగుటచేత మీదచెప్పిన సంపూర్ణ వివాహలక్షణము అభిసంబంధపూర్వకసంప్రయోగము అను స్వరూప లక్షణ మేర్పడినది. కైయటుడు చెప్పినది—అసంపూర్ణవివాహము. నక్షత్ర దర్శనాన్త మని గ్రహించితే ఏకవాక్యత గలుగును.

కన్యాత్వనివర్తకకర్మ యని తటస్థలక్షణము. ఆపస్తంబధర్మసూత్ర వ్యాఖ్యలో "అనూఢా స్త్రీ కన్యా" అనగా పెళ్లికాని స్త్రీ కన్య అనీ, పరాశరవ్యాఖ్యలో మాధవులు "లోకసిద్ధస్తు కన్యాశబ్దః వివాహరహిత స్త్రీ మాత్ర మాచష్టే" వివాహము కాని స్త్రీకే కన్య యని పేరు అనిన్ని వ్రాయుటనుబట్టి; ఏపనివల్ల కన్య అని మఱి అనరాదో ఆకర్మ వివాహము, అని యేర్పడును. ఇంతతో స్వరూపలక్షణ తటస్థలక్షణములవల్ల వివాహ మంటే యేమో తెలియవచ్చును.

ఇందులో తక్కినవిషయము లన్నియు అటుంచి వివాహములోనే సంభోగ మున్నదన్న ఋజువు చూపినంగాని మీద గ్రంథము సరిపడదు. బోధాయనసూత్రమున "చతుర్థ్యాం పక్వహోమ ఉపసంవేశనంచ" అని

చెప్పినాడు. చతుర్థిలో పక్వహోమము చేయవలెను. సంభోగము చేయవలెను. అని స్పష్టముగా చెప్పినాడు. చతుర్థి వివాహములో నొకభాగమయినట్లు అగ్నిపురాణవచనము సాక్షి.

దీనిపై నొకప్రశ్న—వ్యాకరణభాష్యము-గృహ్యములు-వ్యాఖ్యానములు తప్ప స్మృతివచనములలో నెక్కడనయినా సంభోగము చూపలేక పోయిరని. అందుకు సమాధానముగా నారదస్మృతి.

శ్లో. "స్త్రీపుంసయోస్తు సంబంధా ద్వరణం ప్రా గ్విధీయతే,
వరణా ద్గ్రహణం పాణేః స్సంబంధస్తు త్రిలక్షణః."

అని సంస్కారరత్నమాల ౫౦౩-వ పుటలో నీవచనమున కర్థ మిట్లున్నది—"అస్యార్థః స్త్రీపుంసయో స్సంబంధ స్సంభోగః తస్మాత్ప్రాగ్వరణం, తదనన్తరం పాణిగ్రహణంచ భవతి. ఏవం సంబంధ స్త్రిలక్షణః. వరణం పాణిగ్రహణం ఉపభోగశ్చేతి త్రీణి లక్షణాని యస్య స సంబంధ స్త్రిలక్షణః" వరణము పాణిగ్రహణము సంభోగము అనే మూడులక్షణములు గలది సంబంధము అనుటవల్ల వివాహములో మూడవలక్షణము సంభోగమే. అది వివాహములోనిది కాకపోతే ద్విలక్షణము అనవలెను. కాని త్రిలక్షణ మన రాదు. వరణ మంటే కన్యను ఫలానావాని కిమ్మని బంధువులు వెళ్లి అడుగుట, యిస్తానని దాత చెప్పుట. ఇట్లు శాస్త్రములందేకాక సర్వత్రా లోకమందుకూడా వివాహము నాల్గవరాత్రి తెల్లవారుజామున సంభోగచిహ్నముగా పానుపుమీదను కూర్చుండబెట్టుట తాంబూలాది సంభోగచిహ్నములు చూపుట యాచారములో గలదు. దానినిబట్టికూడా సంభోగము వివాహములో నొకభాగ మన్నది స్పష్టము.

ఇదివరకు చూపినలక్షణము సంపూర్ణవివాహమునకు జెల్లును. అసంపూర్ణ మయినవి, వివాహశబ్దముతో చెప్పునవి, కొన్ని వివాహభాగములు కలవు. అందొకటి అగ్నిపురాణవచనమున మూడవకర్మ తెలియ జెప్పితిమి.

అనగా నక్షత్రదర్శనాంతకర్మకుకూడా వివాహ మని వాడినట్లు స్పష్టము. అట్లే—వివాహ మనుపద మొక్కొక్కచోట ఒకకొంత వివాహభాగ మునకుగూడా గ్రంథకారులు వాడుచున్నారు. వాటిని కొన్ని చూపుదును. ధర్మప్రవృత్తిలో,

> "గృహప్రవేశహోమంతు హోమం వైవాహికంచ హి,
> ఏకతంత్రేణ వా కుర్యా దేకస్మిన్ననలేఽపిచ."

ఇచట వైవాహికహోమము అంటే ప్రధానహోమము. అదిన్నీ గృహ ప్రవేశహోమమున్ను ఒక్కకర్మగా ఒక్కఅగ్నిహోత్రములోనే చేయ వచ్చును. ఇవి వేరువేరుకాలములలో వేరువేరు అగ్నిహోత్రములలోగూడా చేయవచ్చును - అని. దీనినిబట్టి ఊహించితే సప్తపద్యంతకర్మకుగూడ వివాహ మన్నపదము చెల్లునని. అగ్నిపురాణమున గృహప్రవేశకర్మకు వివాహ మను పదము చూపబడినదికదా! మఱియు, ఆశ్వలాయనగృహ్యకారికలో "వివాహానన్తరం గచ్ఛేత్సభార్యస్స్వస్య మందిరమ్" అని చెప్పుటచేతను ఇచట వివాహపదము సప్తపద్యంతకర్మకే చెల్లుచున్నది. వివాహము అయిన తరువాత భార్యతో గృహప్రవేశమునకు తనయింటికి వెళ్లవలెను అని చెప్పినాడు.

ఇక సింగాభట్టీయమున జూడుడు—

> "కింతు వైవాహికాదేవ పితృగోత్రం న ముంచతి,
> స్వగోత్రా ద్భ్రశ్యతే నారీ క్రమణా త్సప్తమే పదే."

వివాహకర్మతోనే కన్యకు తండ్రిగోత్రము విడువదు. సప్తపది జరిగితే తండ్రిగోత్రమును కన్య విడుచును-అని. పాణిగ్రహణము, ప్రధాన హోమము, సప్తపది. ఒక్కచోటికర్మలే అగుటచేత సప్తపద్యభిక్రమణము చెప్పినందున తక్కినవన్నీ చెప్పినట్లే కావున నిచటివివాహపదము తండ్రి చేయునట్టి కన్యాదానకర్మకు వాడినట్లు కనంబడుచున్నది. ఇది,

"నోదకేన న వాచా వా కన్యాయాః పతి రిష్యతే,
పాణిగ్రహణసంస్కారా త్పతిత్వం సప్తమే పదే."

అనుదానితో నేకీభవించుచున్నది. అచట ఉదకదానవాగ్దానములతో వివాహము సిద్ధించదని పాణిగ్రహణసంస్కారమునందున్న సప్తపదితోనే వివాహము సిద్ధించునన్నందున కన్యాదానాంతకర్మతో పితృగోత్రత్యాగము కానేరదన్న యభిప్రాయమును చెప్పుచున్నది. కావున సింగాభట్టు మనుశ్లోకార్థమునే సూచించె ననవచ్చును. దీనివల్ల కన్యాదానాంతకర్మకు వివాహనామము చెల్లునట్లు స్పష్టము. రఘునందనుడు దీనినికూడా బలపఱుచుచున్నాడు. ఉద్వాహతత్త్వమున—"భార్యాత్వసంపాదకగ్రహణం వివాహః" అని ముఖ్యమయిన వివాహలక్షణము చెప్పి, "తత్ప్రయోజకో వ్యాపారశ్చ" అని చెప్పినాడు. వివాహమునకుముందు వివాహమునకుగాజేయు సాధనవ్యాపారము లన్నీ వివాహమనికూడా చెప్పవచ్చును. అనగా వివాహమునకే కాక వివాహసాధనమునకుగూడా వివాహపదము చెల్లునని తాత్పర్యము. ప్రకృతమున కన్యాదానాన్తకర్మ ఇకముందు జరుగబోవువివాహమునకు సాధన మగుటవల్ల నదియును వివాహ మని వాడవచ్చు నని తేలిన ఫలితాంశము.

దీనికి సంబంధించుటచేత నిచట అష్టవిధవివాహములు వివరించనవసరము. ఐనను అది విపులముగా ప్రత్యేకము చర్చించవలసియున్నందున ప్రకృతోపయోగ మగునంత సంక్షేపముగా జూపుచున్నాను. విష్ణుస్మృతి—"అష్టౌ వివాహా భవన్తి" ఎనిమిదివిధములు వివాహములు గలవు. అవేవంటే—౧. "ఆహూయ గుణవతే దానం బ్రాహ్మః" వరుని పిలిచి పిల్లనిచ్చుట బ్రాహ్మవివాహము. "బ్రాహ్మేన వివాహేన కన్యాం దదత్ బ్రహ్మలోకం గమయతి" బ్రాహ్మవివాహముతో కన్య నిచ్చువాడు బ్రహ్మలోకమును బొందును. ఇచట వివాహేన అన్న తృతీయావిభక్తివల్లను, దదన్నన్నదానమువల్లను, దానము సాధన మని తేలుచున్నది. కర

ణార్థమందు తృతీయ. దానమునకు వివాహపదము చెల్లినట్లుగూడ నీచోట స్పష్టము.

౨. ఇట్లే యజ్ఞములో ఋత్విజునకు దానము దైవవివాహ మని.

3. "ఉభౌ ధర్మం చరతాం" అని కరారుచేయించి చేసిన దానము ప్రాజాపత్య మని.

౪. రెండుగోవులను వరునివల్ల పుచ్చుకొని చేసిన దానము ఆర్ష వివాహము. ఇట్లు నాలుగు వివాహములలోనూ దాన మున్నది.

౫. క్రయము వరునివల్ల పుచ్చుకొని కన్యను వరునియధీనము చేయుట ఆసురవివాహము. దాన మిచ్చుట లేదు. కొన్నవస్తువునకు దాన మేల ?

౬. బలాత్కారముగా కన్యను యుద్ధమందు తండ్రిమొదలగువారి నోడించి తెచ్చుట రాక్షసవివాహము.

౭. కన్యావరు లిద్దఱును తలిదండ్రులయవసరము లేకనే తా మొక రితో నొకరు పెండ్లి చేసుకొనుటకు మాట్లాడుకొని ముందుగా సంభోగింతురు. ఇది గాంధర్వము—దీనిలోగూడా తరువాత పాణిగ్రహణాదితంతు అంతా జరుగుతుంది. అట్లు జరగకుంటే వివాహము సిద్ధించదు.

౮. కన్య నిద్రపోయి యున్నపుడుగాని మత్తుమం దిప్పించిగాని కన్యకు తెలియకుండా నామెతో సంభోగించి విధిలేక ఆమెను వివాహమున కంగీకరింపజేయుట పైశాచవివాహము. ఇది చాల అధమ మనిరి. కారణ మేమంటే మీది ఏడువిధముల వివాహములలోను కన్యయొక్క అంగీకార ముండును. ఇందులో మాత్రము మొదట నుండదు. తరువాత విధి లేక ఒప్పుకొనును. కనుకనే అధమసాధనముగా ఋషు లంగీకరించినారు. పెండ్లి యాడుటకు తగినసంబంధమై కన్యయు ఆమెతల్లి దండ్రి బంధువులు నంగీక రించనపుడు వరుడు ఆపిల్లను పెండ్లాడితే తనకు మేలని తలచినపు డీసాధన

ముపయోగించును. ఒకవేళ ఆమె పెండ్లాడరాని కుటుంబముది, జాతిది అయినప్పుడది కన్యాదూషణ మగును. అతడు దండార్హు డగును. ఆపిల్లకు గూడా కన్యాత్వము అందుచేత పోనేరదు. వివాహమునకు అర్హురా లని ఋషు లంగీకరించినారు.

ఈ చెప్పినదానములు నాలుగువిధములున్ను క్రయము, యుద్ధాహరణమున్ను రెండువిధముల సంభోగములున్ను మొత్తము ఎనిమిదియూ నిజముగా వివాహమాడుటకు వరునకు సాధనము లగునేకాని వివాహములు కానేరవు. ఈయెనిమిదింటిలో నేసాధనముద్వారా పిల్లను తాను గ్రహించినను పాణిగ్రహణాదికర్మ జరుగకతీరదు. ఇందు విచారించవలసినవిషయ మేమంటే— అన్నిటిలోను పాణిగ్రహణాదికర్మ ఒకటేవిధము సాధనము లే యెనిమిది. కావున వివాహ మొకటేవిధమయియుండగా 'అష్టౌ వివాహాః' వివాహము లెనిమిది యనుట ముఖ్యవృత్తిని కుదురదు. కనుక సాధనము లెనిమిదింటికీకూడా వివాహ మన్న పేరున్న ట్లూహించవలెను. ముఖ్యార్థమునకు వీలు చిక్కనపుడే గౌణార్థము (అముఖ్య) చెప్పుట న్యాయ్యము. ఇది మనసున నుంచుకొనియే రఘునందన భట్టాచార్యులు తనగ్రంథమందు వివాహలక్షణములో వివాహసాధనములకుకూడా వివాహవ్యవహారము వ్రాసినట్లు చూపితిని.

కనుక వివాహలక్షణము అభిసంబంధపూర్వకసంభోగము అనగా తెలుగున సప్తపదిఒడంబడికతోగూడిన సంభోగము అని తెలియదగును. గాంధర్వపైశాచములలో సంభోగము మొదటను తరువాత సప్తపద్యాదికర్మ జరుగును. తక్కినవాటిలో సప్తపద్యాది మొదటను, తరువాత సంభోగమును అని నిర్ణయము.

ఇది వివాహలక్షణవివేకము – తృతీయభాగము.

# వివాహతత్త్వము

## చతుర్థభాగము

---

### ఉద్వాహమువేరు వివాహము వేరు
### వేరువేరు కాలములందుకూడా చేయవచ్చును

శాస్త్రములోను ఉద్వాహ మన్నపదమునకును వివాహ మన్న పదంబునకును సమానార్థమందే కొన్ని ప్రయోగములు కనబడుచున్నను మతి, బుద్ధి పదములకువలెనే విశేషార్థముకూడా కలదు. మతి యంటే అప్పటికి గలిగినజ్ఞానము. బుద్ధి యనగా నిది ఫలానా యని నిశ్చయజ్ఞాన మనువిశేషార్థము గలట్లు ఉద్వాహపదమునకు వివాహసాధనములగు దానక్రయాదులును; వివాహపదమునకు పాణిగ్రహణాదికర్మయు; విశేషార్థములు.

దానికి ప్రమాణము—ఉద్వాహతత్త్వ మను గ్రంథము ౧౦౬ పుటలో హరివంశశ్లోకము,

> "యేన భార్యా హృతా పూర్వం కృతోద్వాహా పరస్యవై,
> పాణిగ్రహణమంత్రాణాం విఘ్నం చక్రే స దుర్మతిః."

మఱియొక డుద్వాహము చేసుకొన్నభార్యను పాణిగ్రహణాది సంస్కారము జరగకుండా చేసి తాను హరించినాడు-అనుదానిలో పాణిగ్రహణము కాలే దనుటవల్లను కృతోద్వాహా అని ఉద్వాహ మయినట్టున్ను చెప్పుటచేత ఉద్వాహ మనగా దానక్రయయుద్ధహరణాదులలో నేదోమాత్రమే యని యూహింపకతప్పదు. ఉద్వాహ మయి తప్పిపోయినను మఱియొకనికి

వివాహము జరుగవచ్చును. అది మొదటి వివాహమే యగును. పాణిగ్రహణాదికర్మ అయి మఱొకడు పెండ్లాడితే అది పునర్వివాహ మగును. ఫలితము ఏమంటే వివాహానికి ఉద్వాహము సాధన మని.

"అష్టౌ వివాహా నారీణాం సంస్కారాయ ప్రకీర్తితాః"

బృహత్పరాశర. అ. ౪-౧౧౭ పుట.

శ్లో. "చతుర్ణామపి వర్ణానాం...

అష్టా విమాన్ సమాసేన స్త్రీవివాహా న్నిబోధత"

మనువు. అ. ౩ శ్లో ౨౦.

అను విషయము విచారింపవలసియున్నది. రెండుగ్రంథములలోనూ ఎనిమిది సంఖ్య సమానము. పరాశరలో అవి సంస్కారము లన్నది విశేషము. అది స్త్రీకే సంస్కార మగుననునది మనువులో "స్త్రీవివాహః" నని విశేషించి స్త్రీపదముతో చెప్పినందున అది స్త్రీలకే సంస్కారమని బలపడినది. ఏమి? అది పురుషునకు సంస్కారము కాదు. 'నోదకేన నవాచావా' అని శ్లోకము చూపితిని. వాగ్దాన-ఉదకదానములతో మాత్రము పతిత్వము రాదు. సప్తపదితోనే పతిత్వము వచ్చునని వివరించితిని. అందుకే 'స్త్రీవివాహా' నన్నారు. ఏమీ ? అది వివాహమే అయితే స్త్రీపురుషుల కిద్దఱికీ సంస్కారమే అగును. సంస్కారదీపమందుగూడా వివాహ మనునది వివరించునపుడు 'వహనం = వాహః, విశిష్టో వాహః = వివాహః వివాహశబ్దస్య విశిష్టవహనార్థత్వం......వైశిష్ట్యంచ ప్రతిగ్రహాద్యష్టవిధోపాయాన్యతమోపాయేన స్వీకృతాయాం హోమాదిసప్తపదీనయనాంతకర్మభి స్సంస్కృతత్వం' = ప్రతిగ్రహాది యెనిమిది ఉపాయములలో నొకదానిచేత స్వీకరించినకన్యను హోమాదిసప్తపద్యంతకర్మలతో సంస్కరించుట వివాహ మనంబడును అని వ్రాసినారు. ప్రతిగ్రహ మంటే దానం పట్టుట. ఆదిపదముచేత క్రయము యుద్ధాహరణాదులును. ఇవన్నీ ఉపాయములే యనియు వివాహ మన్నది

పాణిగ్రహణాది సప్తపద్యంతకర్మకు చెల్లు ననియు స్పష్టము. కనుక ఉద్వాహము స్త్రీమాత్రసంస్కారమే. వివాహము ఉభయసంస్కారము.

కుల్లూకభట్టు మనువచనములోని 'స్త్రీవివాహః' ననుమాటను 'భార్యాప్రాప్తిహేతూ న్వివాహః' నని వ్యాఖ్యానించినాడు. ఈ యెనిమిదీ భార్యాత్వసంపాదక సంస్కారములు కావనియు దానికి సాధనములే యనియు నిందు స్పష్టము.

మనుపరాశరవచనము లేకాభిప్రాయము లైనవి. దీని కనుగుణముగా, "ఉద్వహేత ద్విజో భార్యాం"—(మను) అనుచోట, 'భార్యాం' అన్నది ద్వితీయావిభక్తికము—"అత్ర ద్వితీయయా భార్యాయా ఏవ సంస్కార్యత్వాభిధానాత్...ఉభయసంస్కారః. పాణిగ్రహణసంస్కారాత్పతిత్వం సప్తమే పదే ఇతి పతిత్వస్య వివాహవిధిభావ్యభార్యాత్వ నాంతరీయకత్వేన తద్బోధక పతిత్వశబ్దోపాదానేఽపి బాధకాభావాత్" అని సంస్కారదీపగ్రంథము. 'భార్యాం' అను ద్వితీయావిభక్తివల్ల ఉద్వాహము స్త్రీకే సంస్కార మనియు, సప్తపదిలోనే పతిత్వము వచ్చు నని మనువు చెప్పుటచేత పతిత్వముతో భార్యాత్వముకూడా వదలక వచ్చునన్నట్లే దానితాత్పర్య మనుచు సప్తపది ఉభయసంస్కార మగు నని స్పష్టముగా చెప్పినారు.

ఇట్లే సంస్కారతత్త్వమున రఘునందనుడు—౯౦౯ పుట—"పాణిగ్రహణం ఉద్వాహశ్చ భిన్నకర్మణీ" అని. ఉద్వాహము వేరుకర్మయు, పాణిగ్రహణము వేరుకర్మయు నన్నాడు. మొదటిది స్త్రీసంస్కారమున్ను రెండవది స్త్రీపురుషోభయసంస్కారమున్ను అనియే యతనితాత్పర్యము.

దీనికి బలముగా స్మృతిచంద్రికలోని నారదవచనము—"వరణాద్గ్రహణం పాణేః స్సంస్కారోహి విలక్షణః" వరణ మంటే దానాదులతో కన్యాస్వీకారము. దానికంటె పాణిగ్రహణము విలక్షణము అని యర్థము

కనబడుచున్నది. వైలక్షణ్య మంటే భేదము. వరణము స్త్రీసంస్కారము. రెండవది ఉభయసంస్కారము అనియే గ్రహించవలెను. ఇంతవరకు ఉద్వాహవివాహములకు భేదము చూపించితిని. ఉద్ధృత్య వహనం=ఉద్వాహః. కన్యను పితృగృహమునుండి తనవద్దకు తెచ్చుకొనుట అని వ్యుత్పత్తి చెప్ప వచ్చును. కాదన వీలు లేదు. ఉద్వాహ మొకకాలమందుచేసి మఱికొన్నాళ్లు గడచినతరువాతగూడా వివాహము చేయవచ్చును. వెంటనే చేయ నక్కర లేదు అనువిషయము సప్రమాణముగా వివరించుచున్నాను.

"ఉత్కృష్టాయాభిరూపాయ వరాయ సదృశాయచ,
అప్రాప్తసమయాం తస్మై కన్యాం దద్యాద్విచక్షణః"

మనుస్మృతి. అ. ౯ శ్లో. ౮౮.

తనకంటె గొప్పకుటుంబమువాడును, సుందరుడును, కన్యకకు దగినవాడు నగువరుడు అడుగవచ్చినపుడు వివాహము చేయునీడు రాకున్నను బుద్ధి మంతుడైనతండ్రి కన్యను ఆవరునకు ఇవ్వవలెను. (ఇవ్వవచ్చును అనికూడా అర్థము) "అప్రాప్తసమయాం = అప్రాప్తవివాహసమయాం బాలికా మిత్యర్థః" అని మాధవాచార్యులవ్యాఖ్య. ఆమాటకే మేధాతిథి—అయోగ్యామపి" అని "కామస్పృహా యస్యా నోత్పన్నా సాచ అష్టవర్షా షడ్వర్షావా నత్వత్యంతబాలైవ" అనికూడా వివరించినాడు. కామేచ్ఛ యెవతెకు అంకురించలేదో అట్టిది వివాహమునకు అప్రాప్తసమయ; అనగా యెనిమిది ఆరు సంవత్సరముల వయసు దనియు, అంతకు తక్కువవయసుది కూడా కాదనియు వ్యాఖ్యానించినాడు. కుల్లూకభట్టుకూడా నీచోట దక్షవచన ముతో "వివాహయే దష్టవర్షా మేవం ధర్మో నహీయతే" = ఎనిమిదేళ్లదానిని దానము చేయవచ్చును, అందువల్ల ధర్మహాని లేదు. అని వ్రాసినాడు. వీటినిపట్టి కన్యలఎనిమిదేళ్ల వయసు, వివాహమునకు అప్రాప్తసమయమనియు, యౌవనమే వివాహమునకు ప్రాప్తసమయ మనియు, అపుడు దానము

చేసినా ధర్మహాని లేదు అని దక్షవచనమున ఉటంకించుటవల్ల నది అధమ పక్షముగా నంగీకరింపబడినట్లును స్పష్టము. వివాహయే త్తన్న దక్షవచనమునకు వివాహప్రయోజకవ్యాపారము (దానము) చేయవలె నన్న యర్థమే వచ్చు నని యెఱుంగవలెను. వివాహసమయ మది కావని మనువు చెప్పుటచేతను ఆచోట దానశబ్దమే ఉపయోగించుటచేతను దానితో నేకవాక్యతను గలుగ జేయుట కాయర్థమే చెప్పకతీరదు. దీనినిబట్టి అప్రాప్తసమయములో దాన మున్ను ప్రాప్తసమయములోనే పాణిగ్రహణాదికర్మయగు వివాహమున్ను జరుగవలసినదిగా నేర్పడుచున్నది. కనుక ఉద్వాహవివాహములకు వ్యవ ధానముకూడా శాస్త్రసమ్మతమే యని యెఱుంగునది. ఇందు కీమనువచనమే ముఖ్యప్రమాణము. దీని కితరవచనములు సరిపెట్టితేనేకాని యేకవాక్యత కుదరదు. అట్లు కానివాదము దుర్బల మగును. "మన్వర్థవిపరీతాతు సా స్మృతి ర్న హి శస్యతే" మనువుయొక్క అర్థమునకు సరిపడనియితరస్మృతి అప్రశ స్తము. అనగా అప్రమాణ మని తాత్పర్యము.

దైవవివాహము - యజ్ఞము చేయించు బ్రాహ్మణునకు దానము చేయు నది. ఈకన్యాదానము యజ్ఞదక్షిణ యిచ్చుకాలమందు జరుగవలయును. దక్షిణ యిచ్చినతరువాతకూడా కొంత యజ్ఞకర్మ మిగిలియుండును. ఆకర్మ పూర్తికానిదీ యజ్ఞంమధ్యను వివాహం ప్రారంభించరాదుకదా! దీనినిబట్టి చూచినా వివాహకాలము యజ్ఞానన్తరమందు, దానకాలము యజ్ఞము మధ్యను గనబడుచున్నది, కనుక ఆరెంటికిని కాలవ్యవధాన ముండవచ్చును. కన్యాదానము దక్షిణాకాలమందే చెప్పబడెను. దక్షిణ యజ్ఞమధ్యనే చెప్ప బడినది. దక్షిణ లిచ్చినతరువాత యజ్ఞకర్మ యింకా ఒకపూటవరకూ ఉండును. వైద్యనాథదీక్షితీయమున—

"ఋత్విగ్వరణవేళాయామేవ వరసంపద్యుక్తం వర యేత్ ......దక్షిణాకాలే తదీయేన భాగేనసహ తస్మై

కన్యాం దద్యాత్, సచ ప్రతిగృహ్య సమాప్తే యజ్ఞే శుభ
నక్షత్రే వివాహం కుర్యాత్ ”

ఋత్విక్కులను తెచ్చుకొన్నపుడే పెండ్లి చేసుకొనదలచినవరుని ఋత్విజునిగా తెచ్చుకొనవలెను. యజ్ఞదక్షిణ యిచ్చినపుడు వానివంతుదక్షిణతో కలిపి కన్యనుకూడా దానము చేయవలెను. వాడు యజ్ఞము పూర్తి యయినతరువాత శుభనక్షత్రమందు ఆపిల్లను వివాహమాడును. అని తా. దీనిబట్టి చూడగా దాన మయినతరువాత తిరిగీ శుభనక్షత్రము వచ్చేవరకూ వివాహానకు వ్యవధి కనబడుచున్నది.

రాజమార్తాండము— “ మాంగల్యేషు వివాహేషు కన్యాసంవరణే షుచ, దశమాసాః ప్రశస్తాస్స్యుః ” ఇది శబ్దకల్పద్రుమము. వివాహశబ్దముచోటను. నిర్ణయసింధులోను, ఉద్వాహతత్త్వమందును వారు ఎత్తిచూపిన వచనము. ఇందు కన్యాసంవరణమునకు వేరు ముహూర్తము, వివాహమునకు వేరు ముహూర్తమును జెప్పబడినవి. మాసముల నెత్తుకొని ముహూర్తము నిర్ణయించుటచేత ఒకనెలకు తక్కువ కాని కాలము వ్యవధి యుండవచ్చునని కనబడును. కన్యాసంవరణశబ్దమున కర్థము రఘునందనుడు ఉద్వాహతత్త్వమందు—“కన్యాహస్తోదకవిధా” అని అర్థము వ్రాసినాడు. ఉదకపూర్వదానమందు కన్యచేయి వరునిచేతిలో నుంచి ఉదకము వరునిచేతిలో దాత పోయును. కనుక ఉదకదాన మని యర్థము చేయవలసియున్నది. ఇప్పటి యాచారమునుబట్టి శ్లోకాలు సమన్వయించితే దానమును వివాహమును ఏకకాలమందే జరుగుటచేత వాటికి వేరువేరుగా ముహూర్తము వ్రాయ నవసర ముండదు. కావున దానకాలమందే వివాహముకూడా చేయవలెనన్న నిర్బంధము లేదు.

“ అచేకేభ్యో హి దత్తాయా మనూఢాయాంతుయత్రవై,
వరాగమశ్చ సర్వేషాం లభేతాదివరస్తు తామ్.”

పరాశరమాధవీయ, స్మృతిచంద్రికా వచనము.

కన్యను అనేకమందివరుల కిచ్చియున్నపుడు అందఱును పెండ్లి కాలమునకు వచ్చి తగవులాడినపుడు మొదటివరునికి ఆకన్య చెందును. ఇది వాగ్దాన మనుకొంటారు. కాదు. అట్లయితే 'దత్తాయాం' అని యుండవలెను. కనుక కన్యాదానమే.

మాధవీయ నారదవచనము—

"ప్రతిగృహ్యతు యః కన్యాం వరో దేశాన్తరం గతః,
త్రీనృతూ న్సమతిక్రమ్య కన్యా కుర్యా త్స్వయంవరమ్."

వరుడు కన్యాదానము పట్టి (అనగా అప్రాప్తకాలంలో) దేశాన్తరము వెళ్లిపోతే రజస్వలయైన కన్య మూడుఋతువులవరకూ అతడు వస్తాడేమో అని కనిపెట్టి అప్పటికీ రానపుడు మఱొకనిని పెండ్లిచేసుకోవచ్చును. కన్య మేజ రయినందున తండ్రికి తప్పు లేదు. తండ్రే పెండ్లి చేయవచ్చును. స్వతంత్రత పిల్లకు వచ్చినది కనుక. మఱియు మూడు ఋతువులవరకు కనిపెట్టినందువల్ల కన్యకుగూడా తప్పు లేదు. కనుక యీ రెండు శ్లోకములవల్లను దానమునకు వివాహమునకు వ్యవధియుండుట పూర్వకాలమం దాచారములో నుండె ననుటకు సందేహము లేదు.

ఇప్పటి యాచారమునుబట్టి యోజించితే దానవివాహముల మధ్యను దేశాన్తరగమనమునకు వ్యవధియే లేదు.

వృద్ధపరాశర —

"విధిపూర్వం సవర్ణేషు కన్యాదానే కృతే యది,
నివర్తనం నకుర్వీత నిమిత్తాదర్శనే సతి."

తగినంత కారణము లేనిదీ కన్యాదానము చేసి రద్దు చేయరాదు. ఇప్పటి యాచారమును బట్టి కారణాలు కనిపెట్టడమునకును రద్దు చేయుటకును తగిన వ్యవధి యేదీ ?

ఆపస్తంబసూత్రము:—ఎట్టి కన్యను వివాహమునకు అడుగరాదు—అను సంధర్భంలో—దత్తాం—అని నిషేధించినాడు. 'దత్తాం' అంటే దానము చేసినదానిని అని అర్థము. దానిని భాష్యములో — 'దత్తాం = వాచా ప్రతిశ్రుతాం-ఉదకపూర్వంవా ప్రతిపాదితాం' అని వ్యాఖ్యానించినారు. వాగ్దాన మైనాగాని, ఉదకపూర్వకదాన మైనాకాని అయినతరువాత ఆ కన్యను పెండ్లికి అడుగరాదు. ఇప్పటిలో పెళ్లితరవాయే లేదు గదా! అడుగుట కవకాశ మేది? కనుక గ్రంథాలకూ మన యిప్పటి యాచారానికీ వ్యత్యాస మున్నాదని నమ్మవలెను.

ఇట్లొక్క దానమునకే కాక క్రయ, యుద్ధాహరణాది ఉద్వాహములలోగూడా వివాహవ్యవధానము స్పష్టముగా గలదు.

క్రయము చేసుకొని యింటికి దెచ్చుకొని శుభముహూర్తమున పెండ్లాడును. గాంధర్వమునగూడా మొదటి సంభోగముతో పెండ్లి పూర్తి కాలేదు. అది పెండ్లియే యనబడదు. తల్లిదండ్రులకు జరిగిన సంగతి చెప్పి వారు నిర్ణయించిన ముహూర్తమున వివాహము జరుగును. వివాహ మాలస్యమయి మొదటి సంయోగమునందే గర్భము నిలిచితేకూడా గర్భముతో నున్నపుడే వివాహము జరుగవలెను. ఆ పుట్టిన శిశువే సహోఢు డనబడును. గ్రంథ నిదర్శనము కలదు.

ఇప్పటికిని పంజాబు బ్రాహ్మణులలోను, మలయాళమునను బ్రాహ్మణులలోనే దానము చేసి రజస్వలానంతరమందు వివాహమును జేయుచున్నట్లు చాలామందికి తెలియును.

మఱియు— ధర్మసింధు ౪౩౬. పుట. నాగరి. 'ఉద్వాహే త్ర్యిథమే శుచౌ యది వసేత్ భర్తుర్గృహే కన్యకా హన్యా త్తజ్జననీం......పతించమలినే—ఇత్యాది శ్లోకము కలదు. దీనిని విచారించవలసియున్నది. ఉద్వాహ మయినతరువాత మొదటిసంవత్సరమున భర్తయింట గ్రీష్మఋతు

వులో నుండరాదు. ఉంటే అత్తగారు చనిపోవును. మలమాసములో నుంటే భర్త చనిపోవును అని దోషము చెప్పినాడు. ఇచట ఉద్వాహ మనునది నేను చెప్పిన కన్యాస్వీకారమాత్రమునకే అర్థమంటే యింకా భార్య సర్వదా తనదగ్గర నుండ నవసరము లేదు. కాని, పాణిగ్రహణ మయిన దంటే అగ్నిహోత్రము లుండును. భార్య దగ్గరలేకుంటే అగ్ని సిద్ధించదు. 'ఆజీవం హోష్యామి' అని ఔపాసనహోమము నిత్యము జరిపించుటకు సంకల్పించినాడు కనుక భార్య విధిగా దగ్గర నుండక తీరదు. మఱియు "పాణిగ్రహణాది గృహ్యాం పరిచరేత్" అనుటచేత ఉదయాస్తమయహోమములు జరుగక తీరదు.

"కృతదారో నైవ తిష్ఠేత్ క్షణ మప్యగ్నినా వినా,
తిష్ఠేత చేద్ద్విజోఽభార్య స్తదాచ పతితో భవేత్."

వివాహ మయినవాడు హోమమునకు అగ్ని లేకుండనుంటే అభాగ్యుడు, పతితుడు అగును. మఱియు ఆపస్తంబసూత్రము—"పాణిగ్రహణాది సహత్వం కర్మసు తథా పుణ్యఫలేషుచ" అనుటచేత వివాహము మొదలు అన్ని కర్మలకు భార్య సహాయురాలుగా ఉండకతీరదు. ఇదికాక.

"వధ్వాసహ గృహం గచ్ఛేదాదాయాగ్నిం తమగ్రతః,
సూత్రోక్తవిధినా చైవ ప్రియా మూఢాం ప్రవేశయేత్.
ప్రతిష్ఠాప్యానలం కుర్యా"

త్తను ఆశ్వలాయనగృహ్యకారిక ననుసరించి గృహప్రవేశమునకు భార్యను తనయింటికి తెచ్చినదిమొదలు అగ్నితో నామె యుండకతీరదు. మఱియు వ్యాసవచనములో—

"కృతదారోఽగ్నిపత్నీభ్యాం కృతవేశ్మా గృహంవిశేత్,
......సమ్యగ్ధర్మార్థకామా దంపతీభ్యామహర్నిశమ్"

అనుటచేత ధర్మార్థకామములలో అగ్నిని భార్యను వదలరాదనగా భార్యను విడిచియుండుట శాస్త్రము చెప్పనపుడు ధర్మసింధువచనము పాణిగ్రహణ మర్థము చెప్పితే వ్యర్థ మగును. శాస్త్రములో ఆచెప్పినయర్థమువల్ల ఏవచనమూ వ్యర్థము కానట్లు చెప్పినదే సరియైనయర్థము. అదే ప్రమాణము. తదితరము అప్రమాణము. ప్రమాణవివేకము ౫-వ సూత్రము చూడండి. కనుక మీదిశ్లోకమున ఉద్వాహపదార్థము కన్యాస్వీకారమాత్రమే. పాణిగ్రహణము కానేరదు. అట్లయినపుడు ఉద్వాహవివాహములకు వ్యవధానమున్న ట్లే—అట్లు కాకపోతే కంఠతః మనువు అప్రాప్తసమయమని యొక్కదాని నెట్లు నిర్ణయించును? ఎప్పటికప్పుడే పుట్టినది మొదలు ప్రాప్తసమయమే యగును.

కనుక పూర్వకాలమందు దానానన్తరము సుముహూర్తము (జీలకఱ్ఱ బెల్లము తలమీద నుంపించు) వరకూ చేసి తండ్రియింటనే కన్య నుంచివేసి యౌవనము రాగానే తనయింటికి గొనిపోయి వివాహము చేసుకొనేయాచారముండేది అనుటకు ఈ ధర్మసింధువచనము ప్రబలప్రమాణము. దీనిని ఖండింపలేక సుప్రసిద్ధపండితులు ఈశ్లోకము జ్యోతిషశ్లోకము; ధర్మశాస్త్రములో ప్రమాణముగా తీసుకొనరాదు—అని అన్నారు. ధర్మసింధులోని శ్లోకము జ్యోతిష శ్లోకమట! అట్టియాచారమే లేకపోతే వివాహముహూర్తమని నిర్ణయించినది ముఖ్యమయిన ప్రధానహోమము దగ్గఱనో పాణిగ్రహణము దగ్గరనో ఉంచక కన్యాదానం దగ్గర ఉంచుటకు హేతు వేమి యని యడిగితే సమాధానము రాదు. పూర్వము దానాన్తమే చేసియుంచుట నిశ్చయము. అదీ వివాహమే. ఎట్లంటారా? స్త్రీ వివాహము లెనిమిదింటిలోనిదే కదా దానము. రఘునందనలక్షణము వివాహసాధనమునకు కూడా వివాహసంజ్ఞ జెప్పినాడు కదా! ఇదే బాల్యమందు చేసే వివాహము. ఇపుడు తుదకు పిల్లలను గనుకర్మవరకూ పూర్తిచేసి ఉయ్యాలలో బొమ్మను పెట్టి ఊపుటకూడా జరిగించుచున్నారు. అది తప్పు అశాస్త్రీయము.

ఈయుద్వాహముకూడా,

"షడబ్దమధ్యే నోద్వాహ్యా కన్యకా వత్సరద్వయమ్,
సోమో భుంక్తే యతస్తద్వద్గంధర్వశ్చ తథానలః."

పుట్టినది మొదలు రెండేసిసంవత్సరములు వరుసగా సోమగంధర్వాగ్ను లనుభవింతురు. మనుష్యునకు ఇంకా హక్కు రాదు. కనుక ఆరేళ్లవరకూ ఉద్వాహము చేయరాదు. అని నిషేధ మున్నందున నట్లనవలెను. కొందఱు పూర్వాచార పక్షపాతులుకూడా దీనిని సమ్మతించి యిది అప్రాప్తకాలమే యందురు. ఇంకను అప్రాప్తకాలము ఋషులమతమున గలదు. ముందు జూపుదము.

ఏమంటే—"ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చోత్పాదనీయా" యను వధూవరుల యుభయసంకల్పమునకు ఆరేండ్ల లోపుదానికి అధికారముండునో లేదో బుద్ధిమంతు లూహించుదు. ఇంతవరకు ఉద్వాహ వివాహకాల వ్యవధి చూపితిని.

ఇక ఉద్వాహమునకు వివాహశబ్ద వ్యవహార మున్నదా యని విమర్శించవలసియున్నది.

"ద్వివర్షాచ్చేద్వివాహశ్చేత్కన్యకా మరణం యది,
ఖననం నైవకర్తవ్యం మంత్రసంస్కార మాచరేత్."

అని వైద్యనాథాది వచనము కలదు. దానియర్థము — రెండేళ్ళ లోపుదానికి పెళ్లియై రెండేళ్లలోపుగానే మరణించితే దహనమే మంత్రములతో చేయవలెను. ఖననము చేయరాదు - అని. ఇచట వివాహపదార్థము దానమా? అయితే వాగ్దానమా? ఉదకపూర్వకదానమా? పాణిగ్రహణము మాత్రము కాదని యిదివరకు ఋజువు చేస్తిని.

ఉద్వాహమంటే తండ్రియింటినుండి కన్యను తనయింటికి తెచ్చుకొనుట యని యర్థ మిదివరకు చూపియుంటిని. అదే యయినపుడు ఉదకదానము చేయరాదన్న నిషేధము తగిలినందున వాగ్దానమాత్రమే నామతమున. ఉద్వాహమంటే వివాహమే అనువారి బాలికావివాహవాదమున గూడా నీనిషేధము తగిలినందున ఉదకదానమో వాగ్దానమో చెప్పకతీరదు. అది వారిమతమున మనువచనప్రకారము అప్రాప్తకాల మగును. అపుడు దానమాత్రమే. కావున వారికిగూడా దానవివాహవ్యవధానము ఉండకతీరదు. రెండుపక్షములలోను (వాగ్దానమునకుగూడా నామతమున ఉదకదాన మను వారిపక్షము)—దానమునకే వివాహసంజ్ఞ చెప్పవలెను. లేకుంటే ద్వివర్షాత్తనుశ్లోకములోని వివాహపదార్థ మేమనవచ్చును? కనుక దానాన్తమునకుగూడా (ఉద్వాహమునకు) వివాహసంజ్ఞ కలదు.

సిద్ధాన్త మేమంటే, ఆరేండ్లలోపున వాగ్దానమే. తరువాత ఉదకదానమాత్రమే. యౌవనప్రారంభమందే పాణిగ్రహణసప్తపదు లని యెఱుంగదగును. వాగ్దానముగూడా వివాహప్రయోజకవ్యాపారము కనుక రఘునందన వివాహలక్షణము సమన్వయించినది. వివాహసాధనము వాగ్దానము కాదని యెవ రనంగలరు?

అవసరము వచ్చినందున వాగ్దానము వివరింతును. వాగ్దానము రెండు విధములు. వైదికము, లౌకికము. ధర్మసింధు. ३६४ పుట.

"వివాహనిశ్చయశ్చ వైదికో లౌకికోవా గ్రాహ్యః, వైదికో వాగ్దానాఖ్యవిధినా కృతో ముఖ్యః. లౌకిక శ్శుల్క-భాషాపూగీఫలదానాదిశ్చ."

వైదికవాగ్దానము మంత్రములు హోమములతో జరుగును. క్రయనిర్ణయము మొదలగువాటితో కరారులుమాత్రము చేసి తాంబూలాలుమాత్రమే సంబంధు లిచ్చుకొనుట లౌకికవాగ్దానము. ధర్మసింధు—४०८. పుట.

"వివాహనక్షత్రాదియుతే సుదినే వరస్య పిత్రాదిః కన్యాగృహం గత్వా కన్యాపూజనం కరిష్యే ఇతి సంకల్పయేత్. తదంగ గణపతి వరుణపూజనాది కుర్యాత్. కన్యాపితాతు కరిష్యమాణకన్యాదానాంగభూతం వాగ్దానం కరిష్యే ఇతి సంకల్పయేత్. తదంగ గణపతిపూజనం వరుణపూజనంచ కరిష్యే."

వివాహమునకు చెప్పిన శుభనక్షత్రమందే వాగ్దానము. వాగ్దానము ఉదకదానమునకు అంగము. వరపక్షమువారు కన్యాపూజ చేతురు. వారు కన్యాదాతను 'వృణీమహే' (పిల్ల నడుగుచున్నాము) అందురు. దాత 'వృణీధ్వం దాస్యామి' (అడగండి యిస్తాను) అని అనును. గోత్రప్రవరలు మూడుమార్లు చెప్పుదురు. (దీనివల్ల గోత్రైక్యము ఋష్యైకము కాకుండు నట్లు చూచుకొనుటకు వీలుండు నని యీపనికి కారణ మూహింపవచ్చును) ఇది వైదికవాగ్దానము. దీని నీకాలమందు వివాహదినమందే వాడుచున్నారు గౌరీపూజదగ్గిర. కాని పూర్వము వివాహానకు ముందుగూడా అనురూప వరుడు తటస్థించినపుడు చేసేవారు. ఇట్లు వైదికవాగ్దానము చేసి పెండ్లి కాకమునుపు కన్య మరణించితే "వాగ్దానేతు త్రిరాత్రం స్యాత్" ని మూడురాత్రులు వరపక్షమువారి కాశౌచ ముండును. వాగ్దానముకూడా కన్యాసంస్కారమే కాకుంటే ఆశౌచ మేల వచ్చును? ఇచట ఉత్కళులలో—"వాగ్దానాంగశాంతిహోమం కరిష్యే" అని సంకల్పించి— "భూస్స్వాహా"...ఇత్యాది ర న్ను, "త్వన్నో అగ్నే సత్వన్నో అయాశ్చాగ్నే ఏతే శతం ఉదుత్తమం" ఈమొత్తం తొమ్మిది హోమములు చేసి దుర్గాపంచకహోమమంత్రహోమము, పూర్ణాహుతి చేసి, ప్రణీతామార్జనము కన్యకకు జేతురు. తరువాత కన్యకు అలంకారము లిత్తురు. ఇప్పటికీ యీ యాచారము జరుగుచున్నది. కర్మాసక్తి ఆంధ్రులలో తక్కువ యనవచ్చును.

హోమమునకు ప్రమాణము లేకపోలేదు. రఘునందనోద్వాహ తత్త్వమందు "తత్ర యని పూర్వం వాగ్దానం క్రియతే. అద్యేత్యాది అముకగోత్రస్య అరోగిణః అవ్యంగస్య అపతితస్య అక్లీబస్య అవివాహో ముకగోత్రస్య అముకీం దేవీం కన్యాం దాతుం తవాహం ప్రతిజానే. ఇతి పితా బ్రూయాత్. అస్మిన్కాలే అగ్నిసాన్నిధ్యే స్నాతః స్నాతే హ్యరోగిణీ"త్యాది గ్రంథము గలదు. కనుక హోమము కలదు. "అద్భిరేవ ద్విజాగ్ర్యాణాం కన్యాదానం ప్రశస్యతే" బ్రాహ్మణులకు కన్యాదానము ఉదకముతోనే శ్రేష్ఠ మనుటవల్ల వాగ్దానము కూడా ఉదకము ముట్టుకొనియే "దాస్యామి" అనికాని, 'దాతుం ప్రతిజానే' అనికాని అనవలెను. రెంటికిని అర్థము 'ఇస్తాను. ఇచ్చుటకు ఖరారు చేయుచున్నాను' అని.

ఇది కాక సంవర్తస్మృతిలో ౨౮౯ పుట. నాగరి. స్మృతిసముచ్చయము.

"అలంకృత్య తు యః కన్యాం వరాయ సదృశాయ చ,
బ్రాహ్మేణ వివాహేన ......పురుషో దత్వా, హోమమంత్రైస్తు సంస్కృతామ్."

హోమ మంత్రములతో సంస్కరించిన కన్యను సాలంకృతముగా బ్రాహ్మవిధి ప్రకారము దానము చేసితే, ఫలము అని చెప్పినాడు. మంత్రాలేవి? సంస్కారశబ్ద మున్నది. కావున మీద వివరించినదానికిదే ప్రమాణము. కొందరు తెలియక యిప్పటాచారములో లేనందున హోమమంత్రమంటే ప్రదానహోమ మందురు. కన్యాదానము ప్రదానహోమమునకు ముం దున్నది. దానహోమమునకు కర్త తండ్రి; ప్రదానహోమ కర్త కన్య, వరుడును. ఇచట హోమకర్తగా దాతను చూపినందున ప్రధాన హోమము కాదు.

అయితే యిచట నొక వచనము సమన్వయించవలసియున్నది. మాధవీయ కన్యాశౌచప్రకరణమున—

"అవారిపూర్వం ప్రత్తాతు యా నైవ ప్రతిపాదితా,
అసంస్కృతా తు సా జ్ఞేయా త్రిరాత్ర ముభయోస్సమమ్."

ప్రత్తా అంటే వాగ్దత్త యని యర్థము. నేను చెప్పుచున్నాను. కొందఱు ఉదకపూర్వకదాన మందురు. అనగా ప్రతిపాదనము.

"ప్రత్తాయాంతు త్రిరాత్రం స్యాద్దత్తాయాం పక్షిణీ భవే"

త్తను పులస్త్యవచనమును వ్యాఖ్యానించునపుడు మాధవాచార్యులవారు—

"ప్రత్తాయాం ప్రక్రాంతదానాయాం వాచా దత్తాయా మితి యావత్"—

అని వ్యాఖ్యానించుటచేత నిచటకూడా ఆపదానికదేయర్థ మని నాకు ప్రమాణము. ఉదకస్పర్శ వాగ్దానములో లేదనుకొని వారిపూర్వశబ్దమువల్ల ప్రతిపాదనమే అర్థ మనుకొని యితరులు భ్రమపడ్డారు. గ్రంథములు చక్కగా పరిశోధించకపోతే సరియయిన ధర్మము బోధపడదు. నాయర్థము ఏమంటే—"అవారిపూర్వం ప్రత్తా" ఉదకము ముట్టి వాగ్దానము చేయని కన్య 'యా నైవ ప్రతిపాదితా' ఉదకపూర్వకముగా దానము కానట్టిది, చనిపోతే వరపక్షవధూపక్షబంధువులకు త్రిరాత్రాశౌచమేను. అని. ఉదకపూర్వవాగ్దానమైతే సంస్కార మయినట్లుకూడా ఈవచనములో ధ్వని యున్నది. పాణిగ్రహణ మయ్యేదాకా కన్య అసంస్కృతయే యని చాలా మందికి భ్రమ కలదు. సంస్కారమే కాకపోతే వరపక్షమునకు ఆశౌచ మేల తగులును? కనుక వారివాదము తప్పు. మీది పులస్త్యవచనములో 'దత్తాయాం పక్షిణీ' అన్నచోట ప్రతిపాదన మయితే పితృకులమునకు పక్షిణీయని యర్థము. భర్తృకులమునకు పదిరోజు లాశౌచ మని కొంద అందురు.

నామతమున "ఉద్వాహ మంటే కన్యను వరునకు ప్రతిపాదనము చేయుటే. అనగా, "తుభ్యం ప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయామి"

అని కన్యాహస్తమును వరునిచేతిలో నప్పగించుటే—దీనితో నిలిపి కాలాంతరమందు ప్రదానహోమాది వివాహము చేయవచ్చు" నని యింతవరకు ఋజువు చూపితిని. దీనిపై నొకయాక్షేపణము వచ్చెను వినండి.

ఆశ్వలాయనుడు—

"రాత్రౌ వహనివా దానం కన్యాయా స్స్వీకృతిర్యదా,
తదానీమేవ హోమస్స్యాత్ వివాహస్యచ సిద్ధయే."

ఆక్షేపించినవారియర్థము—రాత్రికాని పగలుకాని ఉదకపూర్వక దానము జరిగినవెంటనే ప్రదానహోమము చేయకుంటే వివాహము సిద్ధించదు. కనుక వెంటనే పెండ్లి చేయవలెను కాని దానవివాహాలకు వ్యవధి యీవచనమువల్ల పోవుచున్నది—అందురు.

నే నంటాను! ఇచట హోమశబ్దమే ఉన్నది కాని ప్రదానహోమమని నొక్కి వక్కాణించలేదే! మీద వివరించిన సంవర్తస్మృతిలో—'హోమమంత్రైస్తు సంస్కృతామ్' అని దానానికి పూర్వము హోమసంస్కారము చెప్పబడియున్నది. వాగ్దానవిధిలో జూపినహోమములే కన్యాప్రతిపాదనకాలమందుకూడా పూర్వము చేసేవారు. అంతతో నిల్పినపుడు అట్లు చేయకపోతే కన్యాసంస్కారము కానేరదు. అదే 'వివాహస్యచ సిద్ధయే'-అని సిద్ధి ఉటంకించినాడు. అట్లు చేసితే రజస్వల యయినను అసంస్కృతరజస్వలాత్వదోష ముండ దని ఋషులతాత్పర్యము. బాల్యమందే వివాహ మంతా జరిగించవలచినవారు ఆకర్మను మానినారు. అట్లుంచితే కన్యాదాత పూర్వదానము ఒకవేళ త్రిప్పివేసి పునర్దానవిధిప్రకారము మఱొకనికి దానము చేసివేస్తా డనిన్నీ లేదా యింత కెక్కువసంబంధము వచ్చినపుడు వరుడే కన్యను వదలివేయునేమో యనిన్నీ ఉభయపక్షులు భయపడి పాణిగ్రహణముకూడా కానిస్తున్నారు. అది తప్పు-అని నాసమాధానము.

కనుక యీశ్లోకము ఉద్వాహవివాహములకు వ్యవధానమును ఆటంకపెట్టలేదు.

ఇది ఉద్వాహ వివాహ వ్యవధానవివేకము-చతుర్థభాగము.

———

# వివాహతత్త్వము

## పంచమభాగము

---

### కన్యాశబ్దనిర్వచనము

"పాణిగ్రహణికా మంత్రాః కన్యాస్వేవ ప్రతిష్ఠితాః,
నాకన్యాసు క్వచిన్నౄణాం లుప్తధర్మక్రియాహి తాః"

అని మనుస్మృతి—పాణిగ్రహణమంత్రములు కన్యలయందే వినియోగించును; కన్యలు కానివారలయందు వర్తించవు - అని యున్నది. కన్యయంటే యెవరో తెలియనిదీ పెండ్లినిగూర్చి తెలిసికొనుట కష్టము.

మాధవీయభారతవచనము—

"ఋతుస్నాతా తు యా శుద్ధా సా కన్యేత్యభిధీయతే"

పురుషసంపర్కము లేక ఋతుస్నానము చేసినది కన్య యనంబడును. మనువ్యాఖ్యలో మేధాతిథి—"కన్యాశబ్దశ్చాత్ర ప్రకరణే అప్రవృత్త పుంసంప్రయోగాయాం యోషితి వర్తతే" అని 'ఉద్వహేత ద్విజో భార్యాం' అనుచోట వ్రాసినాడు.

భారతవనపర్వమునందు—

"యస్మాత్కామయతే సర్వాన్ కమేర్ధాతోశ్చ భావిని,
తస్మాత్కన్యేతి సుశ్రోణి! స్వతంత్రా వరవర్ణినీ."

కముధాతువునుండి కన్యాశబ్దము పుట్టినది. వరులను కోరునది అని అర్థము. తనవరుని తాను ఎంచుకొనుటలో స్వతంత్రురాలు అని వచన తాత్పర్యము. దీనివల్ల మైనార్టీ తీరినదానికే పెళ్లి యని స్పష్టము.

వృద్ధగౌతమ—" కన్యా చాక్షతయోనిస్స్యాత్ "—అని. పురుష సంపర్కము లేనిది అనియే దాని కర్థము.

వ్యాకరణమహాభాష్యము నిట్లే చెప్పెను. ఇదివరకు జూపియుంటిని. అందు చివరను " కన్యోక్తాయాః కన్యాభిమతాయాః సుదర్శనాయాః " అని వివరించినారు. ఇది అప్పటియాచారమును తెలుపును. అందు ఒడం బడికతో గూడిన సంభోగమువల్లనే కన్యాత్వము పోవునని యున్నది. వీటికిని అదే యభిప్రాయము చెప్పవలెను.

'కన్యాయాః' అంటే పురుషసంపర్కశూన్య అని యుండగా 'కన్యోక్తాయాః' అనికూడా అనుటలో నభిప్రాయ మేమంటే, బంధువు లందరును ఇది కన్యయే ( పురుషసంపర్కము లేనిది ) అని చెప్పబడినదికూడా వివాహార్హురా లని తెలియుటకు. ఇకను 'కన్యాభిమతాయాః'—అన్న దెందుకు? ఒడంబడికలేని పురుషసంపర్కము ప్రమాదాత్తు కలిగినా వరుడు పెండ్లి చేసుకొనుట కంగీకరించితే ఆమె కన్యాభిమత యగును. అట్టివివాహ మశాస్త్రీయము కాదు. ఏమంటే రాఘవానందవ్యాఖ్యలో, " అపిచ గాంధర్వాసురపైశాచానాం క్షతయోనేరేవావశ్యకత్వాత్ ...నతు క్షతయోనే ర్వైవాహికమంత్రహోమాదినిషేధక మిదం ( నాకన్యాసు అనేనిషేధము ) యథా గర్భిణీ సంస్క్రియతే " అను మనువచన మున్నది. ఇట్టిదే కన్యాభిమత. క్షతయోనికిగూడా మంత్రములతో వివాహము గలదు. గాంధర్వాసురాదులలో క్షతయోనికే వివాహశాస్త్రము.

ఇక 'సుదర్శనాయాః' అనుదానిని విమర్శించవలె. కైయటుడు సుదర్శన అంటే 'ప్రకటదర్శనాయాః' అని వివరించి అసుస్తత్వాత్తని

కారణము వ్రాసినాడు. అసుప్త అంటే 'ఘోషా' లేని దని యర్థము. అదంతా కాలానుసారివ్యాఖ్య. అది ప్రాచీనభావ కర్థము కాదు. ప్రాచీన ప్రయోగము చూడండి. విష్ణుస్మృతిలో రాజు ఎట్టివాడై యుండవలెను? అన్న సందర్భములో "సర్వత శ్చాత్మానం గోపాయేత్. సుదర్శనశ్చ స్యాత్"—అన్ని విధముల తనను కాచుకొనుచుండవలెను సుదర్శనుడు కావలెను. అంటే ప్రకటదర్శనుడు కావలెను అని అర్థము చెప్పితే సరిపడదు. దర్శనశబ్దమునకు జ్ఞాన మని యర్థము. మీమాంసాదర్శనము, వేదాన్తదర్శనము, అన్నిచోట్ల నదేయర్థము. సు=మంచి, దర్శనము=వివేకముగలవా డని యర్థము. కన్యాపక్షములోగూడాయుక్తాయుక్తవివేకజ్ఞానము గలిగేయీడుదై యుండవలెను, బాలిక కారాదు అనియే తాత్పర్యము చెప్పవలెను.

వ్యవహారమాధవమున అకన్యాపదము వివరించుపట్టున,

"అత్ర నఞః ప్రాగభావో అర్థః. వివాహే కన్యాత్వ ధ్వంసః."

౪౯౭ పుట. మొ. ౫౦౦ లో.

"విద్యమానానేవ అపస్మారరాజయక్ష్మాదీ ద్దోషా న్ప్రకాశ్య ఇయ మకన్యా ఇతి దూషయత్యసౌ శతం దండ్యః."

ఉన్నటువంటివే అపస్మారరోగము, ఉబ్బస, క్షయ ఇత్యాదిరోగములు ఈపిల్లకున్న వని యెవడైనా చెప్పి పెండ్లికాకుండాచేయునో వానికి నూరు రూపాయీలు జరిమానా. అనే యీసందర్భమున వివాహమయితే కన్యాత్వమునశించును అన్నందున పెండ్లిలేనిస్త్రీ కన్య అని తాత్పర్యము తేలును. పెండ్లి కావున్నను దీర్ఘరోగముకలది అకన్య యగును. అనగా పెండ్లి కనర్హురా లని తాత్పర్యము. దీనినిబట్టి కన్యాయనుపదమున కర్థము పెండ్లి యాడుటకు అర్హతకలది యని తేలినఫలితార్థము.

కన్యాశబ్దమువంటిదే కుమారీశబ్దముకూడాను. అమరములో కన్యా కుమారీ, అను రెండుపదములును పర్యాయములుగా వ్రాయబడెను. పర్యాయ మంటే ఒకటేయర్థముకలది. వ్యాసస్మృతిలో కానీనుని చెప్పవలసి "కుమారీ సంభవస్త్వేకః" అనుటవల్లకూడా నీరెంకు నేకార్థకములే.

పారస్కరగృహ్య. సూ. ౭. "కుమార్యాః పాణిం గృహ్ణీయాత్" అని పాణిగ్రహణము కుమారికి చెప్పినందున కుమారీకన్యాపదములు పర్యాయ పదములే 'వయసి ప్రథమే' అను పాణినిసూత్రభాష్యప్రదీపోద్ద్యోత మందు—

"కుమారీతి. పుంసాసహ అసంప్రయోగోఽస్యప్రవృత్తి నిమిత్తం,నతుప్రథమంవయః, తథావృద్ధకుమారీతిప్రయోగః."

కుమారి యనగా పురుషసంపర్కము లేనిది అని యర్థము. ప్రథమవయసు దనిమాత్ర మర్థము కాదు. మాసని దయ్యు పెళ్లికానిదానికి వృద్ధకుమారి యని గ్రంథప్రయోగము గలదు. కనుక యీపదము సంస్కారవాచకమే కాని వయోవాచకము కాదు. దీనినిబట్టి వివాహవయస్సు సంభోగార్హ కాలమే యని యూహింపవచ్చును. ఏమంటే—ఆయోగ్యత వచ్చియు సంపర్కము లేనిదని యర్థము వచ్చునుగాని యోగ్యత రాని యోనిమిదేండ్ల దాని కావిశేషణ మెందుకు? సంభోగార్హత కాశ్యపసంహితలో—

"వర్షద్వాదశకా దూర్ధ్వం న స్యాత్పుష్పం బహిర్యది,
అంతః పుష్పం భవేదేవ పనసోదుంబరాదివత్.
అతస్తత్ర ప్రకుర్వీత తత్సంగం బుద్ధిమాన్నరః."

పన్నెండేండ్లు దాటినతరువాత పైకి పుష్పవతి కాకున్నను పనసచెట్లకు బొడ్డచెట్లకువలె లోపలను పుష్ప ముండును. అపుడు సంభోగము చేయను వచ్చును అని తాత్పర్యము. దీనినిబట్టి పదమూడవయేటినుండి సంభోగార్హత కలట్టు శాస్త్రము. ఇదియే వివాహమునకు ప్రాప్తకాల మనునువచ్చును.

ఈవయసునకు తక్కువవయసును చూపు కన్యా గౌరీ ఇత్యాది పదార్థబోధకములు మఱికొన్ని గలవు. అవి ఆవయసే వివాహోర్హవయ స్సని చెప్పవా యను ఆక్షేపము కలదు. దానికి సమాధాన మీదిగువ చూపుచున్నాను.

పరాశర—

"అష్టవర్షా భవేత్కన్యా నవవర్షాతు రోహిణీ,
దశవర్షా భవే ద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా."

భవిష్యపురాణ—

"సప్తవర్షా భవే ద్గౌరీ దశవర్షాతు నగ్నికా,
ద్వాదశేతు భవేత్కన్యా అత ఊర్ధ్వం రజస్వలా."

పంచతంత్రే—

"అసంప్రాప్తరజా గౌరీ ప్రాప్తే రజసి రోహిణీ,
అభ్యంజనా భవేత్కన్యా కుచహీనా తు నగ్నికా."

కడపటి శ్లోకములు రెండును పురుషార్థచింతామణి యని బంగాళా క్షరములలో ముద్రితమైన సంస్కృతగ్రంథమున నున్నవి.

ఇవన్నియు ఋషివచనములే. వేటిని కాదనగలము ?

'అభ్యంజనా' అంటే అవయవము లన్నియు నేర్పడినది అని, 'కుచహీనా'—అంటే కుచము లెప్పటికీ రాని మాచకమ్మ కావచ్చును. లేక అప్పటికి కుచములు రాని దని యన్నా అనవచ్చును. కన్యా రోహిణీ ఇత్యాది పరిభాషలు చెప్పుశ్లోకము లెన్నో కలవు. ఆ పరిభాషలదగ్గిర ఫలములు వ్రాయ లేదు. ఇన్నింటికీ గ్రంథాంతరమందు ఫలము చెప్పబడినది.

"గౌరీం దద న్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీం దదన్,
కన్యాం దదద్ బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలామ్."

అనునది. వీటిలో పరస్పర భేద మున్నది. ప్రమాణవివేకము మూడవ సూత్రమున కుదాహరణములు కానగును. వేదబాహ్య అర్థమును కుదృష్టితో చెప్పిన వని కొండఱు సంస్కర్తలు లందురు. బాలికావివాహములు వచ్చిన తరువాతి వనికూడా కొందఱ అందురు. నాహాద మది కాదు. ఇన్నింటికీ దదన్నన్న పదమే ప్రయోగించుటను బట్టి దాన యోగ్యకాలమునే యివి బోధించును కాని వివాహయోగ్యకాల మది యని చెప్పుట కం దాధారము లేదు. కనుక యివన్నియు అప్రాప్తకాలికదానవిధు లని యంటే కా దనుటకు వీలు లేదు.

ఇందులో నొక్క చిత్రముమాత్ర మున్నది. సత్ఫలమున కేమికాని దుష్ఫలములో ఏది సత్య మని గమనించుటకూ పాలుపోలేదు. పరాశరలో పదేళ్లు దాటిన దానము నింద్యము. భవిష్యత్పురాణములో పదకొండు పన్నెండేండ్లది వివాహార్హా. నరక మెట్టిదాని దానమునకో తెలియదు. బాగా విచారించితే అష్టవర్షా అను శ్లోకము పరాశరలో నెవరో యిటీవల దూర్చి యుందురు. మాధవాచార్యులవారు వివాహప్రకరణములో నీశ్లోకము నుదాహరించి యమస్మృతిలోని దన్నారు. పరాశరవ్యాఖ్యానము చేయుచున్నప్పుడు దానిలో నీశ్లోక మున్న దని యెరుగడా? కావున నతనినాడు ఇ దందులో లేదు. అచటి గ్రంథ మిది. దశవర్షా భవేత్కన్యా అనుచోట—

"నచ దశమే ఋతుస్సంభవతి. నాయం దోషః. గౌర్యాదిశబ్దవత్ కన్యాశబ్దస్యాపి యమేన పరిభాషితత్వాత్. సాచ పరిభాషా ఫలకథనాదా వుపయుక్తా. తచ్చ పూర్వమే వోదాహృతం కన్యాం దదన్నాకపృష్ఠం-ఇతి."

యమేన అనడమేమి పరాశరేణ అని యేల ననలేదు? ఈయూహ నాది కాదు. నా పెద్దలగు విమర్శకులే యన్నారు. ఏది యెట్లయితే నేమి. దానకన్య యిది యని నామతము. వివాహకన్య యిది కాదు. మఱియు

పరాశరులవారు పదకొండు పండ్రెండు సంవత్సరముల కన్యలకు దాన మంగీకరించుచున్నారు. "ప్రాప్తే తు ద్వాదశే వర్షే యః కన్యాం న ప్రయచ్ఛతి" పన్నెండోసంవత్సరము వచ్చినతరువాత నెవడు కన్యను దానము చేయడో అనుటవల్ల పది దాటితే రజస్వల యని తానే చెప్పి దానికి దాన మెట్లంగీకరించును? కావున పరాశరుల వచనము కాదు.

ఇట్టిదే నగ్నికా యనుమాట—

"యావచ్చేలం న గృహ్ణాతి యావత్క్రీడతి పాంసుభిః,
యావద్దోషం నజానాతి తావద్భవతి నగ్నికా."

దీనిని వసిష్ఠస్మృతిలోని దని వైద్యనాథ దీక్షితులు చూపినారు. ఇట్లే,

"యావన్న లజ్జితాంగాని కన్యా పురుషసన్నిధౌ,
యోన్యాదీని నిగూహ్యేత తావద్భవతి నగ్నికా."

అనేది. సిగ్గుతో బట్టకట్టుకొనే యీడు రానటువంటి వయసుది నగ్నిక యనబడు నని దీని తాత్పర్యము. ఈ నగ్నికా పదము వివరించుట కవసర మేమంటే, వైద్యనాథుడు వశిష్ఠస్మృతిలో దని చూపిన—

"దద్యా ద్గుణవతే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే,
అపివా గుణహీనాయ నోపరుంధ్యా ద్రజస్వలామ్."

నగ్నికామేవ అనికూడా ఒకపాఠము గలదు. ఇందు నగ్నికకు దానార్హత చెప్పబడినది. కనుక నగ్నిక యంటే యెట్టిదో వివరింప నవసరము వచ్చినది. 'నగ్నికా తు శ్రేష్ఠా' అని గృహ్యసూత్రము కలదు. దానివ్యాఖ్యలో సంభోగార్హా అని యర్థము వ్రాసియున్నది. నగ్న అనగా వస్త్రము విప్పుట కర్హకాలము అని వివరించినారు. సంభోగమునకు వరుడు వస్త్రము నెట్టి

దానికి విప్ప నర్హా రాలో యని దానితాత్పర్యము. ఈయర్థము ఆపదస్వారూపమువల్లనే వచ్చును. పరిభాష వీరు వ్రాయవలసిన అవసరము లేదు. కాక 'గౌరీం దద న్నాకపృష్ఠం' ఇత్యాదిఫలములలో రోహిణి, కన్య, గౌరి, ముగ్గురికే ఫలములు చూపబడినవి. నగ్నికకు ఫలము చూపలేదు. మఱి చ్చటను ఫల మెవరును వ్రాసినట్లు కనబడదు. దాని కేమి? అమరములో ఈయర్థము నగ్నికాపదమునకు వ్రాయలేదు. ఇంతర్థముంటే వ్రాసియుండును. కావున నీశ్లోకములు దరిమిలావారు బాలికావివాహములను బలపఱచుటకు వ్రాసినవచనము లని కొందరందురు. నా కట్లన నవసరములేదు. నగ్నిక పరిభాషకూడా దానమునకే చెల్లును కాని వివాహమునకు చెల్ల దని నేను సమర్థించుచున్నాను. ఏమంటే, "దద్యాద్గుణవతే...నగ్నికాం" అని దద్యాత్పద ముపయోగించుటబట్టి. అచ్చుపడిన వశిష్ఠములోమాత్రము ఈశ్లోకము కానరాలేదు. దాని కేమి?

వైద్యనాథదీక్షితీయము, తెలుగు ౧౯౯ పుట. దద్యా...నగ్నికామేవ అని పాఠము. అందే మఱికొంతదూరమున—

"దేశకాలాదివైషమ్యా దధర్మోద్వాహసంశయే,
సదృశే సంభవే కన్యాం నగ్నికామపి దాపయేత్."

అన్నశ్లోకము కలదు. ఇందులో దేశకాలవైషమ్యములవల్ల అధర్మోద్వాహము జరిగిపోవునేమో అన్నజంకు తండ్రికి గలప్పుడు నగ్నికను గూడా దానము చేయవచ్చును. అని యర్థము కనబడుచున్నది. దీనినిబట్టి దేశకాలభయ ముండేకాలమునకే యిది సంబంధించునదనిన్నీ నగ్నికనుకూడా అని ఉటంకించుటచేత విధిలేక యివ్వవలసినకాలమే నగ్నికాకాల మనిన్నీ స్పష్టము. దీనిలో మఱొక్క కండిషను చేసినాడు—'సదృశే సంభవే' అని. కన్యకకు సమానమైనవాడు తటస్థించినప్పుడే యీయివ్వడము. దీనివల్ల తక్కువవాని కివ్వరా దని తేలుచున్నది. ఈనగ్నికనే వశిష్ఠవచనములో,

'అపివా గుణహీనాయ' అనుమాటనుబట్టి గుణహీనదాన మంగీకరించినట్టు కనబడుచున్నది. (దానికి వేరేతాత్పర్యము చూపింతును.) మనుమతములో, "నచైవైనాం ప్రయచ్ఛేత గుణహీనాయ కర్హిచిత్." ఎట్టిసందర్భములలో గాని తండ్రి కన్యను గుణహీనున కివ్వరాదు అనుటచేత నిది మనుమత మునకు వ్యతిరేకముగా నున్నందున—మన్వర్థవిపరీతాతు' అనుసూత్రప్రకారము స్మృతులలో దీనికి ఉత్తమస్థాన ముండ దనవచ్చును. మఱియు మీది శ్లోకమున అధరోర్మ్యద్వాహమును చూపినాడు. ఇది బలాత్కారముగా పిల్లలను రాక్షసవివాహధర్మమును నప్పి బలవంతులు బ్రాహ్మణవైశ్యశూద్ర కన్యలనుగూడా దీసుకొనిపోవుకాలము ననుసరించినవయియుండును. రాక్షస మొక్క క్షత్రియులకే ధర్మ్యము, ఇతరులకు అధర్మ్యము. అట్టి వీకాల మున మచ్చుకైనా లేవు. దేశచరిత్ర తెలిసినవారు ఇట్టిస్థితి ఏరాజ్యకాలమందో తెలియగలరు. మీద వివరించిన 'దద్యాద్గుణవతే' యను శ్లోకమునకు కొందరు చెప్పేయర్థము—గుణవంతు డగు బ్రహ్మచారికి నగ్నిక యగుకన్య నివ్వవలెను. గుణహీనునికైనా యివ్వవలెను. (నగ్నికనే) రజస్వలను ఉప రోధింపరాదు = ఇవ్వరాదు. అని అంటారు. ఉపరోధించుట యనగా నిచ్చుట యను నర్థము అసలు సంస్కృతభాషలోనే లేదు. అది తప్పర్థము.

కాళిదాసు శాకుంతలలో దుష్యంత సైనికులు కణ్వాశ్రమములోకి రాకూడదు అనుటకు హేతువుగా "తపోవనోపరోధో మాభూత్" తపోవనమునకు ఇబ్బంది కాకూడదు. అనే అర్థములోనే ప్రయోగించినాడు. కావున నిచ్చుటకూడా రజస్వల యయిన కన్యను ఇబ్బంది పెట్టవద్దు అని యర్థమే. ఇందు మఱొక విశేషము. మీదను మూడు వాక్యములుగా దద్యాత్తనుమాట రెండు పర్యాయము లన్వయించి చెప్పినారు. నేను రెండే వాక్యములు చేతును. బ్రహ్మచారికి గుణవంతునకు నగ్నిక నివ్వవలెను. గుణహీను నకైనా రజస్వలకన్యను అడ్డవద్దు. ఉపరోధ మంటే ఆటంకము గూడాను. అనగా సంబంధార్హ కుటుంబములలోనే గుణవంతులు అడుగరానప్పుడు గుణ

హీనులే యడుగవచ్చుచున్నపుడు పిల్ల రజస్వల అయియుండి, ఆ గుణహీను లనే తాను పెండ్లాడుటకు కాతురతపడుచున్నపుడు ఆమెను తండ్రి గుణ హీనుని పెండ్లాడవద్దని ఆటంకపెట్టరాదు. తాను మాత్రము కోరి గుణ హీనున కివ్వరాదు అనియే. అనగా తండ్రి ఉత్కృష్టుల కిచ్చునపుడు వయసుతోను పిల్ల కోరికతోను అవసరము లేదు. గుణహీనుల కివ్వవలసి వచ్చునపుడు పిల్ల యౌవనకాలమందే ఆమె అంగీకారము ననుసరించి మఱీ చేయునది అని తాత్పర్య.

గుణహీనాయాపినా రజస్వలాం నోపరుంధ్యాత్తని ఒకటేవాక్యము. ప్రమాణవివేకము ౧౧ పదోకండోసూత్రము గమనించుడు. ఫలములను చెప్పిన మీద వచనము లన్నియు అర్థవాదములు. స్తుతించినా నిజముగా నది స్తుతి కాదు. నిందించినా అది నిజముగా నింద గాదు. అవన్నీ అర్థ వాదములు.

కన్యాదానమునకు ఫలము చెప్పు శ్లోకములలో బ్రహ్మలోకాదులు చెప్పబడినవి. ఆ పనియందు శ్రద్ధగల్గుటకు అట్లు గ్రంథములలో చెప్పుదురు కాని అవి నిజముగా ఫలములుగావు. నిందలుకూడా కావు. తదితరములు శ్రేష్ఠము లని చెప్పుటకే కాని, నిందించబడినవి నింద్యకర్మలని చెప్పుటకును గాదు. ఇందుకు ప్రమాణము—"ద్రవ్య, సంస్కార కర్మసు ఫలశ్రుతి రర్థవాదః"—కన్యాదానము కన్యకు సంస్కారకార్యము. అది వివాహ సాధనము. అది లేనిదీ వివాహము సాధ్యపడదు. కావున దానమునకు వివాహసిద్ధియే ఫలము. మఱి వేరేఫల మెట్లుండును? పాలకొమ్మలతో వేసినా కొబ్బరి కమ్మలతో వేసినా పందిరి పెండ్లిచేయుటకే ఉపయోగించును. అయితే శ్రేష్ఠము, అశ్రేష్ఠము అని మాపుటకే పందిరి వేయనిదీ పెండ్లి చేయరు. అట్లే దానము లేనిదీ వివాహము సిద్ధించదు.

కావున పెండ్లికి యేఫలమో దానమున కదే ఫలము. ఇందుకు మీమాంసలో "ఖాదిరం వీర్యకామస్య" అనునది కలదు. యజ్ఞసాధనము

యూప స్తంభము. పశువును దానికే కట్టి మంత్రించవలెను. కావున నది లేనిదీ యజ్ఞము సిద్ధించదు. కనుక యజ్ఞఫలమే యూపమునకు గూడా ఫలము. అయితే ఆ యూపము చంద్రకఱ్ఱతో చేసిన దైతే యజమానునకు వీర్యవృద్ధిని చేయు నని స్తుతి కలదు. దీనిని సంస్కారము కనుక అర్థవాద ఫల మన్నారు. ధర్మశాస్త్రచర్చ మీమాంసమీద నాధారపడియున్నది. అట్లే ఈవయసుకన్య యయితే యీఫల మని దానమును స్తుతించినా నిందించినా అవి ఫలములే కావు. ఇదే శాస్త్రతత్త్వము. వివాహఫలము ధర్మప్రజాసంపత్తి యుండగా అందులో వేరువేరు కర్మలకు వేరువేరు ఫలము లుండవు.

ఒక ప్రధానకర్మలో అంగముల కెప్పుడును వేరుఫలము లుండవు. కావున సాధ్య మయినంతవరకు ఋతుపూర్వమే దానము చేయుట మంచి దని యీఫలములవల్ల దెలియదగును.

మఱొక్కసంగతి చూడండి. విధిగా నీపని చేయకతీరదు అంటేనే ఆపని జరిగితీరుతుంది. అదికాక యీపని చేసితే యీఫలమువచ్చును అంటే ఆఫలము కావలెనంటే ఆపని చేయవచ్చును, లేకుంటే మానవచ్చును. ఆ బ్రహ్మలోకాదిఫలములు మా కక్కరలేదు అనేతండ్రి యేవయసులోనైనా దానము చేయవచ్చునుకదా! దీనిమీద నింకొక ప్రశ్న. సత్ఫలముల కిదిగాని రజస్వలాదానమునకు నరకము చెప్పినారుకదా! అట్టిదానమునకు నరకము తప్పదుగదా! అందు రేమో? తండ్రి 'నరకములో పడితే పడుదునుగాక, నాపిల్లకు వయసు వచ్చినతరువాతనైనా మంచివరుని చూచి యిస్తాను. నాపిల్ల సుఖించుటే నాసుఖము. నాపిల్లకు కన్నులు విడని దశలో నాస్వర్గమునకు నేను పెండ్లిచేసి ఆమెయిష్టమునకు రానివరుడే ఒకనేళ వయసువచ్చేసరికి అగునేమో, యెవరు చెప్పగలరు? అన్నీ చూచుకొనే చేస్తా' నని యన్నవాని నెవరు కాదనగలరు? అర్థవాద లట్లు ఆటంక పెట్టవు. నిషేధవచన ముంటే ఆటంకపెట్టును. 'న రజస్వలాం దద్యాత్' రజస్వలను దానము చేయరాదు. అనుమాట శాస్త్రములో లేదు. మహా

టికి లేదు. ఇంకొక్క రహస్యమును బయలుపఱచి యీవిషయము ముగింతును. గోభిలగృహ్యకారికలో — ౬౨ పుట. నాగరి.

"నగ్నికాంతు వదేత్కన్యాం యావన్నర్తుమతీ భవేత్,
ఋతుమతీ త్వనగ్నికా తాం ప్రయచ్ఛేత్త్వనగ్నికాం."

అని కారిక — ఋతుమతి కానంతవరకు కన్య నగ్నిక యనబడును. ఋతుమతి యయితే అనగ్నిక. దానినిగూడా దానము చేయవచ్చును. వ్యాఖ్యలో 'తు' అనుదానికి 'అపి' యనునర్థము వ్రాసిరి. ఇందు రజస్వల అయిన తరువాతకూడా దాన మంగీకరించినాడు. దోషము చెప్పలేదు. సూత్రకారుడు నగ్నిక శ్రేష్ఠము దానమునకు అన్నాడు. దీనినిబట్టి ఋతుమతీ దానము ప్రశస్తము కాదని తాత్పర్యము వచ్చును గాని నిషిద్ధము కానేరదు. అందుకే సర్వత్రా నింద లున్నవి గాని ఋతుమతీదానానికి నిషేధము 'న ఋతుమతీం దద్యా' త్తని యెచ్చటను లేదు.

ఋతుమతీదానమునకు ప్రాయశ్చిత్త మున్నది. నిర్ణయసింధు.

ఆశ్వలాయనవచనము—

"పితా ఋతూన్ స్వపుత్ర్యాస్తు గణయేదాదిత స్సుధీః,
.........కూశ్మాండైః జుహుయా ద్ద్విజః."

ఎన్ని ఋతువులు వివాహకాలానకు గతించినవో లెక్కించి అన్ని గోదానములు తండ్రి కన్యాదానకాలమందు చేయవలెను. ఋతు వంటే ఒక సంతానమును కనుకాలము. అనగా ౯+3 నెలలకు తక్కువ కానేరదు. కనక సంవత్సరమున కొక్కొక్కగో వని తాత్పర్యము. ఆశ్వలాయన స్మృతిలో నీశ్లోకము కానగాలేదు. లేకుంటే నేమి? దీనివల్ల ఋతుమతికి దానషేధ లేదు. ఏట్లోనో సముద్రంలోనో పిల్లను త్రోసివేయవలెను. తల్లిదండ్రులుకూడా సముద్రంలో పడిపోవలయు నన్నంతటియుపద్రవము కానరాదు. వేళకు సంధ్యావందనము చేయులేక కాలాతిక్రమణప్రాయశ్చిత్త

ముగా ప్రతిపూటా నాలుగో అర్ఘ్యప్రదానము చేయనిదిన మే లేనివారలకు ప్రాయశ్చిత్తమునకు జంకేల ?

నిజముగా ఋత్వనంతరము మూడేండ్లవరకూ ప్రాయశ్చిత్తముగూడా లేనేలేదు. ఎట్లన ?—మను, బోధాయన, విష్ణు స్మృతులలో — 'త్రీణి వర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనమ్' అని పితృశాసనమును ప్రతీక్షించుట ఎందుకు ? దానము చేయునేమో యనియే. కనుక మూడేండ్లవరకూ తండ్రికి దానాధికార మున్నట్లే. అయితే ప్రాయశ్చిత్తం చేసుకొనియూ చేసుకొనకయేనా దాన మన్న సందేహము తీరదు. అది యీ ముందు విచారణతో తీరిపోవును. బోధాయనుడు—

"త్రీణి వర్షాణ్యృతుమతీం యః కన్యాం న ప్రయచ్ఛతి,
స తుల్యం భ్రూణహత్యాయా దోషమాప్నోతి..."

దీని యర్థము మూడేళ్లు పూర్తిగా కన్యను దానము చేయకుండా ఉంచి వేస్తే తండ్రికి భ్రూణహత్య చేసినదోషము వచ్చును. ఇచట 'వర్షాణి' అని ద్వితీయావిభక్తి యున్నందున సంస్కృత వ్యాకరణసూత్రము 'అత్యంత సంయోగేచ' అనుదానిని బట్టి ఆపని ఆకాలమంతయు పూర్తిగా జరిగి నపుడే ద్వితీయ వచ్చును. కావున పదకొండు నెలల యాభైతొమ్మిది గడియలు మానినను ఆయరవై మోగడియలో కన్యాదానము జరిగితే ప్రాయశ్చిత్తము లేదు. నాల్గవసంవత్సరము మొదలు ప్రాయశ్చిత్త మునసరము. ఈ సందర్భమునందు వశిష్ఠస్మృతిలో 'తుల్యైః సకామా మభియాచ్యమానాం" అను విశేషణము కన్య అనుదానికి గలదు. సకామాం = పెండ్లి కావలె నని కోరుచున్నది అని యర్థము. తుల్యైః అభియాచ్యమానాం = సమానులచేత వరించబడుచున్నది. అనగా అడుగవచ్చుచున్నా రని—

ఈ రెండు విశేషణములును ఏమి బోధించునంటే సమాను లడుగ గా నపుడుగాని, అడుగ వచ్చుచున్నా కన్యకు పెండ్లియాచ నిచ్ఛ లేకున్నను, ఆ చెప్పిన భ్రూణహత్యాదోషముకూడా లేదని తాత్పర్యము.

ఈ విషయము చదువరులు చాలా శ్రద్ధతో గమనించవలెను. చాలా ముఖ్యము.

ఇచట ప్రమాణవివేకము - ఆరవసూత్రము గమనించవలెను. ఋతుమతీదానమును నిందించినవచనము లన్నియు నీశ్లోకముతో నేకవాక్యముగా జేసితే వాటియన్నిటికినిగూడా నీతాత్పర్యమే చెప్పకతీరదు. మఱియు నైదవసూత్రమునుబట్టి యితరవచనములకు బాధకము రానంతదూరము వాక్యార్థము తేల్చితే అప్రమాణము కానేరదు. ఇంకను పదియవసూత్రములో జెప్పినట్లు శుద్ధమయినధర్మము ఇట్లు తర్కముద్వారానే కనుగొనవలెను. కనుక కన్యాదానవిషయకశ్లోకము లన్నీ యొకచోట చేర్చి వాటిమీద అనుమానప్రమాణముద్వారా (తర్కముతో) వాక్యార్థము తేల్చవలసియున్నది. అట్లు చేయుటయే శాస్త్రీయము. తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అన్నవిధముగా తాత్పర్యము చెప్పరాదు.

ఈ నానావాక్యార్థకల్పనకు ప్రమాణముగా, జైమినిగృహ్యసూత్రము—

"స్నాత్వా మాతాపితరౌ పరిచరేత్. తాభ్యామను జ్ఞాతః జాయాం విందేతానగ్నికామ్."

స్నాతకము చేసుకొన్నతరువాత తలిదండ్రులను సేవించవలెను. వారిసెలవును బొంది అనగ్నిక యయినదానిని భార్యగా పొందవలెను. వ్యాఖ్యానముతో నాగరిలో నచ్చుపడినది. ఇది సామశాఖివారి గృహ్యము. అయితే గోభిలుని నగ్నిక శ్రేష్ఠురా లన్నాడుగదా యందురేమో! దానివ్యాఖ్యలో, "నగ్నికా వస్త్రవిక్షేపణార్హా మైథునార్హేత్యర్థః" అని వివరించినాడు. రజస్వల యయేయీడులోనుండి మైథునార్హత కలదియని దానితాత్పర్యము. వివాహము నక్షత్రదర్శనాంతము చేసుకొని ఋతు వయేవరకూ బ్రహ్మచర్యము చేయుచు ఋతువు రాగానే చతుర్థి చేసుకొనుట యాతనిమతము. అది ప్రశస్తమే యగును. రజస్వల అగుటకు దూరదూరకాలములకంటె ముందును వెనుకను గూడా సమీపకాలము వివాహమునకు ప్రశస్తము అని తాత్పర్యము. ఈవిషయము సమావేశనవాదమున నింకను స్పష్టపడగలదు.

ఇది కన్యాశబ్దవిమర్శ ప్రపంచము పంచమభాగము.

# వివాహతత్త్వము

## షష్ఠభాగము

---

### కన్యాదానవివేకము

అన్ని దానములందునువలెనే కన్యాదానమునందుగూడా దానశబ్దము గలదు. కాని యితరస్థలముల దానశబ్దమునకును దీనికిని చాలా వ్యత్యాసము గలదు. దానము అనుమాట కివ్వడమే అర్థము. ఉభయత్రా సమానమే. ఇచ్చుటలో ననేకభేదములు కలవు. భూమి సాగు చేయుటకు రైతు కిచ్చుట, పొరుగువాని కప్పు ఇచ్చుట, ఇల్లు అద్దె కిచ్చుట, ఉపన్యాస మిచ్చుట—ఇవన్నియు ఇచ్చుటలోనే చేరును. ఒకటే తాత్పర్యము వీటికి రాదు, భేద మున్నది. అది చదువరులకు తెల్లమే. ఉదకపూర్వకముగా పుణ్యము సంపాదించుట కివ్వడముకూడా ఇవ్వడమేను.

ధర్మసింధు—దానమంటే "స్వస్వత్వనివృత్తిపూర్వక పరస్వత్వాపాదనం" అని లక్షణము వ్రాసెను=తన కావస్తువుమీద నున్నహక్కును వదలుకొని యెదుటివాని కాహక్కు నిచ్చుట యని యర్థము. గోదానాదులయం దీయర్థము సరిపడును. ఈలక్షణము విద్యాదానమందు కుదురుతుందా? తనకు వచ్చినగ్రంథ మింకొకరికి చెప్పితే మఱి తాను తరువాత నది ఉచ్చరించుటకూ ఉపయోగించుటకూ చెల్లదా? కావున నిది యన్ని చోట్లను చెల్లదు. అట్లే కన్యాదానమందుకూడాను. ఏలన? గోవును భూమిని దానంపట్టి వాడు ఆగోవునుగాని ఆభూమినిగాని తా ననుభవించవచ్చు, లేదా మఱొకని కిచ్చివేయవచ్చు, అమ్మకోవచ్చు. ఇచ్చినవాని కేమీ మాట్లాడుటకు హక్కు లేదు. తుదకు ఆవుపేడకూడా వాని సెలవు లేనిదీ తీయ జెల్లదుగదా! అట్లు కన్యాదానము పట్టినవాడు ఆకన్య నింకొకరికి

దానము చేయవచ్చునా ? అమ్మివేయవచ్చునా ? అట్లు చెల్లదు. సరే! ఆమె కడుపున పుట్టినబిడ్డకు తాతగారికి పిండోదకము లిచ్చుసంబంధ మెప్పటికీ కలదు. తాత మనుమని జన్మకాలమున జాతాశౌచము (పురుడు) పట్టవలెను. దానానన్తరము అవుమాడతో దాత కేమయినా ప్రసక్తి యున్నదా? లేదు. అదట్లుండనిండు. అల్లునకు మామగారు కన్య నిచ్చినపుడు ఏమిహక్కు ఇచ్చినాడు? కర్మలలో సహాయురాలుగా నుండుటకును, బిడ్డలను కను టకునుగదా! అట్టిహక్కు దాన మివ్వకముందు తండ్రి కున్నదా? లేదుగాదా! తండ్రి కుండవలసిన సారె చీరె మొదలగు సత్కారముచేయు హక్కులు దానమునకు ముందును తరువాతనుగూడా కలవు. తండ్రికూతుల సంబంధము పుట్టినది మొదలు చచ్చేవరకును చచ్చినతరువాతకూడాను ఉండనే యుండును. కావున మామగారు తనకున్నహక్కు అల్లున కివ్వలేదు. అల్లున కిచ్చినహక్కు తన కదివరకు లేనేలేదు. కావున కన్యాదానము దానమే కానేరదు. అట్టిదానికి స్వర్గాదిఫలములు ఇతరదానములకువలె ముడిపెట్టుట స్తుతిమాత్రమే. ఆపనిమీద తండ్రికి శ్రద్ధ కలుగుటకుగా నట్లు చెప్పుట. మనము ఋషులదృష్టిలో మనపిల్లలు మనదృష్టిలో నెట్లుందురో యట్లే యుందుము. ఆపనియందు వారికి శ్రద్ధ కలిగించుటకు ఇదొక పద్ధతిగా అర్థ వాదములతో వేదశాస్త్రములు వ్రాసియున్నారు. ఈసంగతి విమర్శకుల కెఱుక. అదెట్లుండనిండు. ప్రకృతమున దాన మనునది యొకవివాహ ధర్మము, వివాహసాధనము. దానము లేకుంటే బ్రాహ్మాది నాలుగువివాహ ములూ సిద్ధింపవు. దానవివాహములోనే కన్యకు పితృగోత్రనివృత్తి కలదు. గాంధర్వాదులలో కన్యకు పితృగోత్రనివృత్తి యుండదు. భర్తృగోత్రము తండ్రిగోత్రము రెండును గలవు. ఈవిషయము గోత్రచర్చలో స్పష్టపడ గలదు. మనుస్మృతివ్యాఖ్యలో మేధాతిథి—

"నేయం గవాదిద్రవ్యవ ద్వ్యథేష్టవినియోజ్యతయా, అపితు జాయాత్వేన విశిష్ట ఏవహి స్వస్వామిభావో జాయా పతిలక్షణః సంబంధః"

అని వ్రాసినాడు. గోవునువలె కన్యను దానము పట్టినతరువాత నిష్టానుసారము ఉపయోగించరాదు. భార్యగానే ఉపయోగించవలెనని తాత్పర్యము. ఆపస్తంబధర్మసూత్రభాష్యమున వివాహములోని క్రయశబ్ద దానశబ్దములు సరియైన క్రయమును దానమును చెప్పనేరవు. సంస్తుతిమాత్రం ద్రవ్యప్రదానసామర్థ్యాత్......ధర్మార్ధి సంబంధః=కూతురుతో తండ్రికి ధర్మముద్వారా కలిగినసంబంధ మగుటచేత వివాహధర్మములో చెప్పిన క్రయదానములవల్ల సంబంధము. ఇతరవస్తువులక్రయదానాదులలో దాతృక్రేతలకును క్రేతృదత్తవస్తువులకువలె తెగిపోనేరదు. మరేమంటే అట్లు చెప్పుట వస్తువు నొకరి కిచ్చుచున్నందువల్ల వచ్చినది. అది క్రయమూ కాదు దానమూ కాదు, సంస్తుతిమాత్రమే. అట్లే, మను. అ. ౯ శ్లో. ౪౭ వ్యాఖ్యలో మేధాతిథి,

“గవాదయో హి యేనైన రూపేణ ఆత్మనః స్వం తేనైవ అన్యస్యై ఆపద్యంతే. కన్యాతు దుహితృత్వేన స్వం సతీ భార్యాత్వేన అనివృత్తసంబంధా దీయతే...”

అని. గోవులు మొదలగువస్తువులు ఏవిధముగా తనసొత్తో ఆవిధముగానే యితరులకు హక్కు చేయబడును. కన్య యయితే కూతురుగా తనహక్కు ఉంటూనే భార్యగా మఱియొకనికి తనసంబంధము వదలుకోకుండగనే యివ్వబడుచున్నది - అని దానితాత్పర్యము. ఇట్టి కన్యాదానమునకు ప్రధాన కర్మయగు వివాహసిద్ధియే ఫలము. అనగా పితృగోత్రనివృత్తి అనును కాని మధ్యను స్వర్గాదిఫలము నిజముగా ఫలము కాదు. “ద్రవ్యసంస్కారకర్మసు మధ్యే ఫలశ్రుతి రర్థవాదః” అని మీమాంసాసూత్రప్రకారము అర్థవాద ఫలమే అగును.

ఇది కన్యాదానశబ్దవివేకము - షష్ఠభాగము.

# వివాహతత్త్వము

## సప్తమ భాగము

---

ఇక అష్టవిధవివాహవివేకము

" చతుర్ణా మపి వర్ణానాం ప్రేత్యచేహ హితాహితాన్,
అష్టా వివమా న్సమాసేన స్త్రీవివాహా న్నిబోధత. "

మనువు—అ. ౩ శ్లో. ౨౦—

నాలుగువర్ణములవారికిని ఇహలోకపరలోకములలో మేలుకీడుల గలిగించునట్టి స్త్రీవివాహముల నెనిమిదింటిని తెలిసికొనుడు.

" అష్టౌ వివాహా నారీణాం సంస్కారాయ ప్రచోదితాః. "

బృహత్పరాశర—నాగరి. అ. ౪ పుట. ౧౧౭—

ఎనిమిది వివాహములు స్త్రీ సంస్కారములుగా విధింపబడినవి.

౧. బ్రాహ్మవివాహము. శంఖుడు. అ ౪.—

" అప్రార్థితప్రయత్నేన బ్రాహ్మణః " ఎదుటివారడుగరాకుండనే తానే ప్రయత్నించి కన్య నిచ్చుట బ్రాహ్మము.

" ఆచ్ఛాద్య చార్చయిత్వాచ శ్రుతశీలవతే స్వయమ్,
ఆహూయ దానంకన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః"

మనువు—అ. 3 శ్లో. ౨౧

కన్యను వస్త్రాలంకారములతో పూజించి తగినవరునకు స్వయంగా (అడుగరాకముందే) యిచ్చుట బ్రాహ్మవివాహము.

"బ్రాహ్మో వివాహ ఆహూయ దీయతే శక్త్యలంకృతా"

యాజ్ఞవల్క్య.

యథాశక్తిగా కన్య నలంకరించి వరుని పిలిచి పిల్ల నిచ్చుట బ్రాహ్మ వివాహము. అది వివాహధర్మము.

"ఆహూయ గుణవతే కన్యాదానం బ్రాహ్మః."

విష్ణుస్మృతి. అ. ౨౪ పుట. ౧౦౯—

"బ్రాహ్మో విద్యాచారిత్రబంధుసంపన్నాయ దద్యా దాచ్ఛాద్యాలంకృతామ్."

గౌతమ. అ. ౪

అర్థము సులభము. ఇట్లిందఱు వేరువేరు పదములతో జెప్పినను అర్థము కొంతకొంత వేరైనను వరపక్షమువారు అడుగరాకుండనే దాత స్వయంగా పిలిచి పిల్ల నిచ్చుట యనునది బ్రాహ్మవివాహమునకు లక్షణము. వరణము తే దనుకొనవద్దు. పిలిచి వారిచేత వరణము చేయించుకొనును. అట్లన కుంటే నారదుడు చెప్పిన వరణ, పాణిగ్రహణ, సంబంధరూపమయిన త్రిలక్షణత్వము వివాహలక్షణము అనునది కాకపోవును. "ప్రసుగ్మంతాధి యసా" అను మంత్రములతో నలుగురు బ్రాహ్మణులను మంత్రించి పిల్లను తనకొఱకు అడగవెళ్లు మని పంపుటమాత్రము బ్రాహ్మదైవవివాహములలో నుండ దని సుదర్శనభాష్యమున గలదు.

౨. ఇక దైవవివాహము, మనువు —

"యజ్ఞేతు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే,
అలంకృత్య సుతాదానం దైవం ధర్మమ్..."

యజ్ఞము చేయించుచున్నప్పుడు ఆ ఋత్విక్కునకు కన్య నలంక రించి దానము చేయుట దైవధర్మము. వరలక్షణములు కలవానినిగా మొదట గుర్తించి ఋత్విక్కుగా దీసుకొని యజ్ఞదక్షిణాకాలమున ఆదక్షిణతో కన్య నిచ్చుట యని వివరము. ఇం దొక్కవిశేషము గ్రహింపవలసియున్నది. కన్యాదాన మెప్పుడును బ్రహ్మచర్య వ్రతము జరుపుచున్నవానికి చేయరాదు. అది నిర్వివాదాంశమే. స్నాతకము చేసుకొని యున్నవానికే. స్నాతకమునకు వివాహమునకు మధ్యను యజ్ఞము చేయించుట గలదు. దీనినిబట్టి యాలో చించగా స్నాతక మైన ఉత్తరక్షణమందే వివాహము కాకతీరదు. 'అనా శ్రమీ న తిష్ఠేత' అన్ననిషేధ మున్నందున స్నాతకుడు బ్రహ్మచారియు గాడు, వివాహము కానందున గృహస్థునూ కాడు కనుక అనాశ్రమి యనం బడును అనగా నాలుగాశ్రమములలో నేయాశ్రమమునాడును కాడు, అట్లు అనాశ్రమిగా నుండరాదు అని యొకవాదము కొందఱు చూపుచున్నారు. అదంతా తప్పు అని గ్రహింపనగును. ఏమంటే స్నాతకుడుకూడా గృహస్థే. ముందుముందు తేటపడగలదు. 'అనాశ్రమీ న తిష్ఠేత' అనుదానికి వేరు విషయము గలదు. అది స్నాతకచర్చలో దెలియగలదు. మస్కరిభాష్యంలో మూడేళ్లు స్నాతకవివాహములకు వ్యవధాన ముండవచ్చు నన్నాడు.

3. ఆర్ష వివాహము, మనువు —

"ఏకం గోమిథునం ద్వే వా వరా దాదాయ ధర్మతః,
కన్యాప్రదానం విధివ దార్షో ధర్మః..."

వరునివద్ద నొక్కజత గోవులు కాని రెండుజతల గోవులుకాని (జత యంటే ఒకటి ఆడది ఒకటి మగది) పుచ్చుకొని కన్య నిచ్చుట ఆర్షధర్మము. దీనికి క్రయమునకుగల దోషము లేదు. క్రయము సంభవాసంభవముల వల్ల నొకపుడు హెచ్చు తగ్గు అగుచుండును. ఇదట్లు కాక ఇంతయే యని స్థిరము. కావున క్రయము కా దని వ్యాఖ్యానించిరి. అదియు నొకవివాహ

ధర్మము. అట్లయినగాని ఆర్షత్వము రాదు. ఇది కన్యను వరపక్షమువారడుగవచ్చినతరువాతనే జరుగును.

౪. ప్రాజాపత్యవివాహము, మనువు—

“సహోభౌ చరతాం ధర్మ మితి వాచానుభాష్య చ,
కన్యాప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యః...”

మీ రిద్దఱును ధర్మమును ఆచరించుడు అని చెప్పి కన్య నిచ్చుట ప్రాజాపత్యము.

“ఇత్యుక్త్వా చరతాం ధర్మ మితి సహాయా దీయతేఽర్థినే”

యాజ్ఞవల్క్య.

కన్యను వరు డడుగవచ్చినపైని నీవు ఈమెను ధర్మపత్నిగా నుంచుకొనవలె నని చెప్పి మఱి దానము చేయుట అని తాత్పర్యము. అన్నివివాహములకంటె నీవివాహమందు కన్యకు క్షేమ మధికము. ఏమనగా—మితాక్షరలో “అంతా దనయా సహ ధర్మ శ్చరితవ్యః, నాశ్రమాంతరం ప్రవేష్టవ్యం, నాపి స్త్ర్యంతరం ఇతి మంత్రేణ సమయః క్రియతే.” ఈవిషయము వైద్యనాథదీక్షితీయమునగూడ గలదు. దానియర్థము—ఈపిల్లతోనే నీజీవితాంతము ధర్మాచరణము చేయవలెను. సన్యసించరాదు. మఱొకతెను పెండ్లాడరాదు అని వరునిచేత మంత్రవతుగా కరారుచేయించుకొని మఱి యిచ్చును. తక్కినవాటిలో నీనియమము లేదు. సన్యసింపవచ్చును. మఱొకతెను పెండ్లాడవచ్చును. ధర్మపత్నిగా కాక కేవల సంతానమునకే కామ్యపత్నిగా వాడుకొనవచ్చును. కావున మిగిలినవి ఆడుదాని కంత క్షేమాధాయకములు కానేరవు. కనుకనే యన్నియు నశించియీవివాహమే సర్వత్రా లోకమున స్థిరమైనది. ఇపుడు చేయుచున్న వివాహములన్నియు ప్రాజాపత్యవివాహములే. ఏ మందురా ? కన్యావరణ లిచ్చి శాస్త్రో

ణులను కన్యనడుగ మని పంపించుపని అన్ని పెళ్లిళ్లలోను మనము చూచు చునేయున్నాము. మఱియు 'ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరితవ్యా' అని వరునిచేత కరారుకూడా చేయించుచున్నారు. 'మదర్థం కన్యాం వృణీధ్వం' అన్నమాట పురోహితు లంటున్నారా లేదా పెళ్లికాలమందు కనుక్కొనండి. అది వరు డనవలసినమాట. దాని కేమి? అన్నిమాటలూనూ పురోహితులే చెప్పుదురు.

౫. ఆసురవివాహము, మనువు.—

'ఆసురో ద్రవిణాదానాత్' గౌతముడు 'విత్తేనానతి స్త్రీణాం = డబ్బు ఇచ్చి కన్యను కొనుక్కొనుట ఆసురధర్మము. ధర్మశాస్త్రకారు లందఱును ఇట్లే చెప్పిరి—క్రయము అంత మంచిదికాదు. 'క్రయక్రీతా తు యా నారీ న సా పత్న్యభిధీయతే' క్రయముతో ఆడిన పెండ్లి భార్య కావచ్చు పత్నియై యుండవలెను గాని ధర్మపత్ని యయియుండరాదట. అనగా ధర్మపత్ని వేరుగా నుండి సంతానము లేకుంటే మరొకదానిని పెండ్లాడ వచ్చును. అట్టిసందర్భములో క్రయోపయోగము. సంతానమునకుమాత్ర మే నిషమైన దోషమును లేదు. పత్నీశబ్దము యజ్ఞసంబంధమునందే వచ్చును. అందుచేత నామె భార్యయే యగును గాని పత్ని గాదు. అంతమాత్రము చేత క్రయము వివాహధర్మము కాకపోదు.

౬. గాంధర్వవివాహము, మనువు.—

"ఇచ్ఛయాఽన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ,
గాంధర్వ స్సతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః"

కన్యావరు లిద్దఱును పెద్దలయనుమతి లేకయే ఒకరి నొకరు కామించి సంభోగింతురు. అది గాంధర్వము.

"ద్వయో ర్మాతాపిత్రురహితో యోగః గాంధర్వః"
విష్ణుస్మృతి—

అర్థము పూర్వవతుగానే. ఇచ్చోట కుల్లూకభట్టు—'సర్వవివాహానాం మైథునత్వే య దస్య మైథునత్వాభిధానం తత్సత్యపి మైథునే న విరోధ ఇతి ప్రదర్శనార్థం' = అన్నివివాహములున్ను మైథునరూపములే కదా! ఈగాంధర్వమే మైథునస్య మన నేల? యని శంకించి, అట్లయినను వివాహమునకు ముందు ఆవధూవరులకు మైథునము జరిగినను దోషము లేదని తాత్పర్య మని.

ఇట్లు సంభోగించినను అంతతో వివాహసిద్ధి లేదు. పాణిగ్రహణాది సమావేశనాన్తము అయితీరవలె లేకుంటే భార్య కానేరదు. భర్తృగోత్రము రాదు. ఆసంతానము దుష్టమున్ను అగును.

బోధాయనుడు—'గాంధర్వ మప్యేకే ప్రశంసన్తి సర్వేషాం స్నేహానుగతత్వాత్' స్నేహము కలిగియుండుటచేత నన్నింటిలోను గాంధర్వము శ్రేష్ఠ మని కొందరు అందురు. గాంధర్వాది నాల్గింటిలో హోమాదికము తరువాత జరుగవలె నన్నందుకు ప్రమాణము.

"గాంధర్వాసురపైశాచా వివాహా రాక్షసశ్చ యః,
పూర్వం పరిశ్రయ స్తేషాం పశ్చాద్ధోమో విధేయతే"
మాధవీయస్మృతి వచనము—

పరిశ్రయ మంటే పానుపు. అందుకు సంబంధించిన సంభోగ మనియే తాత్పర్యము. పరిగ్రహః అని, పరిణయః, అనిన్నీ పాఠములు కలవు. కాని అవి సరిపడవు. ఏమంటే పరిణయ మంటే వివాహము. వివాహము ముందేమిటి? హోమము తరువాత నేమిటి? పరిగ్రహ మంటే చేపట్టుట. అదీ వివాహార్థమే. అదికాక పాణిగ్రహణమంటే బ్రాహ్మాదులలోగూడా ముందు పరిగ్రహమే తరువాతనే హోమము. కావున పరిశ్రయమే సాధువు. ఈ విచారము సమావేశనవాదమున నింకను తేటపడంగలదు. అచట పరిశ్రిత్య అనుమాటకు పాన్పుపరచి యని యర్థము చెప్పకతీరు. ఆధాతువునుండి పుట్టినదే యీపరిశ్రయపదము.

౩. రాక్షసవివాహము, మనువు.—

"హత్వా ఛిత్త్వా చ భిత్త్వాచ క్రోశంతీం రుదతీం గృహాత్,
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధి రీరితః."

"యుద్ధే హృత్వా బలా త్కన్యాం యత్రాస్థిత్యాప ఇత్యృచా, ఉహ్యాంతు సతు విద్వద్భి ర్వివాహో రాక్షసః స్మృతః."

బృహత్పరాశర—

కన్యాబంధువులతో యుద్ధము చేసి కన్యను బలాత్కారముగా దెచ్చుట రాక్షసవివాహము. 'యత్రాస్థిత్యాప' అను మంత్రముతో కన్యను తీసుకొని రావలయును.

ఇచట నొకవిశేషము - మనవచనములో చంపి చీల్చి తేవలసినట్లు పైవచనమున గలదు. ఆపని అడ్డుపెట్టిన బంధువులవిషయము. మఱియు నిందు కన్యకు ఇష్టము లేకుంటేగూడా తేవలసినదే అని యూహించరాదు. క్షత్రియకన్య వీరపత్ని కావలె నని కోరిక కల దయేయుండును. అయినను అట్లు తీసుకొనివెళ్లినవానియందు తన కిష్టము లేనపుడు వివాహము చేయరాదు. ఏ మంటే,

"కన్యాయాశ్చ వరస్యాపి యత్రోభయో ర్భవే ద్ధృతిః,
తథా కన్యాం వరో ధీమాన్ వరయే ద్వంశశుద్ధయే"

బృహత్పరాశరలో—అ. ౪ పుట ౧౧౯ నాగరి, కలకత్తా.

కన్యావరులకు అన్యోన్యము కోరిక ఉభయులకు నుండవలెను, అట్లుగా వరుడు బుద్ధిమంతుడై వరించితే వంశము శుద్ధమయిన దగును.

'స్త్రియశ్చ పురుషస్యాపి యత్రోభయోర్భవే ద్వృతిః,
తత్ర ధర్మార్థకామా స్స్యుస్తదధీనా యత స్త్వమీ.'

ఒకరియం దొకరికిష్టము కలిగి యుభయులును వరించుకొన్నప్పుడే ధర్మార్థకామములు సిద్ధించును. వేదమందుకూడా,

"వధూ రియం పతి మిచ్ఛన్త్యేతి" ఋగ్వేదము,
"యువం బ్రహ్మణే అనుమన్యమానే" అథర్వవేదము.

కనుక యేవివాహమయినను కన్యయిష్టము లేనపుడు జరగదు. సప్తపది త్రొక్కదు. బలవంతముగా త్రొక్కించితే అది వివాహమే కాదు. బలాత్కారముగా వ్రాయించిన ఒడంబడిక చెల్లనేరదుగదా! క్రయ మిచ్చి తండ్రిని ఒప్పించును కన్యయిష్టం లేకపోతే క్రయము చెల్లదు. ఇది మనుస్మృతిలోనే సూచింపబడినది. తననిమిత్త మొకడు క్రయ మిచ్చి కన్యను తెచ్చుకొన్నాడు. పెండ్లి అయేలోపున తాను చనిపోయినాడు. వానితమ్ము డున్నాడు. అతని కిచ్చుటకు తండ్రి యిష్టపడవచ్చును. కాని కన్యయిష్టము తెలుసుకొని యివ్వవలెను అని యచట "యది కన్యానుమన్యతే" = కన్య ఒప్పుకొంటేను అని కండీషను పెట్టినాడు.

౮. పైశాచవివాహము, మనువు.—

"సుప్తాంమత్తాంప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి,
స పాపిష్ఠో వివాహానాం పైశాచః..."

నిద్రించుచున్నపుడుగాని, మత్తుపదార్థములు తినియున్నపుడు గాని, ఏమఱచియున్నపుడుకాని పైబడి యెవరికీ తెలియకుండా భోగించునది పైశాచవివాహము. ఇది అన్నింటిలోనూ పాపిష్ఠము.

ఇది యేలాటప్పు డవసరమంటే—కన్య వివాహ మాడుటకు తగిన సంబంధి యైయుండి యిష్ట మున్నట్టు లేనట్టు కన్య యుండునపుడు తలి

చంద్రులకు బొత్తిగా ఇష్టము లేకున్నప్పుడును జరుగవలసి యుండును. సంభోగానన్తరము పిల్ల పెండ్లాడుట కిష్టపడగలదు అని నమ్మక మున్నపుడే యీపని చెల్లును. పిల్ల కిష్టము లేక బయలు పెట్టితే కన్యాపహరణక్రింద దండార్హు డగును. దొంగతనముగా పిల్ల నెత్తుకొనిపోవుటగూడా పైశాచ మని యొక గ్రంథమున గలదు.

ఈయెనిమిదియును వివాహధర్మములే యయినను దానవివాహము శ్రేష్ఠ మన్నారు. రాక్షసాదులలోగూడా మొదట నిష్టపడకున్నను తరువాత నిష్టపడి దానము చేయవచ్చును. అట్లు చేసితే పితృగోత్రము నివృత్తి యగును. అట్లు కానపుడు ఆమెకు పుట్టినకొమారుడు తల్లి చనిపోయిన తరువాత తల్లికి కర్మ చేయుటకు తనతల్లియొక్క తండ్రిగోత్రమునే చెప్పి కర్మ చేయవలెను. ఆమెకు భర్తగోత్రముతో శ్రాద్ధము చేయబడదు. మాధవీయ మార్కండేయ వచనము—'అసురాదివివాహేషు పితృగోత్రేణ ధర్మవిత్' పితృగోత్ర మంటే తల్లియొక్క పితృగోత్ర మని యర్థము వ్రాసినారు.

ఇట్లీయెనిమిదివివాహములు చూపుటకు ప్రయోజన మేమనవచ్చును. కలదు. మనుపరాశరులవచనముల నిదివరకు జూపితిని. వాటిలో నీయెనిమిదింటిని స్త్రీవివాహము లనియు స్త్రీసంస్కారము లనియు జెప్పుటచేతను, పాణిగ్రహణాదికర్మకలాపము స్త్రీపురుషోభయసంస్కారమగుటవల్లను, ఇవి ముఖ్యవివాహమునకు సాధనము లగును గాని అసలువివాహములు కా వని యెఱుంగవలెను. ఏమంటే దానమువల్లగాని క్రయయుద్ధాహరణ సంభోగములవల్ల గాని పతిత్వము రా దనిన్నీ దానితోనే పత్నీత్వముకూడా రాదనిన్నీ సప్తపదితోనే రెండును వచ్చు ననిన్నీ చెప్పుటచేత కేవలసాధనములే కాని వివాహములు కావు. మఱియు వివాహ మనునది పాణిగ్రహణాదికర్మ; అది యీయెనిమిదింటిలోను ఒకవిధమే యగుటచేత అష్టవిధత్వము సాధనములది కాని వివాహముది కాదు. సాధనములభేదముచేత సాధ్యమునకును

భేదము చెప్పితే అది గౌణము కాని ముఖ్యము కాదు. ముఖ్యము కుదురనపుడే గౌణార్థము చెప్పవలెను.

ఒకవస్తువు కొన్నివిధములయినది అన్నపుడు అన్నిటిలో ఒక సామాన్యలక్షణ ముండితీరును. సాధనములే యన్నపక్షమున వివాహార్థస్త్రీ సంపాదనము ఎనిమిదింటికీ సామాన్యలక్షణ మగును. వివాహములకే అష్టవిధత్వము గౌణముగా జెప్పదలచుకొంటె అచ్చటకూడా అన్నిటిలోను ఒక సామాన్యలక్షణము చెప్పితీరవలెను. అపుడుకూడా అభిసంబంధపూర్వక సంప్రయోగమే అన్నిటిలోను సామాన్యలక్షణ మగును. అనగా ఒడంబడిక (సప్తపది) తో గూడిన మంత్రసహితసంభోగము (సమావేశనము) అని తేలుచున్నది. వీటిలో మొదట జరిగినసంభోగము సమావేశన మనబడును.

ఇంకొక్కవిశేషము—దానము లేకుండా రాక్షసాదులలో వివాహము సిద్ధించుచున్నది. క్రయాదులు లేక దానముతో వివాహము సిద్ధించుచున్నది. కావున దానక్రయయుద్ధాహరణసంభోగములలో నొకటియయినను అదే ఉంటేనే కాని వీలు లే దన్న దొక్కటియు గాదు. పాణిగ్రహణాదికమమాత్ర మన్నిటిలోను ఉండితీరవలెను. కావున వివాహశబ్దము పాణిగ్రహణాదికమునకే చెల్లును. తక్కినవి ఉద్వాహము లే అని యెఱుంగునది. ఉద్వాహలక్షణము—వివాహార్థకన్యాస్వీకార మనవచ్చును.

వివాహ ముభయకర్తృక మన్నందుకు దాన మయినతరువాత సంకల్పము—ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యానీత్యాదిగా నుండుటే ప్రమాణము. ఆవాభ్యాం = మనయిద్దఱిచేతను కర్మలు చేయబడవలెను అని. వివాహము సప్తపదితో పూర్తి యగు నని కొందఱు వ్యాఖ్యాతలున్ను, గృహప్రవేశముతో నని మఱికొందరున్ను, నక్షత్రదర్శనాంత మని యింకకొందఱున్ను వ్రాసిరి. అగ్నిపురాణమువల్ల కాని గృహ్యసూత్రములవల్ల కాని పాణిగ్రహణాదిసమావేశాన్తమే వివాహము కనబడుచున్నది. అట్లు వారు ఏల వ్రాసినా

రంటే—బాల్యవివాహము లారంభించినకాలములో కొంతవరకే నడిపించి మిగిలినది యౌవనకాలమున చేసేవారు. వారివారికాలములలోని యాచార మావ్యాఖ్యాతలు వ్రాసినా రనవలెను.

ఇట్లే కన్యాదానాంతము పూర్వవివాహ మని, తరువాతిది వివాహ హోమ మని, గృహప్రవేశము మొదలు ఉత్తరవివాహ మని మఱికొందఱు వ్యవహరించిరి. వీటినిబట్టి చూచితే యీచెప్పినస్థానములు అన్నియు వేరు వేరుకాలములలో నారంభించి చేయునాచారము పూర్వ ముండినట్లు ఊహ్య మగుచున్నది.

సప్తపది త్రొక్క యీడు రానపుడు తల్లి చంకబెట్టుకొని సప్తపది త్రొక్కుట, సమావేశనము ఈడురానపుడు భుజముమీద చేయివేయించి పందిరిలోనే పానుపు వేయించి సంభోగచిహ్నాలు నడిపించుటకు పూర్వులు సాహసింపలేదు. బాల్యవివాహము లవసరమయినకాలమున దానాన్తమో, సప్తపద్యంతమో, నక్షత్రదర్శనాన్తమో చేయించి నిలిపివేసి సంభోగార్హ కాలము వచ్చినపుడు చతుర్థి (శేషహోమము) జరిపించేవారు.

అయితే ఇపు డట్లు ఏల చేయరాదందురేమో!

తక్కినకర్మంతా జరిగి చతుర్థి ఉంచివేయునపుడు ఆవరుడు చతుర్థి లోగా దీర్ఘరోగియో, జాతిభ్రష్టుడో, దుష్టవర్తనుడో నిజముగా నయి నపుడు దాత పదిమందిలో నాసంగతి ఋజువుచేసి పిల్లను మఱొకవరునకు ఇచ్చి పెండ్లిచేయవచ్చును. కన్యయందుకూడా అట్టిదోషములు గాని వ్యభి చారాదులు కాని కనబడినపుడు వరుడు ఆకన్యను వదలివేయవచ్చును.

“చతుర్థిమధ్యే జ్ఞాయన్తే దోషా యది వరస్య చేత్,
దత్తామపి పునర్దద్యాత్పితాన్యస్మై విదుర్బుధాః.

"ప్రవర్త్యైక్యాదిదోషా స్స్యుః పతిసంగా దధో యది,
దత్తామపి హరేద్దద్యాదన్యస్మా యితి కేచన."

ధర్మప్రవృత్తిలో నీవచనములు గలవు.—

చతుర్థిలోపున వధూవరుల గోత్రము ఋషులు ఏకమయినట్టు తెలిసితే వెనుకటివానిని తప్పించి మఱియొకనికి పెండ్లి చేయనచ్చును—చూడండీ యిపుడే చెప్పితేనేకాని చక్కగా పట్టదు. కన్యాదాన మయిపోతే మఱి తండ్రికి హక్కు లేనేలేదు. మగడు చచ్చినా అది అక్కడే అఘోరించవలె కాని దానం చేసినదానిని తిరిగీ దానం చేయవచ్చునా? గోవు భూమి యట్లు చేయుచున్నామా? అని కొందఱు ధర్మశ్రవణాలు చెప్పుదురే! అట్టివారి కీశ్లోకాలలో పునర్దానముసంగతి తెలిసితే వా రట్లందురా? చూరకలోతు తెలియదు.

అందుచేత నీయసత్యయుగమున లేకున్ననూ కూటసాక్ష్యాలు తెచ్చి వరదోషకన్యాదోషాలు చూపించి మొదటివివాహము రద్దుచేతురేమో యను జంకుతో కన్నులు విడని చిన్నిపాపలగొంతుల కురిపోయుచున్నారు. ఈ యొక్కకారణముచేతనే దేశము క్షీణించె ననుటకు సందేహము లేదు. బ్రతికి యుండగా పునర్దానము లారంభించునట్టి పాపాత్ములవల్ల వరుడు చతుర్థిలోపున మరణించినా పునర్దానార్హత లేకుండజేయుటకు సంభోగముకూడా అయిం దనిపించి బాలవితంతువుల ఉసురు పోసుకొనుచున్నారు. ఇట్టి పాపాత్ములైన తలిదండ్రులకు బుద్ధి యెప్పటికినీ రాకుండుటచేతనే వివాహశాసనము గవర్నమెంటువారు కన్యలక్షేమమునకై నెలకొల్పినారు.

ఇది అష్టవిధవివాహవివేకము సప్తమభాగము.

# వివాహతత్త్వము

## అష్టమభాగము

---

### చతుర్థీవాదవివేకము - ఎనిమిదవది

అగ్నిపురాణవచనమునుబట్టి కన్యాదాన, శచీపూజా, వివాహములు అను మూడును విమర్శించి వాటిస్వరూపము నిరూపించబడినది. ఈనాలుగు కర్మలును సంపూర్ణవివాహములో నంగము లనియు స్పష్టపఱచితిని. ఇక చతుర్థీస్వరూపము నిర్ణయింపవలసియున్నది. దానికి ముందుగా చతుర్థి యని పే రేల వచ్చినదో నిర్వచింప నవసరము.

'తం చతుర్థ్యా అపరరాత్ర' అని ఆపస్తంబసూత్రము. అదే సర్వత్రా ఇపుడు దేశమందు వాడుకగా నున్నది. దానివ్యాఖ్యలలో ఆపద మెందుకు వచ్చినదో దానికని నిర్ణయించలేదు. కనుక చాలామంది ఆకర్మ ప్రస్తుతాచారముచొప్పున నాలుగవరాత్రియందు చేయుచుండుటనుబట్టి నాల్గవరాత్రి చేయునదగుటచేత చతుర్థి అన్న పేరు వచ్చిన దని భ్రమ నొందుచున్నారు. అది శుద్ధావివేకము. వారు చతుర్థీ అనుశబ్దము విశేషణ మనుకొని రాత్రికి విశేషణ మందురు. అది కుదరదు. 'చతుర్థ్యాః' అని షష్ఠీవిభక్తియు, 'అపరరాత్రే' అనునది సప్తమీవిభక్తియును ఆసూత్రమందు కానవచ్చుచున్నవి. అపరరాత్రికే అది విశేషణ మయితే చతుర్థే అని సప్తమ్యంత ముండవలెను గాని 'చతుర్థ్యాః' అని షష్ఠి ఉండదు. దాని కనుగుణముగ 'చతుర్థ్యాం' అని పాఠము కల్పించి కొందఱు వాడుచున్నారు. అదియును తప్పుదారే. అపరరాత్రశబ్దము నపుంసకము. చతుర్థీశబ్దము స్త్రీలిం-

గము. విశేషణవిశేష్యభావ మీరెంటికిని కుదరదు. అది ఆలోచించి "చతుర్థ్యాం అపరాత్ర్యాం" అని కొందఱు దిద్దుచున్నారు. 'అపరరాత్ర్యాం' అని సమాసములో నుండదు. అకారాన్త మగును. వ్యాకరణజ్ఞానశూన్యు లయినవారి పాఠకల్పన యిట్లున్నది. వారియర్థమే రావలెనంటే "చతుర్థ్యాం అపరస్యాం రాత్రౌ" అని ఉండవలెను. ఆపాఠము లేదని ఆపస్తంబసూత్రభాష్యములో స్పష్టము.

కనుక విశేషణపదము కాదు. అది విశేష్యము, కర్మనామము. అగ్నిపురాణములో నాలుగుకర్మ లని చెప్పబడిన అంగకర్మలలో నాల్గవ కర్మ. కావున విశేష్యము. మఱియు,

"వైవాహికే శుభే కర్తవ్యా తథైవ చ చతుర్థికా"

అని చతుర్థికాశబ్దము విశేష్యముగానే కనబడుచున్నది. చతుర్థీ అన్న విశేష్య ముంటేనే చతుర్థిక యని కప్రత్యయము వచ్చును. నిర్ణయ సింధులోకూడా నిట్లే,

"వైవాహికే తు దివసే శుభే చాథ శుభే తిథౌ,
చతుర్థికం ప్రకుర్వీత విధిదృష్టేన కర్మణా."

౧౭౯ పుట. తెలుగు.

అని విశేష్యమే యున్నది. దీర్ఘము లేదు కాని అది అచ్చుపొరపాటైయుండును. "చతుర్థికాం ప్రకుర్వీత"—అని యుండవలెను.

ఇంతేకాక విశేష్య మన్నందు కింకొకప్రమాణము. కర్మలలో నొక్కొక్కకర్మ చెప్పి ఆకర్మసంబంధమైన హోమములకు అగ్నిహోత్రములు ప్రత్యేకముగా జెప్పినారు. జాతకర్మకు వేరు అగ్ని, ఉపనయనాగ్నికి వేరుపేరు. ఇట్లే యితరములకును. అందులో "వివాహే యోజకః ప్రోక్తః" వివాహహోమము చేసే అగ్నికి యోజక మనిపేరు. ఆహోమ

మును సంకల్పించినపుడు ఫలానాపేరుకల యగ్నిలో ఫలానాహోమము చేయుచున్నాను అని సంకల్పము చెప్పవలెను. మనవార లిది మఱచినారు. ఉత్కళులు, వంగీయులు ఇపుడుకూడా చెప్పుచున్నారు. ఆవిధమున "చతుర్థ్యాం తు శిఖీనామ" చతుర్థి యనుకర్మకు శిఖి యని పేరుగలయగ్ని యని. అది కర్మ కాకపోతే యెట్లు కర్మలమధ్యను దానిని వ్రాతురు? కావున కర్మనామము. కనుకనే విశేష్యము. విశేషణము కానేకాదు. గ్రంథములు చక్కగా చదువక తకవికలుపడుదురు. గోభిలగృహ్యాసంగ్రహమున, 'గర్భాధానే అగ్నిః మరుతనామా-పుంసవనే చంద్రనామా-సీమంతే మంగళనామా-జాతకర్మణి-ప్రగల్భ-నామకరణ-పార్థివ' ఇత్యాది మీద వివరించినప్రకారము చతుర్థి యొకకర్మ. అగ్నిపురాణమున వివరించిన నాలుగు కర్మలలో నాల్గవకర్మ యగుటచేతనే ఆపేరు వచ్చినది. వంగోత్కళ భాషలలో 'చాటీ' యందురు. సంస్కారదీపమున,

"చతుర్థీకర్మణః వివాహాంగత్వా ద్వివాహాగ్నావేవానుష్ఠానమ్"

అని యున్నది. చతుర్థీకర్మ వివాహములో నొకభాగ మగుటచేత లాజహోమము చేసినయగ్నిలోనే చతుర్థీహోమము చేయవలయును. ఇచట మతభేదము. చతుర్థికి వేరే అగ్నిహోత్రములో హోమ మని కొందఱు, వివాహాగ్నిలోనే చతుర్థీహోమ మనియు కొందఱు. ప్రస్తుతకాలమున వివాహాగ్నిలోనే చతుర్థీకర్మ జరిగించుచున్నారు. పూర్వము నక్షత్రదర్శనాన్తము ఋతుపూర్వమున జేసి అక్కడకు నిలిపి ఋత్వనంతరము చతుర్థి వేరుకర్మగా నాచరించేఆచార ముండే దనుటకు ఈమతభేదమే ప్రమాణము.

చతుర్థి యీనాడు చేయవలె నని నిర్ణయము లేదు. వివాహమునకు చెప్పిననక్షత్రములందే శుభతిథిముహూర్తములందు చతుర్థి చేయవచ్చును. వివాహము నక్షత్రదర్శనాన్తమును చేసి తరువాత దంపతులు బ్రహ్మచర్యము

త్రిరాత్రము కాని ఆరురాత్రులు కాని పన్నెండురాత్రులు కాని సంవత్సరము గాని వారివారికోరికలప్రకారమున్ను పిల్లవయసు ననుసరించిన్నీ చేయవలెను. ఆవ్రతాంతమందు చతుర్థి చేయవలెను. ఈపక్షములు ఆశ్వలాయనుడు బోధాయనుడు ఇత్యాదులు నిర్ణయించినారు. ఏకరాత్రబ్రహ్మచర్యముకూడా బోధాయనున కిష్ట మయినట్లు సూక్ష్మదృష్టికి గనంబడును.

వివాహము మొదలుకొని ఏకరాత్రబ్రహ్మచర్యము చేయునపుడు రెండవరాత్రి చతుర్థీకర్మ. త్రిరాత్రపక్షమున నాల్గవరాత్రి, షడ్రాత్రబ్రహ్మచర్యపక్షమున సప్తమరాత్రియందును ద్వాదశరాత్ర బ్రహ్మచర్యపక్షమున పదమూడవదినమందును ఇట్లే సంవత్సరాంతమందును చతుర్థి చేయవలసి యున్నది. ఈవిషయమున బోధాయనగృహ్యసూత్రమున బ్రహ్మచర్య మెంత యధికము చేసితే అంత గుణవంతుడగు పుత్రుడు కలుగు నని కామ్యము చెప్పి యున్నది. ఒక్క బ్రహ్మపురాణములోమాత్రము గౌతమీమాహాత్మ్యమందు విష్టిభాను సంవాదమున—

'కృతే వివాహే శక్తా తు వార్షికం వ్రత ముచ్యతే,
అథ తద్ద్వాదశాహాని త్రింశద్వర్షేణ సర్వదా,
యది ద్వాదశవర్షా స్యాత్ కన్యా రూపగుణాన్వితా,
ద్వాత్రింశద్వర్ష పూర్ణేన యది షోడశవార్షికీ,
లబ్ధా తదా తు వాస్తవ్యం షడ్రాత్రం సంయమేన తు,
వింశత్యబ్దా యదా కన్యా వాస్తవ్యం తత్ర వై త్ర్యహమ్,
అత ఊర్ధ్వ మహోరాత్రం వాస్తవ్య మతిసంయతైః'

నక్షత్రదర్శనాంతవివాహము అయినతరువాత శక్తి యున్నపుడు సంవత్సరము బ్రహ్మచర్యము చేసి తరువాత చతుర్థీకర్మ చేయవలెను. ఈ పక్షమున వివాహము ఒకసంవత్సరమునకుగాని పూర్తి కాదు. దీనినిబట్టి ఋతుపూర్వము సంవత్సరానకు రజస్వల కాగల దన్నపుడు వివాహము ప్రారంభించవచ్చును. ఇది వివాహమునకు ముఖ్యకాలమున్ను ప్రశస్తమున్ను

అని యందరిమతమున్నది. ఇదే నగ్నిక యనంబడును. ఇక రెండవపక్షమున్న కన్య పన్నెండేండ్లది వరుడు ముప్పదేండ్లవాడును అయితే పండ్రెండుదినాలు బ్రహ్మచర్యమనిన్నీ ఆపండ్రెండేళ్లకన్య రూపగుణవతి యయితేనే పండ్రెండు రాత్రులు అనిన్నీ వ్రాసినారు. పదారేళ్ల కన్యయు ముప్పదిరెండేండ్లవరుడును అయితే ఆరురాత్రులు బ్రహ్మచర్యము చేయవలె ననియు, ఇరవైయేండ్ల కన్య యయితే మూడురాత్రులే బ్రహ్మచర్యము. వరునివయసుతో నిచట అవసరము లేదు. ఇరవైయేళ్లకు పైబడినవయసుకన్నె యయినపుడు ఒక్క రాత్రి బ్రహ్మచర్యము అని యున్నది. ఇతరగ్రంథములలో నీనియమము లేకున్నను ఇది అంతగా పాటించవలసినది కాకున్నను పూర్వము వివాహ్య కన్యలు ఎంతెంతవయసువారుగా నుండేవారో తెలియగలందులకు జూపినాను. బాల్యవివాహము పూర్వాచార మనువారలు కేవలమూఢు లని తెలియుట కుదాహరించబడినది. బాల్యవివాహము పూర్వాచారమో యువతీవివాహము పూర్వాచారమో చదువరు లెఱుంగుదురుగాక.

చతుర్థీకర్మలో చదివే వేదమంత్రములలోగూడా యువతికే వివాహ మన్నసూచన కలదు.

" ఉదీర్ష్వాతో విశ్వావసో నమసే ళామహే త్వా అన్యా మిచ్ఛ ప్రఫర్వ్యగ్ం సంజాయాం పత్యా సృజ "

ఋగ్వే. అ ౭ వ ౨౮ మ ౧౦ అ ౭—సూక్తము ౮౫. పుట ౨౨౬ భాష్యసహితపుస్తకము—

భాష్యం—అతః = అస్మాచ్ఛయనాత్, హే విశ్వావసో = కన్యాస్వామిన్ గంధర్వ, ఉదీర్ష్వ = ఉద్గచ్ఛ......సత్వం అన్యాం ప్రఫర్వ్యం = బృహన్నితంబాం కన్యాం ఇచ్ఛ జాయాం మాం పత్యాసహ పున స్సంసృజ. ఈమంత్రము చతుర్థిరాత్రి గంధర్వప్రార్థన కన్యచేయుట కుప యోగింతురు. దానియర్థము. ఓగంధర్వుడా! కన్యాస్వామీ! ఈపాన్పు నుండి లేచిపొమ్ము. పెద్దపిఱుదులుగల మఱొకస్త్రీని గోరుము - అని

విశ్వావసుగంధర్వ ప్రార్థనలో, చతుర్థి కాకముందే గొప్పపిఱుదులుగలిగినకన్య నాశ్రయించు మని యున్నందునను చతుర్థి కానికన్యనే గంధర్వు డాశ్రయించునట్లు స్పష్టము. కావున దీనినిబట్టి వివాహకాలానికే కన్యకు యౌవనము వచ్చినట్లు ఊహించవలసియున్నది. యౌవనమందే స్త్రీలకు పిఱుదులు పెద్దవగును. అప్పుడే స్తనములుకూడా పెరుగును. ఈమంత్రార్థము వ్రాయుచు మూలములో లేని "పునః" అనుపదము ఎక్కువ తెచ్చిపెట్టినారు. దీని కారణ మూహించవలసియున్నది. అప్పటి ఆచారములో ఋతుపూర్వమే అష్టవర్షాదిగా కన్యకు వివాహము నక్షత్రదర్శనాంతము చేసి ఋత్వనంతరమందు చతుర్థి చేయువా రని, యీమధ్యకాలములో పిల్ల తండ్రివద్దనే యుండే దని, వివాహగృహప్రవేశకాలము వధూవరు లిద్దఱును ఒకమాఱు కలిసిమెలిసి యున్నందున చతుర్థి నాడు పునః కలియుటను సూచించు నని యొకయూహ; లేదా ప్రధానహోమకాలమందు సోమగంధర్వాగ్నులు ముగ్గురును ఈకన్యను వరుస కప్పగించిరి. అప్పుడు మాయిద్దఱిని కలిపినావు. అట్లే తిరిగీ యిపుడు మమ్ములను కలుపుమా అనియు మఱియొకయూహ. అట్లయితే కాలానుసారివ్యాఖ్యాన మయియున్నది. ఇది గర్భాధానకర్మ మాత్రము కాదని యెఱుంగుడు, చతుర్థిలోనిదే.

బ్రహ్మచర్యము చతుర్థీకర్మకు సంబంధించినదే కాని తత్పూర్వ వివాహమునకు సంబంధించినది కాదు. ఏ మన బోధాయనుడు బ్రహ్మచర్య న్యూనాధిక్యములవల్ల పుట్టినసంతానమున గుణాధిక్యన్యూనతలు చెప్పుటచేత చతుర్థీకేఅంగము. కారణమేమంటేచతుర్థిలోనేసంభోగ(సమావేశన)మున్నది.

వివాహములో మూడు ప్రధానకర్మలు మూడు ప్రధానహోమము లున్న. కన్యాదానము, దానిహోమము, గృహప్రవేశము, దానిహోమము, సమావేశనము, శేషహోమము. కనుక శేషహోమము సమావేశనాంగము.

అట్లు అనుటకు సాధక మే మంటే శేషహోమము చేయగా మిగిలిన నేయి వధూవరులు శరీరమునకు పూసుకొని సమావేశనము నడిపించవలెను. వధువుతలమీద ఆనేతితో మూడుమారులు అత్తురు.

ఇది చతుర్థీవాదవివేకము – అష్టమభాగము.

# వివాహతత్త్వము

## నవమభాగము

### చతుర్థిలో సమావేశనవాదము

'సమావేశనం వధ్వాసహ మైథునార్థం శయనం'-అని సుదర్శనభాష్యములో వివరించినారు. శాంఖాయనగృహ్యసూత్రమున—'అథ యది క్షిప్రం గర్భకామా పాణిగ్రహణా దారభ్య వరేణ దశరాత్ర మవిప్రవాసః' శీఘ్రముగా గర్భము కావలె నని కోరినకన్యయయితే పాణిగ్రహణముమొదలు పది రాత్రులు వరుని విడువకయుండవలెను. గర్భహేతుక మయినసంభోగము దీనివల్ల స్ఫురించుచున్నది.

ఇచట బోధాయనసూత్రములు కొన్ని చూపి వివరించవలసియున్నది.

'అథ వివాహస్యారుంధతీదర్శనా త్కృత్వా వ్రత ముపైతి - అగ్నే వ్రతపతయే...తన్మే సాధ్యతామ్.' ౧౫. ఉభౌ జాయాపతీ వ్రతచారిణౌ భవతోఽధశ్శయాతే. ౧౬. తయోశ్శయ్యా మంతరేణ ఉదుంబరదండో గంధానులిప్తో వాససా సూత్రేణవా పరివీత స్తిష్ఠతి ఆపక్వహోమాత్. ౧౭. చతుర్థ్యాం నిశాయాం హుతే పక్వహోమే వ్రతం విసృజ్య దండ ముత్థాపయతి. ౧౮. అథైనం వధ్వై ప్రయచ్ఛతి. ౧౯. తం వధూః ప్రతిగృహ్ణాతి .౨౦. అథైనం వరాయ ప్రయచ్ఛతి

౨౧. తం వరః ప్రతిగృహ్ణాతి. ౨౨. అథైనం స్థూణదేశే నిధాయ అంతికేన ప్రతిపద్యతే. ౨౩. ప్రసిద్ధముపవేశనం. ౨౪. శ్వోభూతే దండ మాదాయ పుణ్యాహం వాచయిత్వాఽప్సు విసర్జతి. ౨౫. అథ దేవయజనోల్లేఖనాది కృత్వా పక్వాజ్జుహోతి. ౨౬. స్విష్టకృత్ప్రభృతిసిద్ధమాధేనువరప్రదానాత్. ౨౭. స ఏష పార్వణోభవతి. ౨౮. అథ అస్తమిత ఆదిత్యే అన్యోన్యమలంకృత్య ఉపరిశయ్యాం శయాతే. ౨౯. అథ వధూ మభిమంత్రయతే. ౩౦. అథైనాం సురభిగంధమాలయా యునక్తి ౩౧.

ఇతి బోధాయనగృహ్యసూత్రే.....పంచమాధ్యాయః.

"ఆనయత్యేన మగ్నిం. ౧. అథ దేవయజనోల్లేఖనాది ప్రణీతాంతం కృత్వా పక్వాజ్జుహోతి. ౨. ......జయప్రభృతి ఆధేనువరదానాత్. ౧౯. అథైనాం ప్రదక్షిణ మగ్నిం పర్యాణయతి. ౨౦. అథ (శ్రీ)మంత తమగారం సంమృష్టోపలిప్తం... తస్మిన్నేనాం సన్నివేశ్య తస్యా అంతికే జపతి. ౨౨. అథైనాముపసంవేశయతి ౨౪. స్తోకోతిం వృణోతి. ౨౫.

ఇతి షష్ఠోఽధ్యాయః.—

దీనికి వరుసగా తెలుగు—అరుంధతీదర్శనమువరకును వివాహము చేసి వ్రత మారంభింపవలెను. ౧౫-౧౬ వారిద్దఱిమధ్యను బొడ్డకఱ్ఱను గంధము పూసి వస్త్రమో దారమో చుట్టి పక్వహోమ మగువరకును ఉంచవలెను. ౧౭. చతుర్థినాడు రాత్రి పక్వహోమమయినతరువాత వ్రతము (బ్రహ్మచర్య) విడిచి దండమును తీయవలెను. ౧౮. దండమును మంత్రి

ముతో వధువుచేతి కిచ్చును. ౧౯. మంత్రముతో వధువు పుచ్చుకొనును. ౨౦. తరువాత మంత్రము చదువుచు దండమును వధువు వరునిచేతి కిచ్చును. ౨౧. మంత్రముతో వరుడు పుచ్చుకొనును. ౨౨. తరువాత దండమును దూలముమీద నుంచి సమీపమునకు పోవును. ౨౩. ఉపవేశనము చేయవలెను. అది ప్రసిద్ధమే. ౨౪. ఆమరునాడు పుణ్యాహవాచనము చేసుకొని దండమును నీటిలో విసర్జించవలెను. ౨౫. తరువాత పక్వహోమము చేయవలయును. ౨౬. పురోహితునకు దక్షిణ యిచ్చేవరకు హోమపూర్తి చేయవలెను. అది అందరికీ తెలిసినదే (అనగా ఫలానాలాగున చేయవలె నని ప్రత్యేక మిచట చెప్పనక్కర లేదని తాత్పర్యము.) ౨౭. ఈహోమము పర్వములలో చేయునది. ౨౮. సాయంకాలమందు దంపతు లలంకరించుకొని పానుపుమీద పరుండవలెను. ౨౯. అపుడు వధువును మంత్రముతో ముట్టుకొనవలెను. ౩౦. పిమ్మట వాసనగల పుష్పమాలను వధువుకు కట్టవలెను. ౩౧. ఇది బోధాయనగృహ్య......పంచమాధ్యాయము.

ఆవివాహాగ్ని తేవలయును. ౧. హోమకుండసంస్కారము మొదలు ప్రణీతామార్జనమువరకును చేసి పరమాన్నము వండించవలెను. ౨. పరిధానము మొదలు అగ్నిముఖాంతము చేసినతరువాత పాయసహోమము చేయవలెను. ౩. అదే అగ్నిస్థాలీపాకములకును చరుహోమము (అనగా నట్లే పర్వములలో చేయున దని తాత్పర్యము.) ౪. జయాదులు, హోమదక్షిణ చేయవలెను. ౧౯. పిమ్మట వధువును అగ్నిచుట్టు ప్రదక్షిణము చేయించవలెను. ౨౦. తరువాత చక్కగా నలంకరించినయింటిలో......ఆమెను సంవేశింప (పరుండ) జేయవలెను. ఆమెదగ్గరకు వెళ్లి మంత్రము జపించవలెను. ౨౨. ఆమెను ఉపసంవేశనము చేయవలెను. (తనదగ్గరగా పరుండినట్లు తీసుకొనవలెను.) ౨౪. యోనిని తెరచవలెను. ౨౫. (యోని యనగా స్త్రీయొక్క రహస్య మయిన అవయవము) ఇది బోధాయన...... ఆరవ అధ్యాయము.

ఈ రెండధ్యాయములలో ప్రతిపనికిని మంత్రము లున్నవి గ్రంథ విస్తర మగు నని వాటిని చూపలేదు. అయిదో అధ్యాయములో చతుర్థిలో చేయుకర్మలను నిరూపించినాడు. పక్వహోమమున్ను సమావేశనమున్ను సూచించి వదలినాడు. అంతకు ఇరవయిరోనిమిదిసూత్రము లయినవి. ఆపిమ్మట మాలికాబంధముచెప్పి అధ్యాయము ముగించినాడు. ఆరవ అధ్యాయమున వెనుకటియధ్యాయములో సూచించి వివరించక వదలివేసిన పక్వహోమమును వివరించినాడు. ఆయా యామంత్రములు ఆయా కర్మలున్ను, తరువాత "అంతికేనప్రతిపద్యతే" = సమీపమున జేరవలెను. అని అయిదోఅధ్యాయమున సూచించినపనిని వివరించినాడు. అచట మంత్రములు వివరించినాడు. తర్వాత వెనుకటి అధ్యాయమున ప్రసిద్ధ ముప వేశనం = సంభోగ మందరికీ తెలిసినదే యని వివరించక విడిచినదానిని అథైనాం సంవేశయతి = పరుండబెట్టవలెను దగ్గరకు తీసుకొనవలెను యోనిని తెరచవలెను అని విస్తరించి చెప్పినాడు. వీటి నన్నిటిని గమనించగా అయిదవయధ్యాయములో వివరించనివిషయములు వివరించిన వ్యాఖ్యానమే ఆరవ అధ్యాయ మగును. వేరు కాదు. సంభోగము ఈబోధాయన సూత్రమున స్పష్టముగా జూపబడినది. ఆపస్తంబసూత్రము పుట్టకమునుపు బోధాయనసూత్రమే ప్రచారములో నుండేది. కర్మబాహుళ్య గ్రంథబాహుళ్యములు తగ్గించి ఆపస్తంబులు వ్రాసినారు. ఆపస్తంబభాష్యమందు సూత్రార్థము సందిగ్ధముగా నుండుచోట భాష్యకారుడు "యథాహ బోధాయనః = బోధాయను లిట్లే యన్నారు" అని బోధాయనునివ్రాతను తన వ్రాతకు ప్రమాణముగా తెచ్చుచుండును. కనుక బోధాయనాపస్తంబమతములకు భేదము లేదనుట నిశ్చయము.

ఈచోట ఆపస్తంబసూత్ర మెట్లున్నదో చూడుడు.

'తం చతుర్థ్యా అపరరాత్ర ఉత్తరాభ్యా ముత్థాప్య

ప్రక్షాళ్య నిధాయాగ్నే రుపసమాధానాద్యాజ్య భాగాన్తేఽ
న్వారబ్ధాయాం ఉత్తరా ఆహుతీర్హుత్వా జయాది ప్రతి
పద్యతే, పరిషేచనాంతం కృత్వాఽపరేణాగ్నిం ప్రాచీ ముప
వేశ్య తస్యాశ్శిర స్యాజ్యశేషా ద్వ్యాహృతిభి రోంకారచతు
ర్థాభిః ఆనీయో త్తరయాజ్యశేషేణ హృదయదేశే సంసృజ్య
ఉత్తరా స్త్రిస్రో జపిత్వా శేషం సమావేశనే జపేత్.'

ఆగంధర్వదండమును చతుర్థియొక్క రాత్రియందు మూడవజామున
రెండుమంత్రములతో పైకెత్తి కడిగి యుంచి అగ్న్యుపసమాధానాది పరి
షేచనాంతము హోమము చేసి అగ్నికి తూర్పుగా ఉపసంవేశింపజేసి ఆమె
శిరసున వ్యాహృతులతో హోమము చేసినట్లు పోసి మిగిలిన నేతితో రెండు
మంత్రములు చదువుచు గుండెలకు అంటించవలెను. తరువాత మూడు
మంత్రములు జపించి మిగిలినమంత్రభాగము సమావేశనము చేయునపుడు
జపించవలెను.—ఇందు బోధాయనుడు చెప్పినయంశము లన్నీ టూకీగా
నున్నవి. 'అన్వారబ్ధాయాం' అనుటవల్ల చతుర్థీహోమము వధూవరు లిద్ద
ఱును కలిసి చేయవలెను. కనుక నీచతుర్థి ఉభయసంస్కార మనవలెను.
కన్యను కూర్చోపెట్టి నేతిని పూయుచున్నారు. బాలిక గనుక పది
మందిలో గుండె బయలుపఱచినా యూరకొనుచున్నది. యువతియే
పెండ్లికూతు రయినపుడు అంగీకరించునా? బాలికయే అందా మంటే
సంభోగము కుదరదు. కావున నిది రహస్యగృహమందు జరుగవలసినసంస్కా
రమే. కావున ఆపస్తంబసూత్రము 'ప్రాచీ ముపవేశ్య' అంటే తూర్పుతలగా
పరుండబెట్టవలె నన్నయర్థమే చెప్పవలెను. తూరుపుతలగా వధువు పరు
న్నపుడు వరుడుకూడ తూర్పున కభిముఖుడై సంస్కారము చేయును.
పీటలమీద కూరుచున్నపుడు ఎదురుతిరిగితే దక్షిణోత్తరాభిముఖు లగుదురు.
తూర్పున కభిముఖమై వధు వున్నపుడు ఆమె కెదురైనవరుడు పశ్చిమాభి

ముఖుఁ డగును. పశ్చిమాభిముఖుఁడై వధువును వరుడు సంస్కరించుట అశాస్త్రీయము. కావున నిపుడు మనవారు చేయించుచున్న విధానము తప్పు.

ఈయయిదారు అధ్యాయములలో వర్ణించిన బ్రహ్మచర్యము, ఏక రాత్ర బ్రహ్మచర్యము. ఏమన నక్షత్రదర్శనాంతకర్మ పగలు జరుగదు నక్షత్రదర్శనము కావలెను. అపుడు గంధర్వస్థాపనము, ఆరాత్రి బ్రహ్మ చర్యము 'శ్వోభూతే' అంటే ఆతెల్లవారి దండవిసర్జనము, ఆరాత్రి పక్వ హోమము, అనంతరము సమావేశనము మొత్తము రెండురాత్రులు ఒకపగలు. నాకబలి చేసితే పూర్తిగా రెండురోజులు. ఏకరాత్రవివాహ మంటే యిదియే. కాని యిపుడు జరుగుచున్న రీతి ఏకరాత్రవివాహము లశాస్త్రీయము లని యెఱుంగదగును. ఇది యేకరాత్రవివాహ మన్నందు కింకొనిదర్శనము ఈదిగువ వివరింతును. ఏడవయధ్యాయమున బోధాయనుడు—

"అథ యది కామయేత శ్రోత్రియం జనయేయ మితి ఆరుంధత్యుపస్థానాత్కృత్వా త్రిరాత్ర మక్షార లవణాశినౌ అధశ్శయానౌ బ్రహ్మచారిణౌ ఆసాతే. ౯. అహతాం వాస సాం పరిధానం. ౧౦. చతుర్థ్యాం పక్వహోమ ఉపసంవేశ నంచ. ౧౧. అథ యది కామయేత అనూచానం జనయేయ మితి ద్వాదశరాత్ర మేతద్వ్రతం చరేత్. ౧౨. వ్రతాంతే పక్వహోమ ఉపసంవేశనంచ. ౧౩."

ఇత్యాదిగా సంవత్సరాంతపక్షములును, తత్ఫలములును చెప్పినాడు.

మీదిదానియర్థము—శ్రోత్రియుడగు కొమారుని కనవలె నన్నకోరిక గలవారు అరుంధతీదర్శనాంతము వివాహము చేసుకొని త్రిరాత్రబ్రహ్మ చర్యము చేయవలెను. ౯. ఉత్తరించని బట్టలు కట్టుకొనవలెను. ౧౦. చతుర్థినాడు పక్వహోమము సమావేశనము చేయవలెను. ౧౧. అనూచానుడగు

కౌమారుడు కావలెనంటే పంౘెండురాత్రు లీవ్రతము చేయవలెను. ౧౨. వ్రతాన్తమందు పక్వహోమము చేయవలెను. ఉపసంవేశనము (సమావేశన) చేయావలెను. ౧౩.

దీనినిబట్టి చూడగా కోర్కెల ననుసరించి చేయవలసినవే త్రిరాత్రాది పక్షములు. అట్టికోర్కెలు లేనపుడు ఒకరాత్రియే వ్రత మని యూహించుటకు వీ లున్నది.

యువతీవివాహవాదమును స్థిరపఱచుటకు సమావేశనవాదమే ముఖ్యము. సమావేశన మంటే మంత్రముతో ప్రథమసంభోగము. అది వివాహములో నొకభాగ మని బోధాయనునివల్ల తెలియబడినది. సుదర్శనాచార్యుడుకూడా వ్యాఖ్యానించినాడు. ఇక యితరగృహ్యసూత్రములుకూడా ఈవిషయమున నేకీభవించుచున్నట్లు ఋజావు చూపవలసియున్నది.

సంస్కారరత్నమాల—పారస్కరగృహ్యము ననుసరించి వ్రాయబడినది.

"తత ఆసాదితం జలపూర్ణం కుంభం అగ్నే స్సమీపే నిధాయ ఉదకుంభసహితం తం ప్రదక్షిణీకృత్య అపరేణాగ్నిం శయనస్థానం కల్పయిత్వా పరిశ్రిత్య తత్ర ప్రాక్ఛిరస్కాం ఉదక్ఛిరస్కాంవా భార్యాం శాయయేత్, అత్ర వాచనిక ముదక్ఛిరస్కం శయనం. తతః "అభిత్వాపంచశాఖేన...... సుప్రజాస్త్వాయ" ఇతి తస్యా యోనిం దక్షిణహస్తేన అభిమృశతి, ఓం సన్నామ్న ఇతి సంగమం కరోతి. ఓం మమాను వ్రతా భవ......ఇత్యాలింగతి, మధుహేమధు......సంవననా స్వకే ఇతి ద్వాభ్యాం తస్యా ముఖం ముఖేన జుషతి.

ఇద ముపగమన మావశ్యకం స్త్రీసంస్కారత్వాత్ తతః కర్మణా స్సాంగతాసిద్ధ్యర్థం ఆచార్యాయ దక్షిణాం దద్యాత్."

నాగరి, ౨౫౮ పుట.—

శేషహోమ మయినతరువాత జలకలశమును అగ్నివద్దను ఉంచి దానిని కలిపి వచ్చేటట్టు అగ్నికి ప్రదక్షిణము చేసి అగ్నికి వెనుకప్రక్కను పడకచోటు కల్పించి పానుపువేసి అచట తూర్పు శిరస్సుగాగాని ఉత్తర శిరస్సుగాగాని భార్యను పరుండబెట్టవలెను. తరువాత "అభిత్వాపంచ శాఖేన" అనుమంత్రముతో కుడిచేతను ఆమెయోనిని ముట్టుకొనవలెను. 'ఓం మమానువ్రతా' అనుమంత్రముతో కౌగలించవలెను. 'ఓంసన్నామ్న' అనుమంత్రముతో సంగమము చేయవలెను. 'మధు మధు' అనుమంత్ర ముతో ముద్దుపెట్టవలెను. అని వ్రాసి యీసమావేశనము స్త్రీసంస్కారము కనుక తప్పక చేయవలెను. ఆతరువాత దంపతులు పీటలమీద కూర్చొని పుణ్యాహవచనము చేసినతరువాత పురోహితునకు దక్షిణ యివ్వవలెను.

"వివాహానన్తరం గచ్ఛేత్సభార్య స్స్వస్య మందిరమ్"

ఆశ్వలాయనగృహ్యకారిక, కుమరిలభట్టు—

"స్వస్త్యాది వాచయిత్వాతు స్త్రియం తా ముపగచ్ఛతి."

అని ప్రారంభించి,

వివాహానన్తరము భార్యతో గృహప్రవేశము చేసి పుణ్యాహవచనము చేసుకొని ఆస్త్రీని భోగించవలెను.

"పుమాంసౌ...మయి స్వాహా ఇతి పూర్వాం గర్భ కామా దశరాత్ర మవిప్రవాసః"—

కాషీతకీగృహ్యాం—

గర్భము ముందుగా కోరినస్త్రీ పదిదినములు వదలకుండ భర్తతో కలిసియుండవలెను.

మానవగృహ్యసూత్ర—'యోక్త్రపాశం విహాయ తౌ సన్నిపాతయేత్' దానివ్యాఖ్యలో సన్నిపాతయేత్తంటే సంగమయేత్తని యర్థము వ్రాసినారు. = నమమునకు పెళ్లికాలమున గట్టినదర్భత్రాడును విప్పి ఆదంపతులను సంగమింపజేయవలెను—ఇచట దర్భత్రాడును విప్పి అని యుదాహరించుటచేత వివాహకర్మ యని స్పష్టము. దర్భత్రాడు వివాహములోనే తప్ప గర్భాధానమునందు కట్టరు.

జైమినిగృహ్యము—'ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవః' మూడురాత్రుల బ్రహ్మచర్యముతరువాత సంభోగము చేయవలెను.

'సంభవః' అనుమాటకు 'సంయోగః' అని శ్రీనివాసభాష్యము. ఇచట త్రిరాత్రానన్తర మంటే యేజాములో నని ప్రశ్నించుకొని, 'ఊర్ధ్వమర్ధరాత్రాత్సంవేశనం' అని అచటనే వ్రాసినాడు. ఇచట సంవేశనం అనుమాట సంభోగమనే అర్థమందు వ్రాసిరి. బోధాయనలో సంవేశయాతి అని వ్రాసినాడు. ఇదే యచటి యర్థముకూడను.

గోభిలగృహ్యములో—'ఊర్ధ్వం త్రిరాత్రాత్సంభవః' అని.

హిరణ్యకేశిగృహ్యము—సమావృత్తో......భార్యా ముపయచ్ఛేత్, సజాతాం నగ్నికాం బ్రహ్మచారిణీం అసగోత్రాం'—దీనికి మాతృదత్తవ్యాఖ్య 'నగ్నికాం ఆసన్నార్తవాం......తస్మాద్వస్త్రవిక్షేపణార్హా నగ్నికా మైథునార్హేత్యర్థః.'

స్నాతకము చేసుకొని......మంచివంశమందు పుట్టినదిన్నీ నగ్నికయైనదిన్నీ బ్రహ్మచర్యము చేయుచున్నదిన్నీ సగోత్రురాలు కానిదిన్నీ అగు భార్యను పెండ్లాడవలెను. వ్యాఖ్యలో నగ్నిక యంటే ఇక కొద్దికాలములోనే ఋతుమతి కాగలది. అనగా ఎదిగేయీడు దని దేశమున వాడుక. అనగా సంభోగించుటకు తగియున్నదని వ్రాసినారు.

ఆశ్వలాయనగృహ్యవ్యాఖ్య అనావిలావృత్తి—"తత స్తస్యాం రాత్రౌ పుణ్యే ముహూర్తే సమావేశనమ్" అని వ్రాసిరి. సమావేశన మంటే సుదర్శనాచార్యులు వధువుతో వరుడు సంభోగించుటకు పరుండుట యని యర్థము వ్రాసినా డని యిదివరకు వ్రాసియుంటిని.

ఆసుదర్శనాచార్యుడు బ్రహ్మచర్యవ్రతసూత్రములోని, మైథున వర్జనం-అనుమాటను ఇట్లు విమర్శించినాడు. త్రిరాత్రవ్రతములో మైథునము చేయరాదు అనిగదా యీసూత్రార్థము! కనుక అంతకుముందు పాణిగ్రహణదినంనాడు మైథునము చేయవచ్చు ననియేకదా! అనిశంకించుకొని, కాదుకాదు. ముందుకూడా మైథునము మానవలసినదే. అయితే ఆమాట సూత్రంలో ఏలచెప్పలేదు? ఒక్కత్రిరాత్రమందే వద్దన్నాడుగదా! అంటే

"అతఏవాత్ర శయ్యైక్యాద్దుర్వారమపి మైథున మతి ప్రయాసేన వర్జనీయ మిత్యేవ మర్థః"

ఏకశయ్య కనుక ఉండడము కష్టమని జాగ్రతకొఱకు చెప్పినాడు గాని స్థాలీపాకానకు ముందుగూడా సంగమము చేయరాదు. ఏమంటే సంగమమునకు మంత్రజపము బ్రహ్మచర్యవ్రతాంతమందు విధించినాడు. కనుక,

శేషంసమావేశనే జపే దితి ఉత్తరత్ర క్రమవిధానాత్,

ఏతచ్చ స్థాలీపాకా త్ప్రాగప్యర్థ్వని.

ఈమైథునము మానుట స్థాలీపాకానికి ముందుదారిలోగూడా పాలింపవలసినదే కనుక కన్య యువతి యనకతీరదు.

కనుక గృహ్యసూత్రము లన్నియు వివాహములో నొకసంస్కారముగా సంభోగ మున్న దన్నందుకు ఏకగ్రీవము లైయున్నవి. కనుక యిపుడు బుజముమీద చేయివేంచిన మంత్రము 'అఘోరచక్షు' అనేది సంభోగకాలమందు పెండ్లికూతురిని మంత్రించేమంత్రం లేక ఆకాలమందు వరుడు జపించుమంత్ర మనికాని చెప్పవలెను.

ఇది సమావేశనవాదము నవమభాగము.

# వివాహతత్త్వము

## దశమభాగము

### భర్తృగోత్రప్రాప్తివివేకము - పదవది.

'వివాహే చైవ నిర్వృత్తే చతుర్థేఽహని రాత్రిషు,
ఏకత్వం సా గతా భర్తుః పిండే గోత్రేచ సూతకే.'

శంఖలిఖితస్మృతి, అతిప్రాచీనము—

'అనూఢా న పృథక్కన్యా పిండే గోత్రేచ సూతకే,
పాణిగ్రహణమంత్రాభ్యాం స్వగోత్రాద్భ్రశ్యతే తతః. ౮౪.
'స్వగోత్రాద్భ్రశ్యతే నారీ ఉద్వాహా త్సప్తమే పదే,
భర్తృగోత్రేణ కర్తవ్యం దానం పిండోదకక్రియా.' ౭౮.

నాగరి,౮౬ శ్లో. యమస్మృతిలోగూడా నిది కలదు—

గోభిలవ్యాఖ్యలో తర్కాలంకారుడుకూడా ఈశ్లోకములను వ్రాసినాడు. ఒకగ్రంథకారునిశ్లోకము లగుటచేత పరస్పరవిరోధము రాకుండా సమన్వయించవలయును.

౭౮ శ్లోకార్థము—ఉద్వాహ మయినతరువాత సప్తపదిలో తనగోత్రమునుండి స్త్రీ వదలిపోవును. (కావున నామెకు) ఉదకదానము పిండము దానమున్ను భర్తగోత్రముతోనే చేయవలయును.

౧౬ శ్లోకార్థము—వివాహ మయిననాటి నాల్గవరాత్రి మొదలు మూడురాత్రులలో కన్య భర్తతో పిండైక్యగోత్రైక్యములను సూతకైక్యములను జెందును.

౧౪ శ్లోకార్థము—పెండ్లికానికన్య పిండములోను గోత్రమందును (తండ్రికి) వేరుకాదు. పాణిగ్రహణమంత్రములవల్ల స్వగోత్రము నుండి విడును.

ఇచ్చటివిచారము సూక్ష్మదృష్టితో గమనింపవలయును.

౧౬ చతుర్థదినమురాత్రియందు అని యేకవచనమే యర్థ మయితే "రాత్రౌ" అని యుండవలెను. "రాత్రిషు" అని బహువచన మున్నందున మీమాంసాసూత్రము కపింజలాధికరణన్యాయము ఇచట సంచరించి బహువచన మున్నచోట మూడిటిని చెప్పును. వివాహచతుర్థరాత్రినుండి మూడు రాత్రులు సమావేశనము జరుగును కనుక దానితో భర్తగోత్రము వచ్చునని గ్రంథాశయము. కాని యీశ్లోకమున 'చతుర్థేఽహని' అనునది వ్రాత పొరపాటనియు చతుర్థ్యహని యని యుండె ననియు నే నభిప్రాయపడు చున్నాను. ఇట్లుండగా ౨౦ శ్లోకమున సప్తపదితో పితృగోత్రత్యాగము కనబడుచున్నది. సప్తపదిలో గోత్రత్యాగ మయి చతుర్థిలో భర్తగోత్రము వచ్చితే యీమధ్యకాలము మూడుదినములకు తక్కువ సాధారణముగా నుండదు గావున నీమధ్య కన్యకు ఏగోత్రమును లేదనియేనా తాత్పర్యము? అని ప్రశ్న కలుగుచున్నది. ౨౦-౧౪ శ్లోకము లొక్క తాత్పర్యమునే చెప్పుచున్నవి. ౧౬ భర్తగోత్రప్రాప్తి సమావేశనమున జెప్పుటచేత అది విషయాన్తరము. కావున విరోధము లేదు కాని మధ్యకాలమున నేగోత్రమూ లే దనవలసివచ్చినది. ఇందు ఉన్నగోత్రము విడిచినచోటను అన్యగోత్రప్రాప్తి చెప్పలేదు. "భర్తృగోత్రేణ కర్తవ్యం దానం పిండోదకక్రియా" అని ౨౦ శ్లోకములో విధివాక్య మున్నది. తక్కినరెంటిలోను విషయము చెప్పుటమాత్రమే కలదు. చేయవలసిన దన్నవిధివాక్యము లేదు.

దీనినిబట్టి ఆలోచించితే పిండము, ఉదకదానమును చేయవలసిన అవసరము కన్య బ్రతికియుండగా గలుగదు కావున ఒకవేళ దైవాత్తు కన్య చని పోతేనే విడిచినగోత్రముతో చేసినకంటె సమావేశనముతో రాబోవు గోత్రముతోనే చేయవలె నని ఋషితాత్పర్యము. ఇచటిగోత్రత్యాగ మంటే గోత్రశబ్దమునకు అర్థము గృహ మని చెప్పవలెను. తండ్రియిల్లు సప్త పదితో విడిచి భర్తయింటనే యున్నది. రెండర్థములు గోత్రశబ్దమునకుగలవు. ఋషిగోత్ర మొకటి, యిల్లొకటిన్ని. తండ్రిసంబంధము పిల్లకుశారీరకము. భర్తసంబంధము రెండువిధములు. సాంస్కారికము, శారీరకమును. ధర్మ సంపత్తి కర్మమాత్రమువల్ల ప్రారంభించినది. అది సప్తపదితోనే వచ్చెను. అది సాంస్కారికము. శారీరక మైనభర్తృసంబంధము సమావేశనముతోనే వచ్చును. అంతవరకు భర్తృశరీరముతో భార్యశరీరము ఏకముగా నేరదు. ఆతరువాతనే యిద్దఱిని కలిపిన "ధర్మపత్నీసమేతస్య" అముకగోత్రస్య అన్న సంకల్పము చెప్పుచున్నాము. సప్తపది మొదలు సమావేశనమువరకును "అనయా నవోఢయా వధ్వా సహ" అనియే ఆసేతుహిమాచలమున్ను సం కల్పము చెప్పుచున్నారు. దానినిబట్టి సమావేశన మయేవరకుగూడా కన్య వధువే. అనగా పెండ్లికూతురేను. ఇంకా పెండ్లాము (భార్య) కాలే దనియే యూహింపవలెను. కావున శారీరకసంబంధము శారీరకముతోనే విడుచును. సంస్కారసంబంధము ప్రారంభించినందున (సప్తపదితో) పిండోదకక్రియలు సంస్కారములు కనుక ప్రారంభించిన (పూర్తికాకు న్నను) సంస్కారసంబంధగోత్రముతోనే చేయవలెనని తాత్పర్యముచెప్పితే విరోధ ముండనేరదు. సాంస్కారికముకంటె శారీరకము బలవత్తరసంబం ధము. ప్రేతకర్మయు, వివాహకర్మయు కర్మజాతిలోనివే కనుక ఆజాతి కదే ఉపయోగించవలెను. చనిపోవునప్పటికి కన్య భర్తయింటనే యున్నం దున నతనిగోత్రమునకు బలము కనబఱచినారు. కాని నిజముగా భర్తగోత్రము రాలేదు.

"వివాహాదీని కర్మాణి స్మరణాత్పితృగోత్రతః,
పితృగోత్రం పరిత్యజ్య భర్తుః ప్రవిశతే కులమ్."

లఘుహారీతస్మృతి—

ఇచట వివాహశబ్దము గృహప్రవేశమునకే చెల్లును. అగ్నిపురాణము లోని నాల్గింటిలో మూడవది. సప్తపది అంతకుముందుది గనుక దానితో పితృగృహమును విడిచి భర్తృగృహమునకు వెళ్లియున్నది. కాని, యింకా సమావేశనము తరవాయియుండుటవల్ల భర్తగోత్రము (ఋషి) రాలేదు కనుక గృహప్రవేశాదికర్మలు; అనగా స్థాలీపాకము, నక్షత్రదర్శనము, బ్రహ్మచర్యవ్రతము, గంధర్వపూజ, శేషహోమము; కన్యకు తండ్రి గోత్రముతోనే చేయవలెను. స్మరణాత్తని అచట చెప్పుటవల్ల స్మృతి తాత్పర్య మదే యని గ్రహించవలెను. ఇచట కులపదమునకు గోత్రపదము నకుగూడా గృహమే అర్థము చెప్పకపోతే కుదరదు. భర్తగోత్రము ఋషి గోత్రమే యంటే వివాహాదులు తండ్రిగోత్రముతో చేయు మని యేల యనును?

మఱియొకవిశేష మిందు పొడమూపుచున్నది. 'పాణిగ్రహణ మంత్రాభ్యాం' అని ద్వివచన మున్నది. ఇది పాణిగ్రహణకర్మయు అచటి మంత్రము కలిసి రెండని యర్థము చెప్పవలెనా? అట్లయితే మనువులో 'పాణిగ్రహణికా మంత్రాః' అని బహువచన మున్నది. అ దెట్లు? అంటే ఇచట ఆపాణిగ్రహణకర్మ చేయి పట్టుకొనుటయు తన్మంత్రజపము అని యర్థమే. ఇతరత్ర వివాహకర్మకు సంబంధించిన కర్మలన్నీ అని తాత్పర్యము లనవలె.

లిఖితస్మృతివచనములు మూడింటివల్లను కన్య బ్రతికి యున్నపుడు సప్తపని యయినను సమావేశనమువరకును తండ్రిఋషిగోత్రమే యుండును. సమావేశనము మూడురాత్రులలో భర్తఋషిగోత్రము భార్యకు వచ్చు నని తాత్పర్యము చెప్పవలెను.

అట్లంటే లఘుహారీతస్మృతివచనార్థముతో ఐకకంఠ్యము కలుగును. పూర్తిగా నాశ్లోకము చూపుచున్నాను. ౧౭౬ పుట, నాగరి. ఆనందాశ్రమ ముద్రణము. పూనా—

"పరిణీతా యదా కన్యా మృతయోనిః కథం భవేత్,
పితృగోత్రం పరిత్యజ్య భర్తుః ప్రవిశతే కులమ్.
వివాహాదీని కర్మాణి స్మరణా త్పితృగోత్రతః,
సంవత్సరే వ్యతీతే తు తద్గోత్రం నీయతే పునః.
త్రిః పరిక్రమణా దగ్నే ర్హృదయాలంభనా త్తథా,
స్వామిగోత్రేణ కర్తవ్యాః పిండదానోదకాః క్రియాః."

ఇచట 'సంయోగినోశ్చ' అనుప్రమాణవివేకమున ఆరవసూత్రము గమనించుడు. సప్తపదితో నిల్లు దాటి భర్తయింటికి కన్య వెళ్లింది. ఇంకా గృహప్రవేశాదికర్మలు కాలేదు. తండ్రియో తల్లియో చనిపోయినారు. ఆమె ఒక్కర్తెయే ఆతలిదండ్రులకు సంతానము. అయినపుడు పెండ్లి చేయవలెనా? తలిదండ్రులకు కర్మ చేయవలెనా? చేసితే పిల్ల కేగోత్ర మని వ్యవహరించ వలెను? అని శంక గలిగినది.

'యోనిః' అంటే జన్మకారణము అని యర్థము బహువ్రీహిసమాస మగుట జనకులు మృతిపొందినది అని యర్థము. ఇచట 'పరిణీత' అంటే పాణిగ్రహణసప్తపదు లయిన వనుటకే ప్రయోగించినారు; కన్య తలిదండ్రులకు ప్రేతకర్మ తండ్రిఋషిగోత్రముతోనే పదకొండుదినములు చేయవలెను. ఆశౌచము తీరినతరువాత గృహప్రవేశస్థాలీపాకాదికర్మలు తండ్రిగోత్రముతోనే చేయవలెను. అట్లు స్మృతి చెప్పుచున్నది. సంవత్సరమువరకు సూతకము కర్తయుండును గనక చతుర్థి చేయవల్లకాదు. అంతవరకు మాసికములు సహపిండముకూడ కన్య తండ్రిఋషిగోత్రముతోనే

చేయవలెను. సంవత్సరసూతకము సహపిండముతో తీరును కనుక 'సంవత్సరే వ్యతీతేతు' = సంవత్సరం దాటిపోతే, చతుర్థి చేసుకొనవలెను. చతుర్థిలోనే అగ్నికి మూడుప్రదక్షిణములు కన్య చేయవలెను. సంస్కారరత్నమాల ౫౮౭ వ పుటలోనిగ్రంథము చూపితిని. హృదయాలంభనము సమావేశనాంతమందున పారస్కరగృహ్యములో చెప్పబడినది. దానిమంత్రముకూడా అచట జెప్పంబడెను. సంస్కారమువల్ల గోత్రైక్యమును అగ్నిపరిక్రమణము సూచించును. హృదయాలంభనము శారీరకగోత్రైక్యమును సూచించును. ఈరెండిటితో భర్తృగోత్రము వచ్చును. కనుక తద్దినములుమొదలగు కర్మలన్నీ అదిమొదలు భర్తృగోత్రముతోనే తలిదండ్రులకు జేయవలయునని తాత్పర్యము. చూచినారా ? కన్యాదానందగ్గరను, చతుర్థిదగ్గరను విరామము కొంత కాలము కలిగింది. కావున నవి వేరుకాలములందు చేయవచ్చును.

మూడండి సప్తది అయినవెంటనే మఱి ఆలస్యము కాకుండా కన్యాదాతయింటనే వివాహ మంతా జరిపించుట ఆచారము, ఈలాటిచిక్కులకు జడిసియే యనియు, అన్నదమ్ములు లేనిపిల్లను పెండ్లాడరా దనియు లోక వ్యవహారము గలదు. వాటి కిదే కారణ మని యెఱుంగునది.

హృదయాలంభనము—సమావేశనాంతమందు, 'అథాస్యై దక్షిణాంస మధిహృదయ మాలభతే' అనగా కన్యను తన యొడిలోను కూర్చోబెట్టుకొని ఆమెకుడిబుజముమీదనుండి చేయిచుట్టి ఆమెహృదయమున అరచేతినుంచి యీమంత్రము జపించవలెను. కనుక భర్తృగోత్రము సమావేశన మయితేనే వచ్చును. ఇందుకు నిదర్శనముగా గోభిలగృహ్య వ్యాఖ్యానములో "గురుం గోత్రేణాభివాదయతే." అనుసూత్రమున కర్థము గోత్రేణ అంటే తండ్రిగోత్రముతో నని యర్థము వ్రాసినాడు.

ఈ అభివాదనము నక్షత్రదర్శన మయినతరువాత చేయవలసినది. అప్పటివరకు తండ్రిగోత్రమే కలట్లు స్పష్టము. ఆశ్వలాయనగృహ్యమునకు గర్గనారాయణవృత్తిలోకూడా సమావేశనాంతమందే—'పితృగోత్రం విహాయ

పతిగోత్రం భజతే' అనివ్రాసినాడు. సర్వత్రా లోకాచారముకూడా "ధర్మ పత్నీసమేతస్య" అన్న సంకల్పము తెల్లవారితే నాకబలి అగునట్టి యెుద ఔపాసనకాలమం దారంభించుచున్నారు. చదువుకొన్న పురోహితుల నడిగి ఋజువుపుచ్చుకొనుడు.

"ఆర్షం ధర్మోపదేశంచ......స ధర్మం వేద నేతరః" ప్రమాణ వివేకము పదవసూత్రము గమనించుడు. ఇదే తర్కము.

ఇది యిట్లుండ, మార్కండేయవచనము "ఆసురాది వివాహేషు పితృగోత్రేణ ధర్మవిత్" అని చెప్పినదానిలో సప్తపదియై సమావేశనమైనను పితృగోత్రము విడిచినట్లు కనబడదుగదా! "స్వగోత్రా ద్భ్రశ్యతే నారీ ఉద్వాహాత్సప్తమే పదే" యను శంఖలిఖితవచనమునకు గతి యేమి యని ఆక్షేపము వచ్చినది. అవును; సప్తపది యొక్కటే పితృగోత్రత్యాగమునకు కారణ మైతే ఆసురాదులలోగూడా పితృగోత్రత్యాగము కావలసినదే. అట్లయితే మార్కండేయవచనము వ్యర్థ మగును. కావున 'ఉద్వాహాత్సప్తమే పదే' యనుటవల్ల ఉద్వాహానంతరసప్తపదితోనే కాని కేవల సప్తపదితో కాదని యనవలెను. అట్లయినపుడు ఆసురాదులలో క్రయాదిక ములుకూడా ఉద్వాహములే కదా! ఉద్వాహపదమున భార్యాత్వసంపా దక కన్యాస్వీకార మని యర్థము చెప్పినారుకదా! అని ఆక్షేపము స్థిర మైయున్నది. అందుచేతనే అచటిగోత్రశబ్దమునకు గృహత్యాగమే కాని ఋషిగోత్రత్యాగము కానేరదంటే మఱి ఋషిగోత్రత్యాగ మేవివాహము లోనూ లేక సర్వదా కన్య ద్విగోత్ర కావలసినదే యెట్లు కుదురు నని ఒకరు ఆక్షేపించినారు. నాసమాధాన మిట్లు—ఆక్షేపించినవారుకూడా ఈశ్లోకముల కన్నిటికీ సరిపడిన మఱొకయర్థము చెప్పి కుదిరిచితేకదా వారియాక్షేపము సరియగును? వారు ఉద్వాహపదమునకు దానమాత్రమే చెప్పి దానపూర్వక సప్తపదితో పితృగోత్రత్యాగ మంటారు. అట్లంటే గోభిలసూత్రము గర్గ నారాయణవృత్తి హారీతస్మృతి కుదురవు. కావున దానపూర్వకసమావేశ

నమువల్ల పితృగోత్రత్యాగమును, దానభిన్నమైన ఉద్వాహమువల్ల పితృగోత్రత్యాగము కానేరదనిన్ని యొకవిధముగా సమాధానము అగును. స్వమతము కుదుర్చుకొనక యెదుటిమతమును ఖండించితే వితండ. దానిచే వాదము వీఁగిపోవు నని న్యాయశాస్త్రమర్యాద.

వాదప్రతివాదోభయపక్షములయందును ఈచోటి ఉద్వాహపదార్థము దానమే అని యర్థము చెప్పకతీరదు.

ఇది యిట్లుండగా శంఖలిఖితస్మృతిలోని 'స్వగోత్రాద్భ్రశ్యతే' అను శ్లోకముయొక్క పూర్వార్ధమును 'వివాహేచైవ నిర్వృత్తే' యను శ్లోకముయొక్క ఉత్తరార్ధమును కలిపి యొక్కశ్లోకముగా గూర్చి సప్తపదితోనే పితృగోత్రనివృత్తియు భర్తృగోత్రప్రాప్తియు గలవన్నందుకు కొందఱు మధ్యకాలమున నిబంధనకారులు తమగ్రంథములలో జూపినారు. అట్టిశ్లోకము మూలస్మృతులలో లేదు. అట్లయితే 'ధర్మపత్నీ సమేతస్య' యని సంకల్పము సప్తపద్యనన్తరమే చెప్పవలసియుండును. అట్లు ఇప్పటికిని యెవ్వరును జెప్పలేదు; గ్రంథములలోగూడా అట్లు వ్రాయలేదు. కనుక యిది దగాశ్లోక మని నమ్మవలెను. ఈసంగతి తర్కాలంకారుఁడుగూడా గోభిలవ్యాఖ్యలో వ్రాసినాడు.

సింహావలోకనన్యాయమున సమావేశనచర్చ కొంత వసరము. సమావేశన మన్నది గర్భాధాన మని యిపుడు మనవారలు చేయుచున్నకర్మ యే గృహ్యములలో చెప్పినది-అని కొందఱు భ్రమపడుచున్నారు. అట్లు కాదు. గర్భాధానము శిశువునకు సంస్కారము. సమావేశనము స్త్రీసంస్కారము. ఇది వివాహాంగము. సంస్కారరత్నమాల ౯౫౬ పుట—

"బాదరాయణస్తు యద్వివాహోత్తరం చతుర్థ్యాం రాత్ర్యాం ఉపగమనం యచ్చ రజోదర్శనానన్తరం చతుర్థ్యాదిషూపగమనం తదేవ సమంత్రకం నాన్యదితి మన్యతే ప్రథమస్య స్త్రీసంస్కారత్వాత్ ద్వితీయస్య

గర్భాధానార్థత్వాత్ " అని, ౫౮౫ సం. ర. మా. " ఇద ముపగమన మావశ్యకం స్త్రీసంస్కారత్వాత్ " సమావేశనము చెప్పి " ఏతచ్చ రాగ ప్రాప్తసమావేశనాశ్రితం వివాహసిద్ధ్యర్థం క్రమజపయో ర్విధానమ్ " వీటికి వరుసగా నర్థములు—

బాదరాయణుడు వివాహము (నక్షత్రదర్శనాన్తము) తరువాత చతుర్థి నాడు రాత్రి చెప్పిన సంయోగమున్ను రజోదర్శన మయినతరువాత నాల్గవ రాత్రి మొదలగు రాత్రులలో జేయుసంయోగమందుమాత్రము జప ముండ వలెను. ఇతరత్ర యెప్పుడెప్పుడు సంయోగము చేసినను మంత్రజప మక్కర లేదు. ఏమంటే, మొదటిది స్త్రీసంస్కారము, రెండవది గర్భాధానము గనుక. వివాహానన్తరము చతుర్థిలోనిసంయోగము స్త్రీసంస్కారము గనుక తప్పక చేయవలెను. ఇది ఇచ్ఛ ఉంటే చేసేసమావేశనము నాశ్రయించిన జపమున్ను కర్మవరుసయున్ను వివాహసిద్ధికొఱకు– అని సుద.

స్త్రీసంస్కార మనుటవల్ల వివాహభాగ మనకతప్పదు. 'చతుర్థ్యాం పక్వహోమ ఉపసంవేశనంచ'—అని చతుర్థినాడు కంఠతః చెప్పినాడు. సుదర్శనుడు రాగప్రాప్తసమావేశన మని యొకమాట వ్రాసినాడు. దాని తాత్పర్య మేమి? రాగము లేకుంటే వివాహములో సమావేశనము చేయ నక్కరలేదా? అంటే ప్రజాసంపత్తికొఱకే వివాహ మాడుచుండగా రాగములేదని యెట్లు చెప్పగలరు? అట్లనుచు వివాహసిద్ధికొఱకని హేతువు కూడా వ్రాసినాడు. కనుక యిచట విశేష మున్నది.

రజోదర్శనానన్తరము పదాఱుదినములు ఋతుకాలము. అది దాటిన తరువాత వివాహ మారంభింపవలసివచ్చును. అట్లయినపుడు చతుర్థినాటికి అనృతుకాలమే. ఇంచుమించుగ మఱి పదునాలుగుదినములవరకును ఋతు కాలము రాదు. అపుడు వెంటనే వివాహసిద్ధి కావలె నని యిచ్ఛ ఉంటే సమావేశనము చేయవచ్చును. కేవలము వివాహసిద్ధికే, గర్భధారణము కలుగదు. ఇంతలో తొందర ఏల? ఋత్వనంతరమే వివాహసిద్ధీ గర్భాధానముకూడా

సిద్ధించు నని యూరకొని ఋతువు వచ్చినతరువాత "వివాహసమావేశనం ఋతుసమావేశనంచ కరిష్యే" అని సంకల్పించి 'ఆగోహారుమ్' అని వివాహసమావేశనమంత్రమున్ను, 'విష్ణుర్యోనిం కల్పయతు' అను ఋతు సమావేశనమంత్రమున్ను జోడించి సంస్కరించి ఉపగమనము చేయవలెను. కనుక ఋతువులేనికాలమున చేయుసమావేశనము రాగప్రాప్త మని వ్రాసినారు. దీనికే మనుస్మృతిలో—'అన్యత్ర ఋతుకాలేచ మంత్రసంస్కారకృత్పతిః......సుఖస్య దాతా' అనుచోట రాఘవానందవ్యాఖ్యలో "అన్యత్ర మంత్రసంస్కారః వివాహః" అన్నాడు. ఇచట కొందఱికి భ్రమ గలదు. అన్యత్ర అన్నదానికి ప్రథమరజోదర్శనమునకు పూర్వమని యర్థము వచ్చునందురు. వారు ఋతుపూర్వమే సమావేశనసంస్కారము చేయవచ్చు నందురు. అది తప్పు. నిర్ణయసింధు "ప్రాగ్రజోదర్శనాత్పత్నీం నేయాద్గత్వా పతత్యధః" పత్నీగమనము రజోదర్శనపూర్వము చేయరాదు. చేసితే పతితు డగును- అనిన్నీ, ధర్మసింధులో "ప్రాగ్రజోదర్శనాత్పత్నీగమనే బ్రహ్మహత్యాదిదోషోక్తేః కించిత్ప్రాయశ్చిత్తం విధీయతే" అనిన్నీ చెప్పినారు. ఇచట పత్నీశబ్దము గౌణము. సప్తపదిలో తద్ధర్మ మారంభించింది, పూర్తి కాలేదు.

కనుక వివాహములోనే వధూవరప్రథమసంభోగము [సమావేశనము] చేరును. గర్భాధాన మనేది వేరుకర్మ అయితే నాందీశ్రాద్ధము చేయవలసియుండును. గర్భాధాన పుంసవన సీమన్త చౌల మౌంజీ వివాహములలో ప్రారంభమున నాంది చేయకతప్పదు. మనవా రిప్పుడు చేయుచున్న ప్రథమ గర్భాధానములోగూడా ఎందుచేత నాందీశ్రాద్ధము చేయలేదో యెవరికిని తెలియదు. పొరపా టనరాదు. మహామన మనపూర్వులు విధిలేక బాలికా వివాహములు ప్రారంభించినప్పటికీ వధూవరప్రథమసంభోగము స్త్రీసంస్కారము కనుక అది వివాహములోనిభాగమే యనుటచేతను వివాహానకు ముందు

నాందీశ్రాద్ధము ఒకమారు జరిగించినారు కనుక మఱి తదవయవకర్మలకు వేరే చేయరాదని వచన మున్నందునను మానివేసినారు.

> " వివాహాదిః కర్మగణో య ఉక్తో
> గర్భాధానం శ్శుశ్రుమ యస్య చాన్తే,
> వివాహాదా వేకమేవాత్ర కుర్యా
> చ్ఛ్రాద్ధం నాదౌ కర్మణః కర్మణస్స్యాత్. "

అని, కర్మప్రదీపము. అనగా కాత్యాయనస్మృతి. ౬౦౫వ పుట. నాగరి. ఈశ్లోకమునకు రఘునందనసంస్కారతత్త్వమున వ్యాఖ్య, " అంతశబ్దోఽత్ర అవయవార్థః దశాన్తః పట ఇతివత్ " దీనికే ఉద్వాహతత్త్వములో తానే ' ఇతి ఛందోగపరిశిష్టవచనమ్. " వివాహాదిరితి. సమశనీయచరుహోమ-గృహ ప్రవేశ-యానారోహణ-చతుష్పథామంత్రణ- అక్షభంగసమాధానార్థహోమ- చతుర్థీహోమానా మాదిశబ్దేన గ్రహణం. ఏషు వివాహాదిగర్భాధానాన్తకర్మసు ఏకమేవ శ్రాద్ధం కార్యమ్. " ఇచట వివాహపదార్థము సప్తపద్యంతము. ఇందులో చెప్పినవి, మొత్తమయిన సమావేశనాంతసంపూర్ణవివాహములోని ప్రత్యేకకర్మలు. స్థాలీపాకమునకు సమశనీయచరుహోమ మని నామా న్తరము—గృహప్రవేశము, యానారోహణము గృహప్రవేశానకు తనయింటికి కన్యను తెచ్చినపుడు రథ మెక్కుంచుట—చతుష్పథామంత్రణము దారిలో నెచటనైన నాలుగుదార్లు కలిసినచోటు సంభవించితే అచట మంత్రముతో చేయవలసినకర్మ యున్నది—అక్షభంగసమాధానార్థహోమము దారిలో యిరుసు విరిగిపోతే శాంతిహోమము చేసి క్రొత్తయిరుసు బండికి తగిలించి మఱీరావలెను. చతుర్థీహోమ మంటే శేషహోమము. వీటిచివరను గర్భా ధానము అంటే వివాహాంగమైన సమావేశనమే. ఈ ప్రత్యేకకర్మల ప్రారంభమున వేరే నాందీశ్రాద్ధములు చేయ నవసరము లేదు. సప్తపదికి ముం దొక్కమారు చేసితే చాలును అని. మఱియు ' యస్యచాన్తే గర్భాధానం '

అనుచోట అంతశబ్దము అవయవార్థ మని 'దశాంతః పటవత్' అని దాని కుదాహరణముగా నిచ్చి వ్రాసినాడు. దాని తాత్పర్యమే మంటే, సంపూర్ణవివాహములో సప్తపది, స్థాలీపాకము, యానారోహణము, గృహప్రవేశము మొదలగు కర్మ లేలాగు అవయవములో అట్లే దాని చివరను చెప్పిన గర్భాధానము వివాహమునకు అంతావయవమే కాని వేరు కర్మ యయిన శిశుసంస్కారము కాదు- అని. వస్త్రమునకు చివరను బద్దె యనునది యున్నట్లు ఈగర్భాధానము అవయవముగానే యున్నది అని. ఆపస్తంబసూత్రవ్యాఖ్య చంద్రమాడలో "కేచి దసత్యపి రాగే మైథునం కర్తవ్యం జపశ్చ కార్యః కర్మార్థత్వాత్ " అని వ్రాసినాడు. సుదర్శనకారు నకు మతాంతరముగా కొందఱు రాగము (అనృతుకాలమున) లేకున్నను వివాహసిద్ధికొఱకు మైథునము చేయవలెను జపముకూడా చేయవలె నందురు- అని దాని యర్థము.

ఇంతచర్చయున్ను స్త్రీలకు సంభోగార్హవయసే వివాహకాల మని రూఢిచేయుటకును, ఫలానావయ స్సని నిర్ణయముగా, నేగ్రంథమందును చెప్ప లేదనిన్ని తెలియుటకును, అష్టవర్షాదివచనములు అప్రాప్తవివాహకాలిక కన్యాదానమాత్రబోధకము లని గుర్తించుటకును వ్రాయనయినది.

ఇది భర్తృగోత్రప్రాప్తి వివేకమును,
సమావేశనవాదపరిశిష్టివివేకము నన్నది పదవభాగము.

---

# వివాహతత్త్వము

## పదున్నాలుగవ భాగము

---

### యువతీవివాహసాధకవచనవివేకము - పదకొండవది

### సంభోగార్హకాలమే వివాహకాలమన్నందుకు ప్రమాణములు.

౧. మనువు. "పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే" అనుట చేత యౌవనకాలమే భర్తను పొందుకాల మని స్పష్టము. కౌమార మనగా కుమారీత్వము. కన్యా కుమారీ అను శబ్దములు అమరనిఘంటువునుబట్టి పెండ్లి లేనివయసన్న యర్థమునే యిచ్చును కాని బాల్య మన్న యర్థము నివ్వవు.

౨. "సహి స్వామ్యా దపక్రామేత్ ఋతూనాం ప్రతిరోధనాత్" తనకన్యయొక్క ఋతువులను ఆటంకపెట్టినపుడు ఆమెయందు తండ్రి హక్కు చెడును. తండ్రి కున్నహక్కు ఏమిటి? పిల్లను ఒకవరున కిచ్చుటే కదా! ఇందలివిశేషము గమనించవలె. కన్యకు ఋతువులు శారీరకములు. అట్లగుటచేత ఒకరు ఆటంకపెట్టుటకు శక్యము గాదు. కావున ఋతుఫల మైన భర్తృసంయోగమున కాటంకపెట్టుట యని తాత్పర్యము. అనగా తగినవరున కిచ్చి పెండ్లి చేయకపోవుటే. 'ఋతూనాం' అన్నబహువచనము కపింజలాధికరణన్యాయమున మూడింటికే నిల్చును. మూడుఋతువులవరకును కన్యను దానము చేయకుంటే కన్యయందు హక్కు తండ్రికి చెడును. అనగా కన్య స్వయంవరము చేసుకొనవచ్చు నని అభిప్రాయము. ఋతుశబ్దము సంతానప్రయోజకము కనుక ఒకసంతానము కలిగి తిరిగీ సంతానయోగ్యత కలిగేకాలము, ఒకసంవత్సరమునకు తగ్గదు. కావున మూడుఋతువు లంటే

మూడువత్సరము లనియే తాత్పర్యము. "త్రీణి వర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనమ్" అను వచనముతో నైకకంఠ్యము కలుగును.

3. మీదివచనమునర్థము—మూడువత్సరములవరకును తండ్రి ఆజ్ఞలో నుండవలెను—అని. తండ్రి యెవరి కిచ్చునో యని కనిపెట్టవలసినకాలము మూడేళ్లు. ఆలోపున దానార్హత లేకుంటే కన్య కనిపెట్టనవసర మేల? కనుక ఋతుమతీదానము లే దనవల్ల గాదు.

౪. బోధాయనుడు—"త్రీణి వర్షాణ్యృతుమతీం యః కన్యాం న ప్రయచ్ఛతి" మూడుసంవత్సరములు పూర్తిగా కన్యను తగినవరునకు ఇవ్వకుంటే ఒకభ్రూణహత్యాదోషమును బొందును. దానాధికారమే లేకపోతే దోష మతని కెట్లు వచ్చు ననగలరు? కావున దానార్హత ఋత్వనన్తరము కల దనియే.

౫. బృహత్పరాశర—౧౩౦ పుట. నాగరి—"ప్రస్వేదసుభగాం ధాతా శుభ మిచ్ఛన్సముద్వహేత్" స్వేద మంటే ద్రవము "ప్ర" అను దానికి ఎక్కువ యని యర్థము. అధికస్వేదముగల, సుభగాం = యోగ్యమైన యోనికలదానిని, ధాతా- అంటే గర్భము చేయదలచినవాడు అనగా సంతానము కోరినవాడు, శుభ మిచ్ఛన్ = శుభముకోరినవాడై, సముద్వహేత్ = పెండ్లాడవలెను— అనుటవల్ల స్వేదముతోగూడిన యోనిగల్గుట యౌవన ప్రారంభమందే యనియు, ఉద్వాహశబ్ద మచట నుండుటవల్ల వివాహకాలమునకే యౌవనవతి యయినట్లును స్పష్టము.

౬. జైమినిగృహ్యము—"స్నాత్వా మాతాపితరౌ పరిచరేత్తాభ్యామనుజ్ఞాతః జాయాం విందేత అనగ్నికాం."—ఇందుకూడా స్నాతకమయినతరువాత ననుటవల్లను అనగ్నిక యనుటవల్లను ఋతుమతిని పెండ్లాడవలె నన్న యర్థము. స్నాతకము, వివాహమునకు పూర్వము చేయుకర్మయే, కాని, పెండ్లాడి గర్భాధానమునకు ముందు చేయునది కాదు.

౭. 'నగ్నికా తు శ్రేష్ఠా —అని గోభిల. నగ్నిక యనగా ప్రథమ రజస్వల యయి సంభోగయోగ్యత కలది యని యర్థము. ద్వితీయరజస్వల కానిదీ ఋతువు రాదు, సంతానయోగ్యత లేదు. 'అనాగతార్తవా నగ్నికా' అనుట అమరునకుకూడా నకారమున కర్థము సాదృశ్యము చెప్ప వలెను. ఋతువు రాక ఋతుసమానమయిన దశ యని యర్థము చెప్పితే విరోధము రాదు. ఋతువు రాలేదు. సంభోగార్హత ఋతువునందువలె ప్రథమరజస్వలకు గలదు. నకారమునకు సాదృశ్యార్థము భాషలో నున్నది కనుక యీయర్థ మేల చెప్పరా దని నాయభిప్రాయము. పెద్ద లూహించుడు. అట్లు కాక "ఆసన్నరజస్వల=నేడో రేపో ఎదుగవలసినకన్య" అనే యర్థము సర్వాంగీకారమే. నాకును విరుద్ధము కానేరదు.

౮ యాజ్ఞవల్క్య. "లక్షణ్యాం స్త్రియ ముద్వహేత్" వ్యభిచారగుణము లేనిదానిని పెండ్లాడవలెను. ఆగుణ మున్నది లేనిదీ పిల్ల తన మందు దెలియనేరదుగదా. కావున యువతియే కావలెను. లక్షణ మంటే శుభలక్షణములు కలదని కొందఱు వ్యాఖ్యానించిరి. అది తప్పు. లక్షణవతి యని యుండును. లక్షణ్యా అని యుండదు. ఇందుకు నిదర్శనము. మనువులో

"స్వాలక్షణ్యపరీక్షార్థం తాసాం శృణుత నిష్కృతిమ్,
యస్మై మాతా ప్రలులుభే విచరం త్యపతివ్రతా,
తస్యైష వ్యభిచారస్య నిహ్నవ స్సమ్యగుచ్యతే."

అనుచోట లక్షణ్యశబ్దమునకు పతివ్రత యని యర్థము చెప్పకతీరదు. న × లక్షణ్యా=అలక్షణ్యా. స్వ × అలక్షణ్యం- తనవ్యభిచారము అని యర్థము.

౯. మనువు—"సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే" ఆమె దారకర్మరూపమయిన మైథునమునకు ప్రశస్తురాలు. దారకర్మయనగా వివాహము. మైథునశబ్దమునకు అవయవార్థము చెప్పి దంపతులకర్మలకు- అని కొందఱు వ్యాఖ్యానించినారు. బాలికావివాహపక్షపాతముతో నట్లనిరి.

కాని రూఢి అర్థము కుదురుచుండగా అవయవార్థము చెప్పరాదు. వ్యవహార మాధవములో "యథా భర్తుః స్వభోగార్థం స్వశరీరదానాత్ దారత్వం" అనుటచేత దారకర్మ యంతేకూడా సంభోగమే యర్థము చెప్పవలెను.

౧౦. "ఋతుస్నాతా తు యా శుద్ధా సా కన్యేత్యభిధీయతే" అని భారతవచనము. ఋతుస్నానము చేసి పురుషసంపర్కము లేనిది కన్య యనబడును.

౧౧. అభిసంబంధపూర్వక సంప్రయోగముతో కన్యాత్వమునకు నివృత్తి చెప్పినవ్యాకరణమహాభాష్యముకూడాయువతీవివాహమునే చెప్పును.

౧౨. గృహ్యసూత్రము లన్నింటిలోను చతుర్థీకర్మలోనే సమావేశనము చెప్పుట యువతీవివాహమునకు ప్రబలప్రమాణము.

౧౩. 'యోఽకామాం దూషయేత్కన్యామ్' ఇత్యాది కన్యాదూషణదండనము విధించిన స్మృతు లన్నిటివల్లను యువతీవివాహమే స్థిరపడును. బాల్యమందే వివాహ మయినపుడు దూషణకు కన్య యొక్కడను సంభవింపదు. కన్యాదూషణ మనునది కుందేటికొమ్మగును.

౧౪. కానీనపుత్రులనుగూర్చి చెప్పినస్మృతులుకూడా యువతీవివాహస్థాపకములే. సంతానము కనేయీడు వచ్చేవరకును వివాహము కాకుండ నున్నపుడే కానీనులు పుట్టుట కవకాశము.

స్మృతిభాస్కరమందు—

"వివాహహోమే ప్రక్రాన్తే యది కన్యా రజస్వలా,
త్రిరాత్రం దంపతీ స్యాతాం పృథక్ఛయ్యాసనాశనౌ.
చతుర్థేఽహాని సంస్నాతౌ తస్మిన్నగ్నౌ యథావిధి,
వివాహహోమం కుర్యాతాం .............."

" ప్రదానహోమమువేళకు కన్య రజస్వల యయితే ఆమూడురాత్రు లును దంపతులు వేరువేరుశయ్యలు వేరువేరు భోజనములు గలవారై స్నానా నన్తరము ప్రదానహోమము చేయవలె" నన్నవచనము యువతీవివాహమునకు గమకము.

౧౬. వసిష్ఠస్మృతి—" అభుక్తా చైవ సోమాద్యైః కన్యకా న ప్రశ స్యతే ". సోమగంధర్వవహ్నులు అనుభవించనికన్య వివాహమునకు అప్ర శస్త. ఆభోగమునుగూర్చి ఆపస్తంబస్మృతిలో—

"రోమకాలేతు సంప్రాప్తే సోమో భుంక్తే తు కన్యకామ్,
రజో దృష్ట్వా తు గంధర్వః కుచౌదృష్ట్వాతు పావకః" అ.౩ శ్లో. ౬౩.

రహస్యస్థలమందు రోమములు వచ్చినకాలమున సోముడును, రజస్వల యయినకాలమున గంధర్వుడును, స్తనములు పెరిగేకాలమున అగ్నియు కన్య ననుభవింతురు. ఈతరువాతనే వివాహ మన్నందుకు శ్రుతిప్రమాణము.

" సోమో దదద్గంధర్వాయ గంధర్వో దద దగ్నయే,
......................దగ్నిర్మహ్యా మధో ఇమామ్. "

సోముడు గంధర్వున కిచ్చినాడు. గంధర్వు డనుభవించి అగ్ని కిచ్చి నాడు. అగ్ని యీమెను నాకు నిచ్చినాడు—అని ప్రదానహోమమువద్ద వరుడు చెప్పునట్టిమంత్రము కలదు కావున ఋతుమతికే వివాహ మని వేద లింగముకూడా గలదు.

౧౭. వేదమంత్రలింగములు—లింగ మంటే సూచనము. చతుర్థిలోని

" ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేడామహే త్వా,
అన్యామిచ్ఛ ప్రఫర్వ్యం......వ్యక్తాం. "

అని మఱియొకమంత్రమందును గలదు. ప్రఫర్వ్య—అనగా పెద్దపిఱుదులు కలది. వ్యక్తా అంటే స్త్రీచిహ్నములయిన స్తనాదులు బయలువడిన దని

పిల్ల వ్యక్తురా లయిన దని ప్రథమరజస్వల యయినదానిని వ్యవహరించుట లోకసాక్ష్యము.

సప్తపదీమంత్రమున 'సమయావ'—అను ద్వివచనమువల్ల ఒడంబడికలో కన్యకూడా కర్త యగుటచేత బాల్యము గడచిన దనకతప్పదు. బాల్యమున ఒడంబడికల కధికారము శాస్త్రమున లేదుగదా!

సమావేశనమంత్ర—ఆరోహోరు, ముపబర్హస్వ బాహుం—నాతొడల మీదకు ఆరోహించుము, నన్ను కౌగలించుకొమ్ము - ఇత్యాదిసంభోగవర్ణనమే ఆమంత్రమందున్న; అతిస్పష్టముగాగూడా ముందుముందుమంత్రములోనూ గలదు. అది తెలిగించుట అశ్లీల మని మానివేసితిని.

వేదములో సూచన (లింగము) కంటె స్మృతిలో ప్రత్యక్షముగా జెప్పినవిధి గాని నిషేధము గాని బలవత్తరము-అని కొందఱు వాదము పెట్టుకొని తగవు లాడుచున్నారు. అది తప్పు. 'శ్రుతిలింగవాక్య' అను మీమాంసాసూత్రములో శ్రుతి అంటే కంఠతః చెప్పినవిషయము. లింగ మంటే సూచింపబడినవిషయ మని యర్థము. ఒకటేజాతిలో సూచన కంటె కంఠతః చెప్పినది బల మని యర్థము. అనగా వేదములోనున్న శ్రుతిలింగములలో శ్రుతి బలము. అట్లే స్మృతిలోనున్న శ్రుతిలింగములలో శ్రుతి బలము- అనే అర్థము చేయవలెనుగాని వారు అనుకొన్నట్టు వేదములో గాని స్మృతిలోగాని లింగముకన్న శ్రుతియే బల మనుసిద్ధాన్తము సరియైనది కాదు. ఏమంటే ఆన్యాయమునకు విశేష మైన మఱొక న్యాయ మున్నది. ఎట్లంటే—

"అత్యంతబలవంతోఽపి పౌరజానపదా జనాః,
దుర్బలైరపి బాధ్యన్తే ప్రబలైః పార్థివాశ్రితైః."

ప్రబలుడైన రాజు నాశ్రయించినవారు దుర్బలు లైనను స్వతః ప్రబలులైన సామాన్యజనులను బాధించగలరు. వేదము స్మృతి యీరెంటిలో

వేదము ప్రబలము. ప్రబలవేదము నాశ్రయించిన దగుటచే స్వతః దుర్బల మయ్యును వేదలింగము ప్రబలమై దుర్బలమైన స్మృతి నాశ్రయించుటచేత స్వతఃప్రబలమయినకంఠతః చెప్పినవిషయమును (శ్రుతిని) ఓడించును—అని తాత్పర్యము.

దీని ననుసరించియే 'మాతులస్యేవ కన్యా' అనే వేదలింగమును బట్టి "మాతులస్య సుతా మూఢ్వా నరశ్చాంద్రాయణం చరే" త్తని "మేనమామకూతురుని పెండ్లాడరా" దను స్మార్తశ్రుతిని త్రోసివేసి మేనమామకూతురుని పెండ్లాడవచ్చు నని మాధవాచార్యులవారు సాధించినారు. కనుక వేదములో యువతీవివాహసూచన యుండుటచేత స్మృతులలో నొకవేళ కంఠతఃబాలికావివాహము చేయు మని చెప్పినను పాటించరా దని సిద్ధాన్తము.

మఱియు బలాబలాధికరణమందు వార్తికాచార్యుడు—"స్మృతి వైదికలింగయోః విరోధే స్మృతే ర్మూలాంతర సద్భావాత్ వేదలింగానాం చానన్యథాసిద్ధత్వాత్ స్మృతేర్బాధః" అని వేదలింగమే ప్రబల మన్నారు.

౧౮. మాధవీయబోధాయనుడు—"తతశ్చతుర్థే వర్షే తు కన్యాః కుర్యా త్స్వయంవరమ్" అని ఋత్వనన్తరము నాల్గవసంవత్సరమున స్వయం వరము చేసుకొనవచ్చును అన్నవిధి రజస్వలయయినతరువాత పెండ్లి యాడవచ్చు నని చెప్పును. పెండ్లి లేనపుడు స్వయంవర మెందుకు? కనుక స్వయంవరవిధియే యువతీవివాహవిధి యగును.

౧౯. ఋతుమతి యయినదానికి పెండ్లి చేయరాదు- అని నిషేధ మెచ్చటను శాస్త్రమున లేనందుననుకూడా యువతీవివాహాంగీకారము శాస్త్రమున గలదనియే యూహింపవలెను. "ఋతుమత్యాం హి తిష్ఠంత్యాం దోషః పితర మృచ్ఛతి" అనునట్టిదోషమును చెప్పువచనము లన్నియు నిందావచనము లనబడును గాని నిషేధము లనంబడవు. ఈసంగతి మీమాంసాజ్ఞానము లేనివారికి దుర్బోధము.

౨౦. "కన్యా నర్తుముపేక్షేత బాంధవేభ్యో నివేదయేత్, తే చేన్న దద్యుస్తాం కన్యాం తే స్యుర్భ్రూణహాభిస్సమాః"

రజోదర్శనము కాగానే కన్య తనబంధువులతో 'నేను రజస్వలనయితి' నని చెప్పవలెను. అట్లు చెప్పక ఊరుకొనరాదు. చెప్పినతరువాత వారు తగిన వరున కివ్వకపోతే భ్రూణహత్యాదోషము నొందుదురు. అని యందువల్ల ఆమె చెప్పినవెంటనే కన్యాదానము చేసివేసితే భ్రూణహత్యాదోషము రాదు. వచనతాత్పర్యము ఋత్వనన్తరమందు వెంటనే వివాహము చేయవలసిన దనియే కనబడుచున్నది.

ఇది యువతీవివాహసాధకవచనవివేకము-పదునొకండవభాగము.

---

# వివాహతత్త్వము

## పంద్రెండవభాగము

### ఋతుమతీదాన నిందావచనవివేకము - పంద్రెండవది.

మీఁది ప్రకరణమున జూపిన వచనము లన్నియు నేకగ్రీవముగా యువతీ వివాహమును నిరూపించుచున్నను వాటియన్నిటికినీ విరుద్ధము లనుచు బాలికావివాహసాధకములుగా కొన్నిటిని కొందఱు చూపుచున్నారు.

౧. "అష్టవర్షా భవే త్కన్యా నవవర్షా తు రోహిణీ,
దశవర్షా భవే ద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా."

అనువచనము బాలికావివాహసాధకము కానేరదు. మఱేమంటే, యీపరిభాషకు ఫలముగా "కన్యాం దద న్నాకలోకం వైకుంఠం రోహిణీం దదన్" అని చెప్పుటచేత దానమే యీవచనమున జెప్పబడెను గాని వివాహవిషయమే లేదు. మనువు అప్రాప్తవివాహకాలమందు దానమున కనుమతి యిచ్చుటచేత అష్టవర్షాదులు దానకాలము లనియే తాత్పర్యము.

౨. "తస్మాదుద్వాహయే త్కన్యాం యావన్నర్తుమతీభవేత్."

(ఋతుమతి పెండ్లిలేక యుండిపోతే తండ్రికి దోషము వచ్చును కనుక) కన్యను ఋతుకాలమునకు ముందే ఉద్వాహము చేయవలెను. అనగా దానము చేయవలె నని తాత్పర్యము.

౩. "ఋతుమత్యాం హి తిష్ఠంత్యాం దోషః పితర మృచ్ఛతి"

ఋతుమతియైన కన్య పెండ్లికాక యుండిపోతే తండ్రికి దోషము వచ్చును. (అనగా నితరవచనసైక్యముపొంది మూడేండ్లు ఉండిపోతే దోషమని తాత్పర్యము.)

౪. "కన్యా ద్వాదశవర్షాణి యాఽప్రదత్తా వసే ద్గృహే,
బ్రహ్మహత్యా పితు స్తస్యాః............"

పండ్రెండేళ్లవరకు కన్య దానముచేయబడకుండ నింట నుండిపోతే తండ్రికి బ్రహ్మహత్య వచ్చును అనికదా అర్థము? దానముమాత్రము చేసివేసితే దోష మీవచనమువల్ల చెప్పబడదు.

౫. "యది సా దాతృవైకల్యా ద్రజః పశ్యేత్కుమారికా,
భ్రూణహత్యా పితు స్తస్యాః పతిత స్స్యాత్తదప్రదః."

దాతలు లేనందున పెండ్లి కాకుండగానే రజోవతి యయ్యేనేని ఆకన్యతండ్రికి భ్రూణహత్యాదోషము వచ్చును. ఇవ్వనందున పతితుడు గూడా నగును. ఇదియును దానమాత్రమునే చెప్పుచున్నది.

౬. "భ్రూణహత్యా పితు స్తస్యా స్సా కన్యా వృషలీ స్మృతా"

ఇవ్వకపోతే తండ్రికి దోషమున్ను అట్టికన్య శూద్రకన్యతో సమానురాలున్ను అని కొందఱు అర్థము చెప్పుదురు. వృషలీ యనుదాని కర్థము ఇచ్చట నది కాదు. వృష మంటే వీర్యము. లీ అనగా గ్రహించునది. అనగా వీర్యమును గ్రహించునట్టి గుణముకల దని తాత్ప. ఈవచనము అంగిరోవచనము. దీనిలో బ్రాహ్మణులకుమాత్రమే ఋతుపూర్వము దానము చేయవలె నన్న నియమము కనబడుచున్నది.

౭. “పితృవేశ్మని యా కన్యా రజః పశ్య త్యసంస్కృతా,...తస్యాం మృతాయాం నాశౌచం కదాచిదపి శామ్యతి”

సంస్కార మంటే వివాహ మని ప్రతివాదులు చెప్పినర్థము. సంస్కార మంటే దానసంస్కార మని నాయర్థము. దానమేకాక అందులో వాగ్దానముకూడా సంస్కార మని యిదివరకు నిర్ధారించితిని కావునఅప్రాప్త వివాహకాలికదానమే యీశ్లోకతాత్పర్యము గాని వివాహవిషయము లేదు. అట్టికన్య చనిపోతే తండ్రి కాశౌచ మెప్పటికీ తీరదు, అని అర్థవాద.

౮. “యా కన్యా పితృవేశ్మస్థా యది పుష్పవతీ భవేత్, అసంస్కృతా పరిత్యాజ్యా న పశ్యే త్తాం కదాచన, వివాహేచ న యోగ్యా స్యాల్లోకద్వయవిగర్హితా.”

సంస్కారము చేయకుండా కన్య తండ్రియింటిలో పుష్పవతిఅయితే దానిని విడిచిపెట్టవలెను దానికి పెండ్లికూడా చేయవగదు. ఆమె ఇహలోక పరలోకములకు దూరురా లగును. దానితరువాత ‘ఏతాం పరిణయన్విప్రో న యోగ్యో హవ్యకవ్యయోః’ అట్టి అసంస్కృతరజస్వలయగు కన్యను పెండ్లాడిన బ్రాహ్మణుడు దేవపితృకార్యములకు పనికిరాడు. దీనినిబట్టి యిట్టి దోషశ్లోకములన్నీ కేవల బ్రాహ్మణకన్యావిషయములే యని స్పష్టము. అ దట్లుండనిండు. ఈశ్లోకములో ఋతుపూర్వము సంస్కారము జరగక పోతే పెండ్లికూడా చేయరాదు- అనుటవల్ల పెండ్లికాక మరేదో సంస్కార మనియే పొడకట్టుచున్నది. అది దానమైనా కావచ్చును,ఉపనయనమైనా కావచ్చును. పెండ్లియే సంస్కారము అనేవాదము నిలువదు. కావున బ్రాహ్మణకన్యలకుకూడా ఋతుపూర్వము దానమో లేక ఉపనయనమో చేసితే దోష మెట్లు వచ్చు ననంగలరు?

ఋతుమతీదానదోషమును తత్పూర్వము అప్రదానదోషమును జెప్పిన స్మృతు లన్నిటికీ ఒకటే సమాధానము.

ప్రమాణవివేకము ఆరవసూత్రముప్రకారము దోషవచనము లన్నియు నొకచోట చేర్చి ఆమొత్తమునకు వాక్యైకవాక్యత చెప్పి వాక్యార్థము తేల్చవలయును. అట్లు చెప్పితేనే "ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా, యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" (దీనియర్థము మొదటిభాగమున వ్రాయబడెను.) అను మనుస్మృతిప్రకారము సరియైన ధర్మము తెలియును. ఎట్లంటే—వసిష్ఠస్మృతి. 489 పుట. "ప్రయచ్ఛేన్నగ్నికాం కన్యాం ఋతుకాలభయాత్పితా, ఋతుమత్యాం హి తిష్ఠంత్యాం దోషః పితర మృచ్ఛతి. యావచ్చ కన్యామృతవస్స్పృశన్తి, తుల్యైస్సకామా మభియాచ్యమానామ్, భ్రూణాని తావంతి హతాని తాభ్యాం మాతాపితృభ్యా మితి ధర్మవాదః.—ఋతుకాలభయమువల్ల నగ్నికయయిన కన్యనే తండ్రి యిచ్చివేయవలెను. పిల్ల ఉండిపోతే దోషము. (అట్లు ఉండిపోయినకన్యను) సమానవరులు అడుగుచు (కన్య వారిని పెండ్లాడుదునని) కోరుచుండ నెన్ని ఋతువులు సంభవించునో అన్ని భ్రూణహత్యలను చేసినపాపము ఆతలిదండ్రులు పొందుదురు. ఇది ధర్మవాదము. అని యీ శ్లోకప్రతిపదార్థము. ఇందులో తుల్యైః అభియాచ్యమానాం=సమానులడుగుచుండగా, సకామాం=పెండ్లాడుతా నని పిల్ల కోరియుండగా, తండ్రి పిల్ల నివ్వకపోయినప్పుడే ఆభ్రూణహత్యాదోషములు వచ్చును. సరియైన వరులు రానప్పుడుగాని వచ్చుచున్నను పిల్ల కిష్టము లేనపుడుగాని తలిదండ్రులకు ఆదోషములు వచ్చు నని చెప్పుటకు నిమిత్తము లేదు. ఇంత సూక్ష్మమైనయభిప్రాయ మీదోషప్రకరణమున కుండుటచేతనే మఱి ఎచ్చటను లేని 'ఇతి ధర్మవాదః' అనువాక్యము ప్రయోగించినాడు. ఇదే ధర్మసార మని దానితాత్పర్యము.

మఱియు, ఈచెప్పిన వన్నియు నిందలు. అ ట్లెందుకంటే ఇంత దోషమున్న దన్నభయముతో తలిదండ్రులు ఋతుపూర్వమే కన్యాదానము విషయమై శ్రద్ధకలిగి యుండుదు రని అట్లు చెప్పుట ధర్మశాస్త్రమందు మర్యాద. అట్లని మీమాంసాన్యాయము. "నహి నిందా నింద్యం నిందతి కింతు ఇతరస్య స్తుతిః" అనున్యాయము చెప్పుచున్నది. ఋతుమతీదాన నిందవల్ల ఋతుపూర్వదానశ్రేష్ఠతయే ఉద్దేశముగాని ఋతుమతీదాననింద తాత్పర్యము కాదు.

చూడండీ యిట్టినిందలు, వాటితాత్పర్య మేమో గ్రహింపుడు.

"తిర్యక్పుండ్రధరం విప్రం చండాలమివ సంత్యజేత్"

—హారీతస్మృతి.

అడ్డుబొట్టు పెట్టిన బ్రాహ్మణుని చండాలునివలె దూరముగా నుంచవలెను. దీనియభిప్రాయము నిలువుబొట్టు పెట్టుట శ్రేష్ఠ మని చెప్పుట కాని అడ్డబొట్టును నిందించనేరదు.

మఱియు "రుద్రార్చనా ద్బ్రాహ్మణస్తు శూద్రేణ సమతాం వ్రజేత్" = బ్రాహ్మణుడు రుద్రుని పూజించితే శూద్రునితో సమానుడయిపోవును. అని శివపూజానిందవలె నిది కనబడుచున్నది. ఏఋషియైన శివుని పూజించుట కూడదనే యభిప్రాయపడునా? విష్ణునిపూజ ఉత్తమ మని తెల్పుట కట్లు వ్రాయబడుటయే యథార్థము. అట్లే ఋతువు కాకుండనే పిల్లను ఎవనికో తగినవరున కివ్వకుంటే పిల్లకు తనకు దోషము వస్తుందని చెప్పుచున్నపుడు ఒకవేళ పొరపాటునో పరిపాటునో కాలముగడచితే ఋత్వనన్తరము మఱి పిల్లను తగినవరుని కివ్వరాదు, ఆపిల్ల పెండ్లికే పనికిరాదు అంటే యేమిన్యాయము? నిజంగా పెండ్లికే పనికిరా దని తాత్పర్యమైతే ఋత్వనన్తరమందు స్వయంవర మెట్లు విధించినారు ఋషులు? ప్రాయశ్చిత్తము చేసుకొని కన్యాదానము చేయవచ్చు నని యెట్లు విధిం

తురు? కనుక ఆకల్పన లన్నీ శుద్ధావిమర్శమూలకము లని గ్రహింపవలెను. లేక యిచట వివాహ మంటే పితృకర్తృకస్త్రీవివాహ మంటారా?

మఱొకసంగతి. ఋతుమతీవివాహము చేయుచున్న క్షత్రియాదిజాతు లిప్పటికిని గలవుకదా! దోషమే నిజముగా నుంటే వారేల చేయుదురు? వివాహవిషయశాస్త్రము వారి కొక్కటి వీరి కొక్కటి యని లేదు. 'చతుర్ణామపి వర్ణానాం' అని మనువు నాలుగువర్ణములకును ఇదే వివాహ శాస్త్రము అని ప్రారంభముననే చెప్పినాడు. 'సా ప్రశస్తా ద్విజాతీనాం' బ్రహ్మక్షత్రియవైశ్యుల నుద్దేశించి చెప్పినాడు. రాజులు ఋత్వనంతరము కూడా దానవివాహమే చేయుచున్నారు.

కొంద అవివేకులు వారు చేయుచున్నవి గాంధర్వవివాహము లనుచు బ్రాహ్మణులకు గాంధర్వము లేదని వాదించుదురు. మనువు 'షడానుపూర్వ్యా విప్రస్య = బ్రాహ్మణునకు ఈ యెనిమిదింటిలోను మొదటినుండి ఆరువివాహములు ధర్మ్యము' లని నొక్కి వక్కాణించినాడు. అవేవంటే, బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, ఆసుర, గాంధర్వము లని యెఱుంగునది. మనువునకు వ్యతిరేకముగ మఱొకస్మృతి చెప్పినా చెల్లగు. అట్లు చెప్పను లేదు. వీరిపొరపాటుగాని దానిపొరపాటు కాదు. రాక్షసగాంధర్వములు బ్రాహ్మణులకు ధర్మ్యము లని తాత్పర్యము.

ఇదిట్లుండనిండు—బాలికావివాహవాద మొకటి, ఋతుమతీవివాహవాద మొకటియుకదా! మనుస్మృతిలోని 'అప్రాప్తసమయాం తస్మై కన్యాం దద్యా' త్తనువచనమున కిద్దఱును తాత్పర్యము సరిపెట్ట జాగ్రత కలవారే. బాలికావివాహవాదులకు ప్రాప్తకాలము ఏది? అప్రాప్తకాలమేది వివాహమునకు? అని నే నడుగుచున్నాను. నాపక్షమున సంభోగార్హకాలము ప్రాప్తకాలము. తత్పూర్వము అప్రాప్తకాలమున్ను. 'అష్టవర్షా భవేత్కన్యా' ఇత్యాదివచనములనుబట్టి వారిపక్షమున ప్రాప్తకాలము ఎనిమిదేళ్లు మొదలుకొని యని యందురు. వారిమతమున అంతకుముందు కాలము

అప్రాప్తకాలమే. కంఠతః అప్రాప్తకాలమని చెప్పువారు వివాహకాలమని దాని ననలేరు. అట్లంటే చెల్లదు. అప్రాప్తకాలమునందు దానమాత్రమే వారును చెప్పకతీరదు. అట్లే అష్టవర్షాదివచనములకు నేను తాత్పర్యము వేరుగా జూపినపుడు అవి దానకాలమేకాని వివాహకాలము కానేరదు. నా సమాధానమేమంటే మనువచనమున అప్రాప్తకాలమందు దద్యాత్తని దానమే చెప్పబడిన దనిన్ని అష్టవర్షాది పరిభాషలకు గూడా 'కన్యాం దద న్యాకపృష్ఠం' అని దాన విషయమే చెప్పుటచేతను అవన్ని దానపరములే యగును. కావున వీరు చెప్పినది వివాహ ప్రాప్తకాలమే కానేరదు. దాన మొకమారు వివాహము మఱికొంత కాలమునకును చేయుటా యని వీరు ప్రశ్నింపరాదు. వీరు ఎనిమిదేండ్లలోపు బాలికకు అప్రాప్తవివాహసమయమని వప్పుకొని దానమాత్రమే యపుడని అంగీకరించినారుగా! ఎనిమిదేండ్లలోపున దానమాత్రము చేసి యెనిమిదేండ్లతరువాత వివాహ మెట్లు చేయవచ్చునని యంగీకరించిరో అట్లే ఋతుపూర్వము దానమాత్రము ఋత్వనంతరము వివాహము అని నేనంటే యెట్లాక్షేపింతురు? అన్నిచోట్లను దానపదము లున్నవి కాని వాటిలో వివాహపదములు లేవు. కావున దానమే అనక వివాహముగూడా నని యెట్లు చెప్పనగును? దానము వివాహసాధనము. వివాహము వేరుకర్మ. సాధనము-సాధ్యమును ఒకటే యన్నవారు అవివేకులు.

'ప్రదానం ప్రాగృతోః'—అను గౌతమసూత్రములోని ప్రదాన శబ్దమునకు వాగ్దానమని యర్థము చెప్పవచ్చును. "ప్రక్రాంతం దానం వాగ్దాన మిత్యర్థః" అని మాధవాచార్యులవారు కన్యాశౌచప్రకరణమున వ్యాఖ్యానించియున్నారు. అదే నే నిచట చెప్పుచున్నాను. కావున ఋతుపూర్వము వాగ్దానకర్మ. సంస్కారము కన్యకు జరిగించితే ఏవిధమయిన దోషములును ఉండనేర వని సిద్ధాన్తము.

నిజంగా ఋతు వగుటయే దానవివాహములకు యోగ్యత లేకుండును. అంటే కన్యాదోషములలో ఋతుమతీత్వముకూడా ఒకదోషముగానే ఋషులు చెప్పియుందురు. అట్లెచ్చటను చెప్పలేదు.

"దీర్ఘకుత్సితరోగార్తా వ్యంగా. సంస్పృష్టమైథునా,
ధృష్టాఽన్యగతభావాచ కన్యాదోషాః ప్రకీర్తితాః."

దీర్ఘరోగము, అసహ్యరోగము, అంగవైకల్యము, పురుషసంపర్కము, గయ్యాళితనము, మఱొకనిని పెండ్లాడుట కుద్దేశించుట—ఇవి కన్యాదోషములు. అట్టికన్నెను పెండ్లికి అడుగరాదు, అని తాత్పర్యము. ఋతుమతి నడుగరాదని యేల యిందులో నుటంకించలేదు? మఱియెచటను లేదేల?

ఇది ఋతుమతీదాననిందావచనవివేకము, పంద్రెండవభాగము.

# వివాహతత్త్వము

## పదుమూడవ భాగము

### స్త్ర్యుపనయనమీమాంస – పదుమూడవది

ఉత్కృష్టుడు, అభిరూపుడు, సమానుడు నగువరుడు అడగవచ్చితే అప్రాప్తకాలమున దానము చేయవలెను. దానమువల్ల అసంస్కృతరజస్వలాత్వదోషము పోవును. అనుదానిపై బాలికావివాహవాదుల ఆక్షేపమేమంటే—అట్టివాడుగ రానపుడు దొరకనపుడును దానము జరగనందున దోషము యౌవతీవివాహపక్షమున నెట్లు పాపుకొనవచ్చునని. దానికి నా సమాధానము—దానమునకు దొరకనిస్థితిలో వివాహమునకుగూడా దొరకరే! వివాహము ఋతుపూర్వ మెట్లు జరుగును? జరుగనపుడు వారికన్యలకు మఱొకసంస్కారము లేనందున వారును కన్యలును గంగాప్రవేశము చేయవలసినదే. నాపక్షమున స్త్రీల కుపనయనసంస్కారముండుటవల్ల నట్టి దోషమే రానేరదు.

స్త్రీల కుపనయనము కలదా? అని ప్రశ్న. లేదని యెవరన్నారని సమాధి. మనువు. అ ౨ శ్లో ౨౬. నిషేకాదికర్మలచేత శరీరమును సంస్కరించవలయును. పురుషులకును స్త్రీలకును శరీరశుద్ధి యవసరమే. ౨౭ శ్లో. పాపనివృత్తికరసంస్కారములు చెప్పినాడు. ౨౮ లో శరీరము బ్రాహ్మమగుటకు సంస్కారము చెప్పినాడు. ౨౯ జాతకర్మ నారంభించి, యాయా కాలములందు నాయాకర్మలు ఉపనయనమువరకు నిర్ణయించినాడు. ఇంతలో ౬౪ శ్లోకము లయినవి. ౬౫-వ శ్లోకమున కేశాంతకర్మ చెప్పినాడు.

బ్రాహ్మణునకు ౧౬ వ యేటను, క్షత్రియునకు ౨౨ వ యేటను, వైశ్యునకు ౨౪ వ యేటను కేశాంతకర్మ చేయవలెను. దీనికగువాని శ్లోకము——

“ అమంత్రికా తు కార్యేయం స్త్రీణా మావృద శేషతః,
సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథాక్రమమ్. ”

ఇంతవరకు జెప్పినకర్మ లన్నియు శరీరసంస్కారముకా అవు స్త్రీల కున్ను ఆయాయాకాలములయందు అమంత్రకముగా జేయవలెను. ఇచట కొందఱు ఉపనయన కేశాన్తకర్మలు వినాగా మిగిలినవే స్త్రీల కని వ్యాఖ్యానించినారు. మూలకారుడు, అశేషతః=అన్నియు, మిగులకుండ చేయవలసిన పని వ్రాసితే వ్యాఖ్యాకారు లట్లనుట వారికాలమున జరుగు చున్నయాచారమునుబట్టి యిట్లని రని యూహించనగును. యాజ్ఞవల్క్యుడు చెప్పలే దని వీరును తదనుగుణముగా వ్యాఖ్యానించిరి. మనుమతముమాత్రము అన్నియు జేయు మనియే. ఈ కేశాన్తకర్మకు పూర్వమే ఉపనయనము చెప్పినాడు. కనుక అమంత్రక మైనయుపనయనము స్త్రీలకు మనువు అభి ప్రాయపడినాడు. కేశాంతకర్మకూడా స్త్రీలకు కలదు. పురుషులకువలె క్షౌరము చేయనక్కరలేదు. క్షౌరప్రసక్తి కలకర్మలలో నెల్ల రెండంగుళ్ళ ములచివరలు కత్తిరించితే స్త్రీలకు సంస్కార మగును. చౌలము స్త్రీలకు చేయించుట కంగీకరించినవారికి ఈసంకోచ మేల కలిగెనో ? స్త్రీ లయితే మాత్రము శరీరశుద్ధి యక్కరలేక పోవునా ? సంస్కారములు శరీరశుద్ధికే యని శాస్త్ర మేల చెప్పెను ?

ఈ కేశాన్తమువరకు కర్మలు చెప్పి వివాహముమాత్రము స్త్రీలకు వేదమంత్రములతోనే చేయు మన్నాడు. పురుషుల కుపనయనముతో వేదాధి కారము గలిగినట్టు స్త్రీలకు వివాహముతో ఆయధికారము కలుగును. ౬౭ శ్లో.

“ ఏష ప్రోక్తో ద్విజాతీనా మౌపనాయనికో విధిః,
ఉత్పత్తివ్యంజకః పుణ్యః కర్మయోగం నిబోధత. ”

వివాహవిధి స్త్రీలకు సమంత్రకమే. అని చెప్పి యీవిధి ద్విజత్వమును సంపాదించును. పురుషునకు ఉపనయనముతో వేదమంత్రము చదువుట కధికారము వచ్చునట్లు స్త్రీలకు వివాహముతో మంత్రాధికారము వచ్చును. అమంత్రకోపనయనమువల్ల శరీరశుద్ధియు వివాహమువల్ల మంత్రాధికారమున్ను స్త్రీలకు వచ్చుననిన్నీ పురుషుల కుపనయనముతోనే వేదాధికారము వచ్చును. అనిన్నీ తాత్ప.

'ద్విజాతీనాం' అనుమాటకు ద్విజస్త్రీలకు అని అర్థము చెప్పి వివాహమే ఉపనయనమువంటిది అనుటచేత మఱి స్త్రీల కుపనయనము లేనే లేదు. వివాహమే యుపనయనస్థానమందు చెప్పినారు. అని బాలికావివాహవాదులు అందురు. నేనను దేమంటే—స్త్రీలకు వివాహము సమంత్రకముగానే చెప్పుటవల్ల తుల్యజాతియగు సమంత్రకోపనయనమునకు బదులుగా స్త్రీలకు వివాహము వచ్చిన దని యీమనుతాత్పర్యము. అమంత్రకోపనయనముతో నీశ్లోకమునకు సంబంధమే లేదంగును. అమంత్రకోపనయనముకూడా లేదని వారందురు. అమంత్రకోపనయనఫలము శరీరశుద్ధి, ఈవివాహఫలము—వేదమంత్రాధికారసిద్ధి. ఫలభేద మున్నందున వేరే చేయవలె నందును. రెండును ఈవివాహమే చేయు నని వారందురు. కావచ్చును గాని వివాహకాలమునకు పురుషుడు ఉపనయనమువల్ల ద్విజు డయినాడు. స్త్రీల కుపనయనము లేదంటే శూద్రస్త్రీయే అయినది.

కనుక ద్విజస్త్రీలు పెండ్లికాలమునకు శూద్రలే. వారినే పెండ్లాడుచున్నారు ద్విజు లనవలసివచ్చును. వివాహ మంతా అయినతరువాతగదా తత్ఫలమైన ద్విజత్వము వచ్చును. వివాహప్రారంభకాలమునకు ద్విజత్వమెట్లు వచ్చు నందురు?

ఈశ్లోకమునమున్న 'ఏవః' అనుదాని కర్థము ఇది యని. ఇదంటే ఆదగ్గరనే 'వైవాహికో విధిః' అనుదానితో సంబంధము వారు చెప్పుదురు. అనగా నీచెప్పిన స్త్రీలవివాహవిధి 'ఔపనాయనికః' ఉపనయనవిధి. అని

వారియన్వయము. అట్లు కాదు అంతకుముందు చెప్పిన ఉపనయన మంత్ర టిని 'ఏషః' అనునది తీసుకొని 'ఔపనాయనికః' అనుదానితో కల్పి ద్విజాతీనాం=ద్విజులకు, స్త్రీలు పురుషులు కూడాను—ఉపనయనవిధి యింతవరకు చెప్పితిని. కర్మయోగము చెప్పెదను వినుము అని మనువునభి ప్రాయమనినే నన్వయింతును. కర్మయోగప్రకరణము నెత్తుకొనుటసూచించు చున్నాడు కనుక 'ఏష' అనుదాని కర్థము ఉపనయనప్రకరణమే యనుట సరసము. అనగా ఇక్కడి కుపనయనప్రకరణ మయినది. ఇక కర్మయోగ ప్రకరణం వినం డని తాత్పర్యము.

దీనితరువాతి శ్లోకము తమవాదమున కనుకూల మని వా రందురు. "పతిసేవా గురౌ వాసః, గృహార్థోఽగ్ని పరిక్రియా." పురుషబ్రహ్మచారికి గురుకులవాసము అగ్నికార్యము గలవు. వాటికి బదులు స్త్రీలకు పతిసేవ, గృహకృత్యమున్ను అగుచున్నవి. అనుటచేత ప్రత్యేకోపనయనకర్మ స్త్రీలకు లే దందురు. నేనంటాను వారికి మంత్రములు గురువువద్ద చెప్పుకొన నవసర మున్నందున గురుకులవాసము కలదు. వీరికి అది అవసరము లేదు. గురువుకు భిన్నముగా వారి కగ్నికార్య మున్నది. భార్యకు భర్తకు భిన్నముగా నగ్నిపరిక్రియ లేదని తెల్పుట కది వ్రాసిరి. ఉపనయనము లే దనునర్థము వచ్చుట కీమాట వ్రాయలే దందును. ఇదికాక వారివాదములో గొప్పతప్పి దము కలదు. ఎట్లన? వారియర్థమువల్ల గురుకులవాసము లేనట్లు అగ్ని పరిచర్యకూడా లేనట్లే యర్థతాత్పర్యము తేలును. 'పాణిగ్రహణాది గృహ్యం పరిచరేత్' త్తన్నసూత్రమువల్లను, పత్ని సహధర్మచారిణియగుట వల్లను, 'ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని' అని ఉభయకర్తృత్వము చెప్పుటవల్లను, "స్త్రీలకు అగ్నిపరిచర్య లేదు, దానికిబదులు గృహ కృత్యనిర్వహణమే" అంటే అసంగతము.

ఇంతకూ ఇతరగ్రంథములలో నుపనయనము స్త్రీలకు జెప్పకుంటే కదా మనుస్మృతి కది తాత్పర్యము కాకపోవును. చూడండి—

"పురాకల్పే తు నారీణాం మౌంజీబంధన మిష్యతే,
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా."

పూర్వకాలమందు స్త్రీల కుపనయనము, వేదాధ్యయనము, గాయత్రీ జపము కలవు. వ్యాఖ్యానములో కల్పాంతరమందు అని అర్థము వ్రాయుట వల్ల ఈబ్రహ్మకల్పములో లే దనిన్ని యితరకల్పములో నుండే దనిన్ని తప్పుటర్థము చేసికొనిరి. అది కాదు—

"విధి ర్యోఽనుష్ఠితః పూర్వం క్రియతే నైవ సాంప్రతమ్,
పురాకల్ప స్స యద్వచ్చ విధవాయా నియోజనమ్."

ఈకల్పములోనే, విధవానియోగమువల్ల పాండుధృతరాష్ట్రులు పుట్టినారు. మనుస్మృతిలో నియోగవిధి వ్రాసియున్నది. మనుస్మృతి యీకల్పమునకు జెందినస్మృతి యయియున్నది.

శ్లోకార్థ మిట్లు—ఈకల్పమందే పూర్వకాలమున చేసి యీకాలమున మానివేసిన పనికి పురాకల్ప మని పేరు. విధవానియోగమువంటిది అని. కనుక యీకల్పమందే స్త్రీలకు పూర్వ ముపనయన మున్న దనుటకు సందేహము లేదు. మనుస్మృతివ్రాసినకాలమునకు మంత్రములతో నుపనయనము లేదు. కేవలము అమంత్రకమయిన ఉపనయనమే. వేదము చదువు నధికారముమాత్ర మున్నది. అది వివాహముతోనే సిద్ధించు నని వ్రాసినాడు. యాజ్ఞవల్క్యకాలమునకు గ్రంథములోగూడా మానివేయుస్థితికి వచ్చినది. పూర్వమనుస్మృతిలో లేని వెన్నో మధ్యకాలములో దూర్చినారు. చూ. ప. వి. సూ. 3.

మాధవాచార్యులవారు పురాకల్పశబ్దమున కర్థము కల్పాంతరమందు అని వ్రాసినారు. దానియర్థము ఇతరకల్పమందు అనుకొని కల్ప మంటే బ్రహ్మకల్పము, వరాహకల్పము అనేచోట్ల కల్పశబ్దమువంటి దనుకొని

కొందఱు తప్పుదారి త్రొక్కిరి. ఏమీ బోధాయనకల్పము, ఆపస్తంబ కల్పము అన్నట్లు గ్రంథనామ మనరాదా? కొన్నాళ్లు కొన్నికల్పములు వాడుకలో నుండి తరువాత నితరగ్రంథములనుబట్టి కర్మలు చేసుకొనుట పరంపరాగతము. మున్పూర్వము బోధాయనుడు చెప్పినగృహ్యము వాడుక చేసేవారందఱు నిపుడు ఆపస్తంబగృహ్యము వాడుక చేయుచున్నారని పెద్దలనుదురు. అట్లు ఉపనయన ముండెననుటకు,

వైద్యనాథీయమున—“స్త్రీణామప్యుక్తకాలాతిక్రమే ప్రాయశ్చిత్త మాహ కాత్యాయనః—

“సంస్కారా అతిపద్యేరన్ స్వకాలే చేత్కథంచన,
హుత్వైతదేవ కర్తవ్యా యే తూపనయనాదయః.”

అని స్మృతిముక్తాఫలమందు వ్రాసినాడు. “యేతు ఉపనయనాదయః”=ఉపనయనము మొదలయిన కర్మలు సకాలమున స్త్రీలకుగూడా ఏకారణముచేతనైనా తప్పిపోతే ప్రాయశ్చిత్తహోమము చేసుకొని ఆకర్మ చేయవలెను- అని దానియర్థము. ఉపనయనమే లేకుంటే ఉపనయనాదు లని యెట్లనును? చౌలాదులు అనవలె.—గోభిలసూత్రే.

“ప్రావృతాం యజ్ఞోపవీతినీం అభ్యుదానయన్ జపేత్
పదా ప్రవర్తయంతీం వాచయేత్”

యజ్ఞోపవీతము కలది యని మూలములో నుంటే వ్యాఖ్యాకారుడు తనకాలాచారమునుబట్టి యజ్ఞోపవీతమురీతిగా ఎడమభుజముమీద పైటవేసుకొనేది అని వ్రాసినాడు. ద్రావిళ్లలోను వేగినాట్లలోను కుడిపైటయే వేయుదురు. వారి కిది యెట్లు చెల్లును? కావున ఆవ్యాఖ్య తప్పు. జందెము కలది యనియే యర్థము.

అసలు పరాశరమాధవీయములోనే—

"ద్వివిధాః స్త్రియః బ్రహ్మవాదిన్యస్సద్యోవధ్వశ్చేతి... సద్యోవధూనా ముపస్థితే వివాహే యథాకథంచిత్ ఉపనయనం కృత్వా శిష్టాః కుర్వన్తి."

అని వ్రాసినారు. బ్రహ్మవాదిను లని సద్యోవధువు లని రెండువిధములు స్త్రీలు. ఇందులో బ్రహ్మవాదినులు మంత్రవతుగా ఉపనయనము చేసుకొని గురుకులవాసము చేయుచు ఆమరణాన్తము వేదాంతచర్చతో కాలము గడుపుదురు...సద్యోవధువులకు వివాహము తటస్థించినపుడు ఏలాగో ఒకరీతిని ఉపనయనము చేసి మఱీ వివాహము శిష్టులు చేయుచున్నారు. కనుక విద్యారణ్యులకాలమునకు ఏదో ఒకవిధముగా ఉపనయనము జరుగుతూ ఉండేది. నానాటికి మగవారికికూడా ఉపనయనముతో ప్రయోజనమేమి? మావాడేమి వేదము చదువుకొంటాడా? అని ఉపనయనము మానివేసి పెండ్లి చేయుచున్నవారు బ్రాహ్మణులలోనే కొందఱు కలరు.

"ప్రాప్తా రజసస్సమావర్తనమ్" అనుసూత్రము పూర్వము గృహ్యసూత్రములలో నున్నట్టు బొంబాయిలో అచ్చువేసిన జైమినిన్యాయమాలలో కొంతగ్రంథము ఆపుస్తకము అచ్చొత్తినవారు క్రింద గీతగీసి వ్రాసియున్నారు చూడండి. వారి అభిప్రాయము స్త్రీల కుపనయనము సమంత్రకముగానే యుండేదని వ్రాసినారు.

ఇం తెందుకు? ఆశ్వలాయన గృహ్యసూత్రములో ఇప్పటికిన్నీ ఋగ్వేదస్మర్తలకు కంఠస్థమై యున్న గ్రంథములో స్నాతకప్రకరణమున "ఉపస్థం స్త్రీ" అనువిషయ మున్నది. అది గ్రంథములో నచ్చులో నున్నది. నేను నాగరిలోనూ చూచితిని. చందనము సంస్కరించుటలో స్నాతకు లయినపురుషులు అమంత్రముతో ఫలానా అవయవమున ముందుగా పూసుకొనవలెను. స్త్రీలు ఫలానా అవయవమున పూసుకొనవ్వలెను—అని

నిర్ణయము కలదు. ఉపనయనము లేనివారికి స్నాతక మెందుకు? బ్రహ్మ చర్యము వదలుటకే స్నాతకకర్మ. స్నాతకము వివాహాంగ మని కొందలు భ్రమపడుదురు. అట్లు కాదు. మున్ముందు తేటపఱుతును.

ఈవాదము నంతటినీ రద్దుచేయు ననేవచనము ప్రతివాదులు చూపు చున్నారు. కొందఱివ్యాఖ్యానములో నది ఉదాహరింపబడి యున్నది. వ్యాఘ్రభూతిది అని అందు కలదు. "ఉపాయనోదితః కాలః స్త్రీణా మాహ పితామహః" ఉపనయనమునకు పురుషులకు నిర్ణయించినవయసే స్త్రీలకు వివాహవయస్సు అని దానియర్థము. అది పితామహునిమత మన్నాడు. మనుస్మృతివిషయ మంతయు పితామహుడు మనువుకు చెప్పిన ట్లాగ్రంథ మున నున్నది. వేరే పితామహస్మృతి కానరాదు. ఈ వ్యాఘ్రభూతి స్మృతియు కానరాదు. యాజ్ఞవల్క్యు డుటంకించిన పందొమ్మిదిస్మృతు లలో నీరెండింటిపేర్లు లేవు. కనుక యిది దరిమలాగ్రంథ మయియుండును. ఐనను నేను ప్రమాణవివేకములో జూపిన మూడవ సూత్రముప్రకారము అర్వాచీన మని కాని కుదృష్టితో చేసిన దని కాని అనను. అదియు ప్రమా ణమే కావచ్చును. శ్లోకములో వ్రాసినవిషయము చర్చింతును. పురుషులకు ఫలానాకాలము అని చెప్పనివారు స్త్రీలకుమాత్రము వివాహము ఫలానా కాలము అని చెప్పవలసిన యవసరము కనబడదు. దీని ఉత్తరార్థము— 'స్త్రీణా ముపనయనస్థానే వివాహం మను రబ్రవీత్' ఉపనయనమునకు బదులుగా వివాహము స్త్రీలకు మనువు విధించినాడు అని కొందఱు చెప్పు చున్నారు. నాచెప్పేయర్థ మే మంటే—వివాహము జరిగేకాలమందే ఉప నయనము జరుగవలెను—అని. ఈయర్థము కా దనుటకు వీలులేదు. దీనివల్ల మాధవాచార్యులవారు చూపిన వివాహకాలమందు ఏలాగో ఒకలాగు ఉప నయనము శిష్టులు చేయుచున్నారు— అనునది సరిపడును. రామాయణ సుం దరకాండ సర్గ ౧౪-శ్లో-౪౯. 'సంధ్యార్థే వరవర్ణిని' అని సీత సంధ్యావంద నము చేసే దన్న తాత్పర్యముగల శ్లోక మున్నది. అ దెట్లు?

మని చెప్పవలసియుండెను. అట్లు లేక అందఱికీ దేశకాలవైపరీత్యమువల్ల యోనిమిదేండ్లకు తెచ్చినట్లు కనబడుచున్నది.

కావున నీశ్లోకములకు నేను చెప్పినయర్థమే చెప్పి ఉపనయనము దగ్గరకు వివాహము వచ్చిన దంటే యథాకథంచిదుపనయన మని మాధవాచార్యులవారిగ్రంథము కుదురును.

ఇదంతా పురాకల్పశబ్దమున కర్థము తెలియక చేసినదురంత మన్నందుకు చూడండీ మనువులోనే — 'ద్యూత మేత త్పురాకల్పే దృష్టం వైర కరం' మ్మను, అ. ౯. శ్లో. ౨౨౭. దానిలో పురాకల్పశబ్దమునకు బ్రహ్మకల్పము అర్థము చెప్పవీలులేకుండుటే ప్రమాణము. అందు జూదమువల్ల నష్టపడినందుకు ధర్మరాజు నుదాహరణముగా నిచ్చినాడు. ధర్మరాజు ఈ కల్పమువాడే. కనుక ఉపనయనము ఈకల్పమం దున్న దనియే యర్థము చేయవలె. ఉత్కళబ్రాహ్మణులలో నిప్పటి కొకాచారము కలదు. కన్యాదాతయింటికి వరుడు వివాహమునకై రాగానే తనప్రాతజందెమును తీసి కన్యకు పంపును. కన్యాదాత యిచ్చినక్రొత్తజందెము తాను ధరించును. కన్య ప్రాతజందెము పెండ్లినాలుగుదినములును ధరించియుండును. సమావేశనానంతరము తీసివేయును. కారణముకూడా తీసివేయుటకు వారిలో పెద్దలు చెప్పుచున్నారు. చతుర్థీసమావేశనమునందు వధూవరు లేకశరీర మగుదురు గనుక ఏకశరీరమునకు భర్తజందెముతోనే కర్మసిద్ధి భార్యకును కలుగు నని. 'దంపత్యో స్సహాధికారాత్' త్తన్న గ్రంథముకూడా ఇందుకు సరిపడింది.

'వివాహం చోపనయనమ్' అనుచోటను 'స్త్రీణా ముపనయనస్థానే వివాహః' అనుచోట్లను వివాహ మనగా వివాహప్రయోజకవ్యాపార మగుదానమే చెప్పితే అన్నితగవులున్నూ తెగిపోవును. వివాహపదమున కనేకార్థము లున్నవి. కొన్నిచోట్ల దానమునకు, కొన్నిచోట్ల సప్తపద్యంతమునకు, కొన్నియెడల నక్షత్రదర్శనాంతమునకును పూర్వులు వ్యవహరించి నట్లు ఇదివరకు నిరూపించితిని.

మని చెప్పవలసియుండెను. అట్లు లేక అందఱికీ దేశకాలవైపరీత్యమువల్ల యీనిమిదేండ్లకు తెచ్చినట్లు కనబడుచున్నది.

కావున నీశ్లోకములకు నేను చెప్పినయర్థమే చెప్పి ఉపనయనము దగ్గరకు వివాహము వచ్చిన దంటే యథాకథంచిదుపనయన మని మాధవాచార్యులవారిగ్రంథము కుదురును.

ఇదంతా పురాకల్పశబ్దమున కర్థము తెలియక చేసినదురంత మన్నందుకు చూడండీ మనువులోనే — 'ద్యూత మేత త్పురాకల్పే దృష్టం వైర కరం' మ్మను, అ. ౯. శ్లో. ౨౨౭. దానిలో పురాకల్పశబ్దమునకు బ్రహ్మకల్పము అర్థము చెప్పవీలులేకుండుటే ప్రమాణము. అందు జూదమువల్ల నష్టపడినందుకు ధర్మరాజు నుదాహరణముగా నిచ్చినాడు. ధర్మరాజు ఈ కల్పమువాడే. కనుక ఉపనయనము ఈకల్పమం దున్న దనియే యర్థము చేయవలె. ఉత్కళబ్రాహ్మణులలో నిప్పటి కొకాచారము కలదు. కన్యాదాతయింటికి వరుడు వివాహమునకై రాగానే తనప్రాతజందెమును తీసి కన్యకు పంపును. కన్యాదాత యిచ్చినక్రొత్తజందెము తాను ధరించును. కన్య ప్రాతజందెము పెండ్లినాలుగుదినములును ధరించియుండును. సమావేశనానంతరము తీసివేయును. కారణముకూడా తీసివేయుటకు వారిలో పెద్దలు చెప్పుచున్నారు. చతుర్థీసమావేశనమునందు వధూవరు లేకశరీర మగుదురు గనుక ఏకశరీరమునకు భర్తజందెముతోనే కర్మసిద్ధి భార్యకును కలుగు నని. 'దంపత్యో స్సహాధికారా' త్తన్న గ్రంథముకూడా ఇందుకు సరిపడింది.

'వివాహం చోపనయనమ్' అనుచోటను 'స్త్రీణా ముపనయనస్థానే వివాహః' అనుచోట్లను వివాహ మనగా వివాహప్రయోజకవ్యాపార మగుదానమే చెప్పితే అన్నితగవులున్నూ తెగిపోవును. వివాహపదమున కనేకార్థము లున్నవి. కొన్నిచోట్ల దానమునకు, కొన్నిచోట్ల సప్తపద్యంతమునకు, కొన్నియెడల నక్షత్రదర్శనాంతమునకును పూర్వులు వ్యవహరించి నట్లు ఇదివరకు నిరూపించితిని.

"త్రింశద్వర్షో వహేత్కన్యాం రమ్యాం ద్వాదశవార్షికీమ్,
త్ర్యష్టవర్షోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వరః."

అను మనుస్మృతివచనమున అష్టవర్షకు వివాహము చెప్పినా రందురు. కావచ్చును. 'వహేత్' అంటే కన్యాస్వీకార మని అర్థము చెప్పితే దానాన్తకర్మ యెనిమిదేళ్లకుకూడా చేయవచ్చు నని చెప్పిన నాయర్థ మునకు విరోధించదు. మేధాతిథి దీనివ్యాఖ్యలో — ఇది వివాహప్రకరణ మున లేనందున వివాహవయసును చెప్పదు. ముప్పదికి పన్నెండుకును ఎనిమిదికి యిరవైనాల్గునకును ఉండే వయసు హెచ్చుతగ్గులకంటె, యెక్కువ వయసుతారతమ్యము వధూవరుల కుండరా దనిమాత్రమే చెప్పు ననుచు వివాహవయసునే చెప్పు నంటే తొమ్మిది పది పదకొండు సంవత్సరముల కాలమున వివాహము జరిగించుటకు మనువులో వచనము లే దనవలసి యుండును. ఆతరువాత పదుమూడుమొదలుకూడా చేయుట కభిప్రాయము లే దనవలసివచ్చును—అన్నాడు.

అట్లయినపుడు — 'త్రీణి వర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనమ్' — అని ఋత్వనంతరము మూడేళ్లవరకు తండ్రిఅనుమతిని కనిపెట్ట వలసిన అవసరము కన్య కుండనేరదు. కావున మనువచనాభిప్రాయము సంవత్సరసంఖ్య కాదు, తారతమ్యనిరూపణమే.

శాస్త్రములో బాలికావివాహము అంటే కన్యాదానమువరకే. దానికి వివాహ మని యెట్లు చెప్పె రంటే దానికి స్త్రీవివాహ మని మనువు పేరు పెట్టినాడు. అది తండ్రి కూతురుకే చేసే పూర్ణమయిన వివాహమే. అనగా దాన మిచ్చినతరువాత తండ్రి చేయుపని వివాహమున మఱి యుండదు. అక్కడనుండి కన్యయు వరుడును చేసుకొనేపనులే. ఇపుడు స్థాలీపాకములో కన్యాదాతచేత కొన్నిపనులు చేయించుచున్నా రాచారములో. కాని, అవి దానానికి ముందు చేయునవిగా శాస్త్రమున చెప్పినారు. ఇవి స్థాలీపాక ములో చేయుచున్నపనులు వరుడు చేసుకోవలసినవి—అవి మానివేసినారు.

ఇది స్త్రీల ఉపనయనవివేకము పదుమూడవభాగము

# వివాహతత్త్వము

## పదునాల్గవ భాగము

---

### స్నాతకవివేకము-పదునాల్గవది

సరే! వెనుకటి వాదసారమువల్ల అప్రాప్తకాలమందు దానమాత్రమే యని స్థిర మయినపుడు దానము పట్టినవాడు స్నాతకుడే యయి యుండ వలెను గదా!

దానముపట్టి వివాహమునకు కొంతకాలము కనిపెట్టవలెను. అంత వరకు వీడు బ్రహ్మచారీ కాడు, పెండ్లి కానందువల్ల గృహస్థూ కాడు. దానము పురుషునకు వివాహము కా దనియే మీమతము గాదా!

"అనాశ్రమీ న తిష్ఠేత క్షణ మేక మపి ద్విజః"

అనువచనమునుబట్టి అట్లు ఏయాశ్రమమూ లేక ఉండుట దోషము కదా! ఈదోష మెట్లు మీమతమున వారింతు రని ప్రశ్న వచ్చినది. దానికై యీప్రకరణము వ్రాయుచున్నాను.

ఒకసందర్భములో చెప్పినశ్లోకములో ఒక్కముక్క కత్తిరించి వేరు సందర్భములో దానిని దూర్చి తమమతమునకు సందర్భింపజేసి కన్నులు మూసి మొట్టికాయలు మొట్టి కొందఱు మధ్యకాలపువ్యాఖ్యాతలు మోసము చేయుట పూర్వకాలమున అసిపోయినది. ఈకాలమున ఆపప్పు ఉడకదు. అచ్చులు సులభమై పుస్తకములు సులభముగా దొరకుచున్నవి. సత్యమును వెదకి లోకమున వెదజల్లఁగల విమర్శకులు బయలుదేరిరి. వేమయ్య చెప్పింది వేదము కానేరదు. వినండి.

కలకత్తా - స్మృతిసంగ్రహము, ౩౯౯-వ పుట:

"యో, గృహస్థాశ్రమ మాస్థాయ బ్రహ్మచారీ భవే త్పునః,
న యతి ర్న వనస్థశ్చ సర్వాశ్రమవివర్జితః,
అనాశ్రమీ న తిష్ఠేత క్షణ మేక మపి ద్విజః."

ఇత్యాదిశ్లోకము గలదు.

ఎవడు గృహస్థాశ్రమములో ప్రవేశించి తిరిగీ బ్రహ్మచారి యగునో, అనగా పెండ్లాడి తిరిగీ బ్రహ్మచర్యవ్రతముతో భిక్షాటనాదులు అవలంబించి వేసమును జదువుకొనుటకు పోవునో, అట్టివాడు గృహస్థు చేసేపనులు మానినాడు. స్నాతకను చేసుకొన్నందున బ్రహ్మచర్యమును విడిచినవాడు. కనుక బ్రహ్మచారిధర్మములు మఱి చేయరాదు. కావున వాడు రెండు తప్పులు చేసియున్నాడు. అదిగో అట్టివాడు అనాశ్రమి. అట్లుండరా దని దానితాత్పర్యము. వీడు వానప్రస్థు, సన్న్యాసి కాలేదు. అయినగృహస్థాశ్రమము వదలివేసినాడు. కావున సర్వాశ్రమవివర్జితు డయినాడు. సందర్భము తప్పించినందున తప్పటభిప్రాయము వచ్చింది. దీనివల్ల దానమునకు, వివాహమునకును మధ్య కాలవ్యవధాన ముండరా దని అనుకొనవలసివచ్చినది. స్నాతకము వివాహాంగము కాదు. ఇది ప్రత్యేకసంస్కారము.

గౌతముడు - గర్భాధానము, పుంసవనము.........స్నానము, సహధర్మిణీసంయోగము—అని పది వేరువేరుసంస్కారములుగా చెప్పినాడు. సహధర్మచారిణీసంయోగ మంటే వివాహమేను. గర్భాధానము వేరుగా చెప్పినాడు.

వ్యాససంహితలో — 'కేశాన్తః స్నానం ఉద్వాహః వివాహాగ్ని పరిగ్రహః' అని పదారుకర్మలలో స్నానము వేరుగా చెప్పినాడు. స్నానమునకే స్నాతక మని వాడుక వచ్చినది.

• పెండ్లి చేసుకొనుటకు స్నాతకము చేసుకొన్నాడు. పిల్లను అడిగితే ఎక్కడా దొరకలేదు. వైరాగ్యము వానికి పుట్టలేదు. అట్టివాడేమిచేయవలె నంటే—వైద్యనాథీయమున జాతుకర్ణివచనము—

"అలాభే కన్యాయాః స్నాతకవ్రతం చరేత్, అపివా క్షత్రియాయాం పుత్రానుత్పాదయేత్ వైశ్యాయాం వా"

అని. ఇది బ్రాహ్మణుల నుద్దేశించి చెప్పినవచనము. (బ్రాహ్మణ) కన్య దొరకనపుడు స్నాతకవ్రతము చేయుచుండవలెను. అట్లు చేయలేనపుడు క్షత్రియవైశ్యకన్యలను పెండ్లాడుట యని చెప్పినాడుగదా! స్నాతకవ్రతము చేయుచు ఉండవచ్చు నని స్పష్టముగా జెప్పినందున స్నాతకము చేసుకొంటే తప్పక పెండ్లాడవలె నన్న నిర్బంధము శాస్త్రమున గానరాదు.

స్నాతకవ్రతములు—

"సాయంప్రాత ర్య దశనీయం తేనాన్నేన వైశ్వదేవబలి ముపహృత్య బ్రాహ్మణ క్షత్రియవిట్ఛూద్రా నభ్యాగతాన్ యథాశక్తి పూజయే"

త్తని వైశ్వదేవకర్మ, అతిథిపూజ, నిర్ణీతము. పెండ్లి లేనపుడు భార్యకు బదులుగా పురుషులో స్త్రీలో తనయింట వంట కుంటే ఏల వ్రతములు నడుపరాదు? అట్లు పెండ్లి లేనివాడు చేయరా దని నిషేధ మెచ్చట గలదు? చూపగలరా? లేదు లేదు.

పోనీ అట్లు చేయవలె నని విధి కలదా? యని ప్రశ్నింపవచ్చును. చూడండీ రఘునందనుని ఉద్వాహతత్త్వమందు—

"తేన అకృతదారోఽపి గార్హస్థ్యసంకల్పవాన్ ఆశ్రమాన్తరనివృత్తః గృహస్థధర్మేషు అధిక్రియతే."

ఇతి యజ్ఞపార్శ్వ ఇతి కల్పతరుః- అని వ్రాసినారు. గార్హస్థ్య సంకల్పము గలవాడు, అనగా స్నాతకుడు భార్యను చేసుకొనకున్నను, అంటే పెండ్లి కాకున్నను (ఎప్పటికైనా పెండ్లి యాడదలచియుంటే నని కొందటియర్థము. ఎట్లయినా వాదమునకు ఆటంకము రాదు) ఇతరమైన వానప్రస్థసన్న్యాసాశ్రమములకు వెళ్లనివాడు గృహస్థధర్మములు చేయుటకు అధికారి యయియున్నాడు అని. భార్య లేకున్నప్పటికీ గృహస్థధర్మములు చేయవచ్చు ననుటచేత స్నాతకవ్రతధర్మము లయిన వైశ్వదేవాదికర్మలు చేయవచ్చు ననియే దీనితాత్పర్యము.

ఇందుకు ఋషిప్రమాణములు కావలెను. రఘునందనుడు ఋషి కాడు. పారస్కరగృహ్యసూత్రమున :

"ఆచార్యః, ఋత్విక్, వైవాహ్యః, రాజా, ప్రియః, స్నాతకః, షడర్ఘ్యా భవంతి."

వీ రారుగురును అర్ఘ్య మివ్వతగినవారు. అనుదానిలో వివాహ్యః అనునది వేరుగాను, స్నాతకః అనునది వేరుగాను జెప్పినాడు. వివాహ్యు డంటే పిల్లకుదిరి పెండ్లికి సిద్ధమై వచ్చినవాడు. ఇదే కన్యాదానముముందు పెండ్లిలో పాలు పెరుగు తేనె కలిపి వరునిచేతిలో దాత వేయునది. స్నాతకు డన్నవాడు కన్యనుపెండ్లియాడ వచ్చినవాడు కాడు, బ్రహ్మచర్యము విడిచి పెండ్లి కానివాడు. ఆస్థితిలో కొంతకాల ముండుటకు వీలు లేదంటే యీసూత్రార్థము సరిపడదు.

మీద జూపిన జాతుకర్ణివచనములో ఇట్టివాడుకూడా గృహస్థుడే యని చూపించినాడు. గృహస్థు డంటే పెండ్లాడినవాడే యన్న అర్థమే కాక మఱొక యర్థముకూడా ఉండవలె.

ఖాదిరగృహ్యసూత్రమందు — ౫-వ ఖండ,

"యస్మిన్నగ్నౌ పాణిం గృహ్ణీయాత్ స గృహ్యః ౧.
యస్మిన్వాఽన్త్యాం సమిధ మాదధ్యాత్ ౨."

రెండవసూత్రమునకు వృత్తి ( అర్థము )· "యస్మి న్నగ్నౌ బ్రహ్మచర్యాంత్యాం సమిధ మాదధ్యా త్స గృహ్యః. అస్మిన్పక్షే తత్ప్రభృతి సాయం ప్రాత ర్హోమాని స్యుః, గృహ్య ఏవచ వివాహః."

ఇచట రెండుపక్షములు గలవు. అం దొకపక్ష మే మంటే స్నాతకము తనగురువుగారి యగ్నిహోత్రమున చేసుకొనవచ్చును. తాను వేరుగా అగ్నిహోత్రము చేసి దానిలో స్నాతకము చేసుకోవచ్చును. అంత్యసమిదాధాన మంటే స్నాతకము. ఇ దెందుకు వచ్చిన దంటే బ్రహ్మచారి ప్రతి దినమున్ను అగ్నిలో సమిధలతోనే హోమము చేయవలెను. ఆఖరుసమిధ హోమ మన్నపుడు బ్రహ్మచర్యము వదలునాటిదే. బ్రహ్మచర్యము స్నాతకము చేయనిదీ వదలదు. ఈ మొదటిపక్షమున స్నాతకునకు వేరుగా అగ్ని యుండదు. అట్టివాడు వివాహకాలమందే అగ్నిని స్థాపించుకొనవలెను. ఇదే యిపుడు అమలులో నున్నది. ఈయగ్ని గృహ్య మనంబడును.

ఇక రెండవపక్షము — తాను వేరే అగ్నిని ప్రతిష్ఠించుకొని స్నాతక కర్మ అందులో జరపవచ్చును. ఆయగ్నిని తనయింటికి తేవలయును. అదియు గృహ్యాగ్ని యనంబడును. దానియందు ప్రాతస్సాయం హోమములు చేయవలెను. ఆయగ్నియందే పెండ్లిహోమములు చేయవలెను. ప్రత్యేకాగ్ని మఱి యక్కరలేదు. ప్రకృతకాలమున నిది యమలులేకుండుటకు కారణము బాలికావివాహాచార మే.

గోభిలగృహ్యసూత్రము – ౯౮-వ పుట:

"యదా ఆచార్యాగ్నౌ అంత్యాం సమిధం జుహోతి నాసా

వగ్ని రస్య గృహ్యో భవతి. తదా వివాహాగ్ని రేవ గృహ్యా స్స్యాత్."

గురువుగారియగ్నిలో స్నాతకము చేసుకొంటే అది తనకు గృహ్యాగ్ని కానేరదు. పెండ్లికాలమున గృహ్యాగ్నిని తాను ప్రతిష్ఠించుకొనవలెను.

ఆపస్తంబధర్మసూత్ర, తెలుగు, ౪౨-వ పుట, ౭-వ ఖండ, సూత్ర.

"సమావృత్తో మాత్రే దద్యాత్"

భాష్యం.—"కృతసమావర్తనః వివాహాత్ప్రాగార్జితం మాత్రే దద్యాత్......సర్వేషా మభావే సమావృత్తస్స్వయమేవ" స్నాతకము చేసుకొని యార్జించినధనము తల్లి కివ్వవలెను......ఎవరున్నూ లేకపోతే స్నాతకుడే ఉంచుకొనవలెను.

దీనినిబట్టి యూహించితే స్నాతకమునకు, వివాహమునకును మధ్య కాలము ధనార్జనకు కొంత ఉండితీరవలెను. లేకుంటే ధనార్జనకు అవకాశ మేదీ? ప్రస్తుతాచారము ననుసరించి గ్రంథములు అర్థము చేసితే సరిపడదు.

కనుక గృహ్యాగ్నికలవాడే గృహస్థుడు. పెండ్లి యయినా సరే, కాకున్నా సరే.

స్నాతకులై కొంతకాల ముండవచ్చుననుటకు మీదను చూపినవి కాక మఱియొకప్రమాణమున్నూ కలదు. గోభిల ౧౫-వ పుట-సూత్ర.

"గృహస్థసాధూన్వా"

వ్యాఖ్య.—"గృహస్థాశ్చ సాధవశ్చ. వాశబ్దః స్నాతకాపేక్షయా వికల్పార్థః. తత్ర స్నాతకాః గృహస్థాశ్రమప్రవేశోన్ముఖాః. గృహస్థాస్తు తత్ర కృతప్రవేశాః భార్యాసహితాః."

శ్రాద్ధమందు బ్రాహ్మణార్థ మెవరిని చెప్పవలెను అను సందర్భమున సూత్ర మిది. సాధువులను చెప్పవచ్చును. గృహస్థులను జెప్పవచ్చును. సాధు

వు లంటే స్నాతకులు. స్నాతకు లంటే పెండ్లి చేసుకొనదలచియున్నవారు. బ్రహ్మచర్యము వదలినవారు. గృహస్థు లంటే పెండ్లియాడి భార్యతో కూడి యున్నవారు. దీనినిబట్టి స్నాతక మయినతరువాత వ్రతములు చేయుచు కొన్నా ళ్లుండవలసిన వ్యవధానము లే దంటే బ్రాహ్మణార్థము చేయుటకు కాల మేదీ?

గృహస్థాశ్రమ మంటే గృహ్యాగ్నితో నింట నున్నఅవస్థ. అగ్నిహోత్రము లేనివా డింట నుండక యాత్రాపరు డై యుండవలెను.

ఇది స్నాతకవ్రతవివేకప్రకరణము—పదునాల్గవభాగము.

# వివాహతత్త్వము

## షడ్వైదవభాగము

బాలికావివాహపరిమితివివేకము - పదియేనవది

"తస్మా ద్గర్భాష్టమే శ్రేష్ఠః" అనుటవల్ల ఎనిమిదవయేట వివాహము సిద్ధించును పాణిగ్రహణాదికముగూడ నేల చేయరాదని ప్రశ్న. ప్రశ్నించువారికి ప్రమాణము, ఆశ్వలాయనవచనము—

'రాత్రావహాని వా దానం కన్యాయాస్స్వకృతిర్యదా,
తదానీమేవ హోమ స్స్యా ద్వివాహస్యచ సిద్ధయే...
యావ త్సప్తపదీమధ్యే వివాహో నైవ సిద్ధ్యతి,
సద్యోతో హోమ మిచ్ఛన్తి సంత స్స్యాయముపాసనమ్."

అనుశ్లోకము నుదాహరించి దానము చేసినవెంటనే సప్తపది జరుగవలెను. (పాణిగ్రహణముతరువాతనే సప్తపది) అది జరిగితేనేకాని వివాహము సిద్ధించదు. కనుక వివాహహోమము అంటే ప్రదానహోమము (పేలాలతో) వెంటనే జరుగవలసియున్నది. దానముతో నిలిపివేయవచ్చునన్నమతము దీనివల్ల రద్దయిన దందురు. దీనివల్ల సప్తపద్యంతము జరుగవలసినదే యని తాత్ప.

అందుకు సమాధానము — ఈశ్లోకములో వెంటనే చేయవలసినది అంటే విధిగా చేయవలసినదే అనవచ్చును. అ ...
సిద్ధికొఱకు అని హేతువు చెప్పనేల? దానినిబట్టి యూహిం

చేసినదానము సప్తపది అయేవరకూ సిద్ధించ దనియే తా. ఎపుడు సప్తపది చేసితే అపుడే సిద్ధించనీ యిపుడు తొందరేల అనువారు మానవచ్చును.

మఱియు సత్పురుషులు వెంటనే హోమము చేయు మనుచున్నారు అనకుండా అభిప్రాయపడుచున్నారు అనుటవల్లకూడా చేసివేయుట మంచి దని యుపదేశవాక్య మగునుగాని విధివాక్యము కానేరదు. కావున స్మార్త విధియే యని వాదమునకు తెచ్చితే స్మార్తవిధి వేదలింగముకంటె దుర్బలము. వేదమున సప్తపదీమంత్రములో—"సమయావ సంకల్పావహై" అను ద్వివచనమునుబట్టి కన్య సుదర్శన యైయుండవలెను. అనగా యుక్తాయుక్త వివేకజ్ఞానము కలదైయుండవలెను. కావున సద్యోహోమవిధిని నిరాకరించును. ప్రత్యక్షప్రమాణమువల్ల వడంబడికలో పాలుగొనుటకు బాలికలకు వీలు లేనందున మానాంతరవిరోధము ఈవచనమునకు కలిగినది. కావున ప్రమాణము కా దనవలెను.

మఱియొకసమాధానము:—ఈ శ్లోకములో దానపద మొకటి, స్వీకార పదమొకటి యున్నవి. రెండేల? ఇవ్వడ మున్నదగ్గర నే పుచ్చుకోవడ ముండును, పుచ్చుకోవడ మున్నదగ్గర దాన ముండునుగదా! అట్లు కాదు. స్వీకార మంటే వివాహ మాడుటకు కన్యను తనయధీనము చేసుకొనుట. అది దానమువల్లనుగాని, క్రయముతోగాని యుద్ధాహరణమువల్లకాని కావచ్చును. స్వీకారము అంటే తనయింటికి తెచ్చుకొనుట యని తేలిన ఫలితము. కావున స్వీకార మున్నచోట నంతటను దానమున్న దన్నమాట రద్దు. స్వీకార మున్నచోట దాన ముండవచ్చును. ఇట్లగుటచేత నిచటి దానపదము వ్యర్థమయినది. వ్యర్థపదము కాకుండా దానికి మఱియొక తాత్పర్యము చెప్పవలెను. అ దేమంటే—

ఇచట స్వీకారపదమునకు హక్కును సంపాదించుకొనుటమాత్రము చెప్పక పిల్లను తనయింటికి తెచ్చుకొనుట యని యర్థము చెప్పవలెను. దానమున్ను, స్వీకారమున్ను కలిసి హోమకర్తవ్యతకు కారణములు. 'యదా'

అన్న పదము అందుకే ప్రయోగింపబడెను. ఎపుడు స్వీకారము దానమును ఒక్క కాలమున జరుగునో అపుడే హోమావశ్యకత, ఒక్క దానమాత్రమే జరిగి పిల్లను తనతో కాపురము చేసేయీడు రానపుడు హోమ మవసరము లేదు- అని, "దానం స్వీకృతి ర్యదా" అనుటవల్ల తాత్పర్యము వచ్చును. కావున నేను చెప్పుచున్న 'అప్రాప్తవివాహకాలికదానమునకు సప్తపదీ హోమములకు సంబంధము రవంతయు నీశ్లోకమువల్ల కలుగదు. దీనికి ఫల మేమంటే కన్యాసంస్కారమే. ఇదే స్త్రీవివాహ మని మనువు చెప్పినది. దానప్రతిగ్రహములు జంటలు. స్వీకార మట్టిది కాదు. కనుక రెండుపదములు ప్రయోగించినాడు - అని.

దీనిపై బాలికాపాణిగ్రహణవాదులు చేయు పూర్వపక్ష మొకటి కలదు. నిర్ణయసింధు - బ్రహ్మపురాణవచనము——

"దాతుః ప్రతిగ్రహీతుశ్చ కన్యాదానేచ నో భవేత్,
వివాహయిష్ణోః కన్యాయా లాజహోమాదికర్మణి."

ఇత్యాదిశ్లోకము చూపి దాతృప్రతిగ్రహీతలకును కన్యకు లాజహోమమందును ఆశౌచ మున్నను సద్యశ్శౌచము కలదు. అనగా ఈపనులు ఆశౌచ కాలమందుకూడా జేయవచ్చును. ఆపని చేసినంతకాల మాశౌచ ముండ దని తాత్పర్యము.

ఈ శ్లోకమువ్యాఖ్యానములో సంస్కారరత్నమాలాకారుడు ఇట్లు వ్రాసినాడు, "అత్ర దాతృప్రతిగ్రహీతృగ్రహణం సంస్కార్యసంస్కారకయో రుపలక్షణం చకారా ద్దాతృపత్నీకన్యయోః" ఇత్యాదిగా దాని తెలుగర్థము ముందు చక్కగా మనసున కెక్కించుకొని చదువరులు నా సమాధానము గమనించుడు.

ఈచోట దాత ప్రతిగ్రహీత అని చెప్పుటవల్ల సంస్కరించేవారు సంస్కరించబడేవారూకూడా చెప్పిన ట్లగును. సంస్కరించువారు దాత,

దాతభార్య. సంస్కరించబడునది కన్య. వరుడు సంస్కారమునకు సాధనము. కనుక ఆరెండుమాటలవల్ల దాత వరుడే యర్థము కాలదు. దాత భార్య, కన్య కూడ నర్థము చెప్పవలెను. కన్యలేని దాన ముండదు. ధర్మపత్నితో కలిసి దానము చేయకతీరదు. కనుక ఆనలుగురికీ ఆశౌచము లేదని యీ శ్లోకతాత్పర్య మన్నాడు. వివాహము చేయదలచినసమయమందు లాజహోమముకూడా చేయుటకు ఆశౌచము లేదు అని వచ్చినది. వారీశ్లోకమువల్ల దానప్రతిగ్రహములును లాజహోమాదికర్మలున్ను ఏకకాలమునందే జరుగవలసినవిగా నున్నవి కాని వేరువేరుకాలమందు కావలసినవి కావని తాత్పర్యము చెప్పుదురు. కాని వారివాదము తినుబడిసామానుపెట్టె యను కొని పాములపెట్టెలో ప్రవేశించినయెలుకచందమయినది.

చిత్తగించుడు — ఇచట దాతృప్రతిగ్రహీతృశబ్దములవల్లనే కన్య కూడా అర్థము వచ్చునని వ్యాఖ్య వివరించినది కదా! వివాహము చేసే కన్యకే దానప్రతిగ్రహములుకదా! కావున దాతృప్రతిగ్రహీతృశబ్దముల వల్లనే ఆయర్థముకూడా సిద్ధించుచుండగా 'వివాహయిష్యోః కన్యాయాః' అనుమాట లేల? మఱియు దానకాలమందే లాజహోమాదికము వెంటనే జరుగుచుండినపుడు అప్పటికి లేని ఆశౌచము లాజహోమమునకుకూడా ఉండదుగదా! ఆమాట ప్రత్యేకించి ఉటంకించనేల? అదీ యిదీ వ్యర్థమయి "దానప్రతిగ్రహము లొకపుడు జరుగవచ్చును, లాజహోమము మఱొకప్పుడు జరుగవచ్చును. (ఆకాలమున దాతయు తత్పత్నియు నుండవలసిన అవసరము లేదు.)" అనియే తాత్పర్యము వచ్చేటందుకే అట్లు గ్రంథకర్త వ్రాసినా డని నాయభిప్రాయము. ఇదికాక వివాహయిష్యోః = పెండ్లిచేయ దలచిన, అంటే ఏమి? లాజహోమము చేసేకన్యకు అంటే చాలదా? యీ విశేషణ మెందుకు? అదీ యిదీ యనకుండా లాజహోమమునందు ఆశౌచము లేదంటే చాలును. కావున ఆపదము వ్యర్థమయినది. అట్లు వ్యర్థము కాకుండా వాక్యార్థము కల్పించవలె. ఇతరవచనములకు బాధ రాకుండా ఎంతదూరము తాత్పర్యము చెప్పినా కాదనవల్లకాదు.

ఆతాత్పర్య మే మనగా—

దానకన్యలు రెండువిధములు. దానముచేసి యింట కొన్నాళ్లుండ వలసిన దొకతె. దానముచేసి వెంటనే వరునియింటికి పంపవలచుకొన్నది ఒకతె. దానమునాటి కాశౌచము లేదు. పంపిననాటికికూడా కన్యతలిదండ్రులకు ఆశౌచము వచ్చియుంటే కన్యకు లాజహోమకాలమున కాశౌచముండును. ఆయాశౌచముకూడా లాజహోమకాలమందు కన్య కుండనేరదని ప్రత్యేకించి చెప్పవలసినయవసరము వచ్చినది. ప్రయాణకాలమందే లాజహోమసప్తపదు లవసరము. బాలికావస్థలో దానమాత్రము జరిగి యౌవనావస్థలో లాజహోమాదికర్మ జరుగవలసివచ్చునపుడే రెండు వేర్వేర ముటంకింప నవసరము కావున నీశ్లోకము నాపక్షమునే బలపఱచుచున్నదని నామనవి. వివాహ మంటే యిచట అగ్నిపురాణమున జెప్పిన మూడవ కర్మ గృహప్రవేశాన్తము. కనుక 'విహాయిష్ణ' అనుమాటకు గృహప్రవేశము చేయించదలచుకొన్నదానికి అని యర్థము వచ్చును

కొందఱిలో ననగా యాజ్ఞవల్క్యశాఖవారిలో దానమునకుముందే పుస్తె కట్టింతురు. దీనివల్ల తెలియవలసిన దేమంటే పిల్ల నొకరి కిచ్చివేసిన గుర్తు ఉంటే దేశకాలాదిభయము లే దని అట్లు చేసియుందురేమో యని కొంద అందురు. అట్లు నే ననను. "శత మతిరథం దుహిత్రుమతే దద్యాత్" = వరుడు కన్యాదాతకు నూరు అతిరథనాణెము లివ్వవలెను అను శాస్త్రమునుబట్టి అందును. అతిరథము వీసమెత్తుబంగారునాణె మగుటచేత నూటొక్క వీసము బంగారము పుస్తె చేయించి వరుడు మొదట కన్యాదాత కిచ్చినతరువాతనే ఆబంగారము కన్యకే తండ్రి యిచ్చివేసి వరునకు దానము చేయును. ఈ వేదకాలమునాటియాచార మే వారిలో నిప్పటికిని గలదు. తక్కినవారిలో దానముతరువాతనే పుస్తె కట్టునాచార మున్నది. అది ఏలాగు వచ్చినదో గృహ్యసూత్రములలో లేదు. బహుశః 'శతమతిరథం' అన్నదే దీనికిని విధాయకసూత్ర మని తెలియవలసియున్నది. దాన మయిన

తరువాత తనస్వత్వ మామెయందు కలిగినందుకు గుర్తుగా వరుడు కట్టవలసి యుండును. వెంటనే తీసుకొనిపోయినపుడు ఆపిల్ల తనయింట నుండుటే గుర్తు. పుస్తెగుర్తేల? కావున శాస్త్రములో లేని పుస్తెకట్టుట కవసర మిదే యని కొందఱియూహ. — లేదా ' ఉపస్థితే వివాహే యథాకథంచి దుపనయనం ' అన్నందున నీసూత్రమే మెడలో జందెమునకు బదులుగా నుంతురేమో! దీనిపై కొందఱు మఱొకయాక్షేపము తెచ్చిరి.

'దానమాత్రముతో నాపివేసినచో నేమిప్రయోజనము? ఔపాసనసిద్ధి యయినను లేదుగదా; సప్తపద్యనంతరమందే ఔపాసనసిద్ధి. కావున ప్రథమౌపాసనాన్తము బాల్యమున కర్మ చేయకతీరదు' అందురు. ఫలము బ్రాహ్మణులకు అసంస్కృతరజస్వలాత్వదోషనివృత్తియే యని నేనందును.

వా రేమందు రంటే 'ధర్మప్రజాసంపత్త్యర్థం' అని వివాహసంకల్పము చేసినాము. ప్రజాసంపత్తిఫలము దూరముగా నున్నను ధర్మసంపత్తి ఔపాసనతో సిద్ధించును. అందుచేత నక్షత్రదర్శనాంతము వివాహము బాల్యమందే చేయుట న్యాయ్య మందురు.

నే నంటానూ! అవునూ! కర్మలకు ఆయాయాకాలములలో ఆయా ఫలములు సిద్ధించును. ఆచరణార్హతానర్హతలుకూడా కాలానుసారమే పనులకు ఉండును. ఆయాఋతువులు రానిదీ ఆయావ్యవసాయము చేయరు. భూమి తనకు హక్కు కాగానే అది చేయ సాధ్యము కాదుగదా! అట్లే తమహక్కులోకి తెచ్చుకొనుటయే బాల్యమందు. ఆయాసమయములలో ఆఫలములు. సప్తపది త్రొక్కయీడు రానపుడు వాగ్దానముమాత్రమే చేసి విడువవచ్చును గదా! మీమతమందుకూడా నడక వచ్చినదాకా సప్తపది నిలుపవద్దా? సప్తపదికి నడక రావడ మొకటే అర్హత కాదు సుదర్శనాత్వముకూడా రావలెను. కావున బాల్యమున దానాంతమే అందును, సప్తపదికి అధికారము లే దందును.

ఇట్లు నే ననుటకు నిదర్శనము లున్నవి.

ధర్మసింధు ౪౩౬ నాగరి.—

"ఉద్వాహాత్ప్రథమే శుచౌ యది వసే ద్భర్తుర్గృహే కన్యకా, హన్యా త్తజ్జననీం.....పతించ మలినే" అని.

ఇచట ఉద్వాహ మంటే దానాన్త మని నాయర్థము. పాణిగ్రహణాది సప్తపద్యంత మని వారిమతము. ప్రథమాపసనాన్తకర్మ చేయగానే ఔపాసనాధికారము కలుగును. 'ఆజీవం హోష్యామి' అని ఔపాసనారంభమున సంకల్పించినందున దానిని వదల వీలులేదు. సమష్టికుటుంబమైతే "పిత్రుపాకోపజీవీ వా" అను వచనమున పాకశబ్ద మున్నందున వైశ్వదేవము మానినా మానవచ్చును కాని సంధ్యావందనమువలెనే నిత్యము ఔపాసనము ప్రత్యేకము చేయకతప్పదు. భార్య దగ్గిర లేనపుడు ఔపాసనమునకుకూడా అధికారము లేదు. సమష్టికుటుంబములో అత్తగారు కోడలు కలిసి యుండక మఱెక్కడ నుందురు? తాను చేసుకొన్నపడకటింటిలోనే యుండవలె నంటే మూఢమాసములలో భర్తతో కలిసియుండక మఱెక్కడ నుండును?

పారస్కరగృహ్యంలోని—"ఆవసథ్యాధానం దారకాలే దాయాద్యకాలే వా" అనుటవల్ల వైశ్వదేవానకు అనవసరము అనియే తాత్పర్యము. నిత్యము అగ్నిధారణ మవసరము లేకపోవచ్చును కాని ప్రతిపూటా ఔపాసనము అప్పటికప్పటికి ఉపావరోహణము చెప్పి చేసుకోకతీరదు.

ఈకారణమువల్ల పాణిగ్రహణ మర్థముగా ఇచ్చట ఉద్వాహపదమునకు జెప్పరాదు. దానాన్తమే యయితే ఒకవేళ భర్తయింటికి తీసుకొని వెళ్లినను ఆమూఢమాసములలో తండ్రియింటనో, మఱొకచోటనో ఉంచుకొనవచ్చును- అన్నపుడు ఈశ్లోకము సరిపడును. పాణిగ్రహణమే అంటే వారిమతమునకు విరోధించును. కావున వారివాదము తప్పు. తాము తప్పు

దారి త్రొక్కి, యీశ్లోకము అప్రమాణ మని వారందురు. అట్లనగానే ఏకవాక్యత పోవును.

మఱియు వీరియాక్షేపణలో దానమాత్రము చేసినపుడు ఏమిలాభ మున్నది? ధర్మసంపద లేదు. ప్రజాసంపద యేలాగున్నూ లేదుగదా! అని యందురు. అట్లననేల? అంతకు తగినలాభముకూడా లేకపోలేదు. 'పతిసేవా గురౌ వాసో గృహార్థోఽగ్నిపరిక్రియా' అను వచనములో జెప్పిన పతిసేవ గృహకృత్యనిర్వహణము కొంతలోకొంత చేయవచ్చును. ఏమి! ఇంట ఆడదిక్కు లేనివాడు ఎనిమిదేండ్లపిల్ల యింటిలో నున్నపుడు ఇల్లలికి ముగ్గులు పెట్టగలందుకు, చిన్నబింగెతో చెరువునుండి నీళ్లు తెప్పించుకొనుటకు, తా నింట లేనపుడు ఇల్లు కాచుకొనియుండుటకును, ఒకపశువును సంరక్షించుకొనుటకు ఉపయోగించుకొనరాదా! ఇది గృహ కృత్యనిర్వహణము కాదంటారా? మనుస్మృతిలో 'ధర్మే సీదతి...' అను మాటవల్ల ఎనిమిది పండ్రెండు సంవత్సరములకన్య వివాహము ఇంట గృహ ధర్మము నెరవేర దన్నపుడే చేసుకొమ్మని చెప్పుచున్నది. ఎనిమిదేళ్ల పిల్ల బిచ్చగానికి ముష్టి వేయలేదా? అది ధర్మసంపద కాదా? గృహస్థధర్మమే పత్నీధర్మములు. ఇల్లలుకుట, ముగ్గుపెట్టుట మొదలయినవి కావంటారా? కొంతధర్మసంపద కలదు. ఇతడే తనపెనిమిటి యనియు, ఇతనివల్లనే తాను సంతానము పడయు నూహలు ఎనిమిదేళ్ల దానికికూడా కలుగుత వనియే బాలికావివాహము శ్రేష్ఠ మని వాదించువారు పుత్రసంపదనుగూలపతిప్రేమ కలుగ దనగలరా? కావున ఎనిమిదేండ్లపుడు ఉద్వాహ మన్నపుడు దానాంతకర్మయే యని యర్థము చెప్పినపుడు ఆక్షేపము లేదు.

ఇది బాలికావివాహపరిమితివివేకము — పదియేనవ భాగము.

---

# వివాహతత్త్వము

## పదియారవభాగము

### వాదసారాంశవివేకము

౧. ఏగ్రంథమునకైనా నైయర్థ్యము రానట్లు ఇతరవచనముల కర్థము చెప్పకుంటే ధర్మశాస్త్రసంప్రదాయవిరోధము కలుగును; ఏకవాక్యత చెడును.

౨. భ్రూణహత్యాది నిందావచనములు "తుల్యై స్సకామా మభియాచ్యమానాం" అను వసిష్ఠవచనముతో నేకవాక్యతను బొంది ఆనిమిత్తములు లేనప్పుడు ఆదోషమును జెప్పజాలవు.

3. వరయాచనాది నిమిత్తములు లేనపుడు ఋత్వనన్తరము మూడేండ్ల వరకును ప్రాయశ్చిత్త మవసరము లేకయే దానము చేయవచ్చును. తరువాత ప్రాయశ్చిత్తపూర్వకముగా నెప్పటికైనా దానార్హత కలదు.

౪. సంభోగయోగ్యకాలమే స్త్రీలకు ముఖ్యవివాహకాలము; అంతకు ముందు గౌణకాలము. అదియు దానాన్తమే. ఆరేండ్లలోపున కేవల వాగ్దానమే. తరువాత ఉదకదానాన్తముగూడా అవసర మయితే చేయవచ్చును. చేసినపుడు పిల్లను అవసర మున్నపుడు వరునింటికి పంపనువచ్చును, తండ్రి యింటనే ఉంచుకొననూవచ్చును.

౬. భ్రూణహత్యావచనము లన్నియు దానమాత్రమునకే సంబంధించినవి కాని వివాహముతో సంబంధించినవి కావు. కావున దానమాత్రమే జరిగినపుడు అసంస్కృతరజస్వలాత్వదోషము లేదు.

౭. దానపాణిగ్రహణములకు వ్యవధానము - 'అప్రాప్త సమయాం' అను మనువచనమువల్లనే ముఖ్యముగా వచ్చుచున్నది.

౮. కన్యాస్వీకారమునకే ఉద్వాహ మని విశేషసంజ్ఞ. అది స్త్రీ సంస్కారము. పాణిగ్రహణాదికర్మ వధూవరోభయసంస్కార మగును.

౯. స్త్రీలకుకూడా సకాలమున విధిగా అమంత్రకముగా నైనా ఉపనయనం చేయకతీరదు.

౧౦. సప్తపదితో పితృగోత్రనివృత్తి కాదు, పతిగోత్రము రాదు. సమావేశన మయినతరువాతనే రెండును దానవివాహములలోనే కలుగును.

౧౧. వాగ్దానము వైదికముగా జరిగించినపుడు ఆకన్య మరణించితే వరకుటుంబమువారు మూడురాత్రులవరకూ ఆశౌచము పట్టవలెను. వరుడే అగ్నిసంస్కారము చేయుకర్త. తక్కినకర్మ లేదు. కన్య, ఉదకదానాన్తము జరిగి మరణించితే వరకుటుంబమువారికి పదిరాత్రు లాశౌచ మని కొందఱు. తనయింటికి తెచ్చుకొంటే పదిరాత్రులనిన్నీ తండ్రియింటనుండి పోయియుంటే మూడురాత్రులే యనుట న్యాయ్యము. పదిరాత్రులు వరకుటుంబమువారు పట్టునపుడు పితృకులమునకు పక్షిణీమాత్రమే.

౧౨. స్నాతకము వివాహాంగము కాదు. స్నాతకుడుకూడా గృహస్థులలోనివాడే. అగ్నిహోత్రముకూడా కలదు. స్నాతకుడై వివాహము మానికూడా ఉండవచ్చును. గృహ్యాగ్ని యుండుటే గృహస్థు. భార్యను పెండ్లాడకున్నను గృహ్యాగ్ని యుండును.

ఇది వాదసారాంశవివేకము, పదియారవభాగము.

# వివాహతత్త్వము

## పదునేడవ భాగము

---

### ఇక ప్రకీర్ణవిషయము

౧. సంస్కారదీపమందు—" స్వీకృతాపి అసంస్కృతా సంస్కృతాపి అస్వీకృతా భార్యా నభవతి, విశిష్టస్య వివాహపదార్థత్వా" త్తన్నాడు. దానాదులచేత తనదగ్గిరకు తెచ్చుకొన్నను సప్తపద్యాదికర్మ చేయక పోయినా, వివాహహోమాదికము జరిగి తనదగ్గిరకు దానాదులతో తెచ్చుకొనకున్నను భార్య కానేరదు. రెండూ జరిగితేనే వివాహ మనంబడును. ఇచ్చట స్వీకార మంటే యింటికి తెచ్చుకొనుటయే యర్థము. సంస్కార మంటే సప్తపద్యాది సమావేశాన్తకర్మయే యని నామతము. కేవల సప్తపదియే యని కొంద అందురు. ఈదానికే 'భార్యాత్వసంపాదకగ్రహణం వివాహః' అని రఘునందన భట్టాచార్యులు వ్రాసినలక్షణము అగును. భార్యాత్వమును సప్తపది సంపాదించదు, సమావేశనమే. బీజమును భరించుటచే భార్య.

రెండవ విషయము—

౨. " షడబ్దమధ్యే నోద్వాహ్యా కన్యకా వత్సరద్వయమ్,
సోమో భుంక్తే యత స్తద్వద్గంధర్వశ్చ తథానలః."

పుట్టినదిమొదలు రెండేసిసంవత్సరములు సోమగంధర్వవహ్నులు అనుభవింతురు కావున ఉద్వాహము ఆరేండ్లలోపున చేయరాదు - అని యర్థము

ఇచట ఉద్వాహ మంటే పిల్లను ఉదకదానము చేసి వరునియధీనముచేయుట యని తాత్పర్యము. ఇది యిట్లుండగా—

వసిష్ఠస్మృతిలో—

"అభుక్తా చైవ సోమాద్యైః కన్యకా న ప్రశస్యతే."

అని యున్నది—వీటికి సహాయముగా మీఁదిశ్లోకమువల్ల ఆరేళ్లలోపు దానికి వివాహనిషేధమా ?

ఆపస్తంబస్మృతిలో—

"రోమకాలే తు సంప్రాప్తే సోమో భుంక్తేథకన్యాకామ్,
రజో దృష్ట్వా తు గంధర్వః కుచౌ దృష్ట్వా తు పావకః."

రహస్యస్థలమందు రోమములు వచ్చినపుడు సోముడున్ను, రజస్వల యయిన గంధర్వుడున్ను, స్తనములు పెరుగుచున్నకాలమున నగ్నియున్ను కన్య ననుభవింతురు. ఆతరువాతనే మనుష్యునికి వివాహము చేయవలసిన దని శాస్త్రము. దీనినిబట్టి రజస్వలానంతరము వివాహము చేయవలె నని కనబడుచున్నది. మీఁదిశ్లోకమునుబట్టి యెనిమిదేళ్ల దగ్గిరనుండి వివాహము చేయవలె నని తేలుచున్నది. ఏది సరియైనశ్లోకము ? ఏది ప్రమాణము ? ఆపస్తంబస్మృతిలోనిది అప్రమాణ మని యువతీవివాహవాదు లంటారు. 'సోమో దదద్గంధర్వాయ'—అనుమంత్రము ఏస్మృతిని బలపఱచుచున్నదో యెవరు నిర్ణయించగలరు ? ఆధారములు లేవు. ఎవరికి వారే మావాదము సరియైనది, మావాదము సరియైన దని అనుకొనుచున్నారు.

నే ననే దేమంటే రెండింటినీ వేదము ఆమోదించుచున్నది. కనుక రెండున్ను, ప్రమాణములే. మొదటిది ఉద్వాహకాలమును నిర్ణయించుచున్నది. రెండవది వివాహకాలమును బోధించుచున్నది - అందును. ఎనిమిదేళ్లనుండి అనగా గర్భాష్టమమైన యేడవవత్సరమునుండి ఉత్కృష్టవరలాభ మున్న

పుడు దానము చేయవచ్చుననిన్నీ, ఋత్వనంతరమందే వివాహము జరిగించ వలె ననిన్నీ సమన్వయము. శ్లోకములు రెండున్నూ ప్రమాణములే యగును.

గృహప్రవేశాన్తకర్మ వేరును చతుర్థి వేరును అనుటకు కపర్దికారిక.—

3. "చతుర్థీహోమమధ్యే తు యద్యమా వా చతుర్దశీ,
దినద్వయం పరిత్యజ్య శేషహోమం సమాచరేత్.
భూతదర్శాహమధ్యే తు వర్తతే శేషహోమకమ్,
యత్తదేవాచతుర్హోతా వ్యాహృతి రథపూర్వకమ్."

కృష్ణచతుర్దశి కాని అమావాస్యకాని వివాహమధ్యను వస్తే చతుర్థి మాత్రము వెనకపెట్టి తరువాత చేసుకొనవలెను. దానికి శాంతిహోమము కూడా చేయవలెను. అందువల్ల నక్షత్రదర్శనాంతకర్మయే కొంతకాలము బాల్యమందు జరిపి యౌవనమునందు చతుర్థి చేసేవా రన్నందుకు నిదర్శనము కావచ్చును. ఇపుడు ఇదంతా ఏకకర్మయే యగుటచేత, నేయాటంకమున్ను లే దంటూ సమావేశనాంతము పూర్తిగా చేయుచున్నారు. అట్లు చేయుట అశాస్త్రీయము.

౫. మేధాతిథిభాష్యములో "త్రింశద్వర్షో వహేత్కన్యాం" అను శ్లోకవ్యాఖ్య—'ఇయతా కాలేన యవీయసీ వోఢవ్యా నపునరేతావద్వయస ఏవ ఇత్యుపదిశతి. అథాపి యథాశ్రుతవర్ష సంఖ్యైవ. కింతర్హి బహునా కాలేన యవీయసీ వోఢవ్యా. నహ్యేతద్వివాహప్రకరణే శ్రుతం యేన సంస్కార్యవిశేషణత్వేనతదంగం దశవర్షాంపంచవింశతి వర్షాంచ నివర్తయేత్." వివాహప్రకరణములో నీశ్లోకము లేదు. కావున వివాహ్య కన్యావయసును జెప్పదు. వివాహప్రకరణములో నొకవేళ నుంటే పదేళ్లదానికిని ఇరవై యయిదేళ్లదానికిని వివాహము లేదని చెప్పును. ఇది వివాహప్రకరణములో లేదు కనుక పదేళ్లకన్యకు ఇరవైయయిదేళ్ల కన్యకును వివాహము చేయ

వచ్చును. కావున నీశ్లోకము వయస్తారతమ్యమునే విధించును కాని యథా శ్రుతసంవత్సరములు నిరూపించ దని తాత్పర్యము.

౫. ఒక రొకరిని వధూవరులు వప్పగింత చేసుకొందు రన్నందుకు బృహత్పరాశరవచనము—

"స్త్రీణాముద్వాహ ఏవైకో వేదోక్తః పావనో విధిః,
స్త్రీపుంసోర్యత్ర విన్యాస స్సున్వోరన్యోన్యముచ్యతే."

ఉద్వాహ మనునది యిచట సప్తపది యనవచ్చును, సమావేశన మన వచ్చును. సప్తపదిలో ఒడంబడిక యున్నది. సమావేశనములో శేషహోమ ములోనుండి మిగిలిన నేతిని తలమీద నంటించినతరువాత వధువును వరుడు, వరుని వధువును పుత్రులను కనుటవిషయమై ఒకరొకరిని అప్పగింత చేసు కొనుట కలదు. ఈశ్లోకార్థమునుబట్టి ఈరెంటిలో నేదో నిర్ణయింప దుర్ఘట ముగా నున్నది. చూడండి శ్లోకార్థము. "స్త్రీలకు ఉద్వాహ మొక్కటే పవిత్రమయిన వేదమందు చెప్పబడిన కర్మము. దానియందు సంతానము కనదలచిన స్త్రీపురుషుల ఒకరియం దొకరివిన్యాసము కలదు. విన్యాస మంటే ఉంచుట అని భాషలో అర్థము కలదు. ఇచట దానినిబట్టియూహిం చితే, పురుషునియందు స్త్రీని స్త్రీయందు పురుషుని ఉంచుట యని యర్థము వచ్చును. మఱియు "సున్వోః" అనుమాట కర్థ మేమో దానికి వ్యాఖ్యానము లేదు. మఱి యెచ్చటా ఎవ్వరూ దీనిని వ్యాఖ్యానించలేదు. ఈపద మెక్కడా మఱొకచోట కానరాలేదు. వ్యాకరణములో "సు" అను ధాతువునకు ప్రసవ మర్థము కలదు, 'ను' అనునది ఉణాదిప్రత్యయము కర్త్రర్థమం దని యంటే 'సంతానము కనదలచిన' అని యర్థము వచ్చు నని నేను ఊహించితిని. లేదా "ను" అను ప్రత్యయము కర్మార్థమందే వచ్చిన దంటే విశేష్య మయియుండును. ప్రసవకారణములైన పురుషుని శుక్లమును స్త్రీ శోణితమును అర్థ మగును. స్త్రీపురుషుల శుక్లశోణితముల విన్యాసము

అని యర్థము వచ్చును. ఈరెండును ఒకచోట అనగా గర్భకోశమందు (ఒకతిత్తి కలదు పిల్ల పెరుగునట్టిది) ఉంచుదురు-అని యర్థము వచ్చును. పండితులు విమర్శింతురుగాక. ఈరెండును వేదోక్తవిధులే. "మనుష్యా బీజం వపంతి" అని శ్రుతియు కలదు. ఉద్వాహపద మున్నందున గర్భాధానకర్మ కానేరదు. ఇది వివాహకర్మ యనకతీరదు. నాయభిప్రాయము సమావేశనకర్మయే యని తెలియనగును. ఇందు "సు" ధాతుప్రయోగము వల్ల కేవల ప్రజాసంపత్తియే స్ఫురించుచున్నది, ధర్మసంపద స్ఫురించలేదు. సప్తపదిలో "ఇష ఊర్జం = అన్నవస్త్రము లనుభవించుచు" అనుటవల్లను "రేతోఽహం రేతోభృత్త్వం = శుక్లమును ధరించుదానవు నీవు" అనియు నుండుటచేత ఉభయసంపద కలదు.

ఇది ప్రకీర్ణవిషయము, పదునేడవభాగము సమాప్తము.

# వివాహతత్త్వము

## స్త్రీపునర్వివాహప్రకరణము

పరాశర :—

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ,
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే."

పెనిమిటి కనబడకుండ దేశాన్తరగతుడై కబురైనా తెలియకుండా ఉన్నప్పుడున్నూ, చనిపోయినప్పుడున్నూ, సన్న్యసించినప్పుడున్నూ, నపుంసకు డైనప్పుడున్నూ, పతితు డైనప్పుడున్నూ స్త్రీకి మఱొక వరున కిచ్చి, వివాహము తిరిగిచేయవచ్చును.

కలియుగధర్మములను నిర్ణయించు నీ పరాశరస్మృతిలో ఋషిచెప్పిన పునర్వివాహమును కొన్నాళ్లు కలిలో గడచినపైని కొంచె అప్పటి పెద్దలుకూడ దని నిర్ణయించినారు "ఊఢాయాః పునరుద్వాహం" అని. నేను ఈశ్లోకమున కర్థముమాత్రము ఆచారపక్షపాతులు చెప్పునట్లు చెప్పను. వారు భర్త మరణించిన వితంతువునకు పునర్వివాహము ఈశ్లోకము నిషేధించుచున్న దందురు. అది సరికాదు. ఈయుగములోనే శూద్రులు కొందఱు పునర్వివాహములు ధర్మ్యము లనియే యాచరించుచున్నారు. అందఱును అంగీకరించుచున్నారు. ఆశ్లోకములో పెండ్లి అయినదానికి మఱి పెండ్లి మానవలెను అని మాత్రమే యున్నది. విధవో సధవో స్పష్టముగా లేదు. మీద వివరించిన యయిదింటిలోను నాలుగు సధవాపునర్వివాహములు, ఒకటి విధవాపునర్వివాహము. పరాశరు డనుమతించినవి యయిదును. వీరు అయిదును వద్దంటే పరాశరవచనము వ్యర్థ మగును. వ్యర్థ మేవచనమును కాకుండా జేయవలెనంటే కొంత దానికి

కొంత నీనికి ప్రవృత్తిస్థాన మేర్పఱచవలెను. కావున 'ఊఢాయాః' అనువచనము నాలుగువిధములయిన సధవాపునర్వివాహమును నిషేధించును. విధవాపునర్వివాహమును పరాశరవచనము కలిలో చేయుటకు విధాయకమగును అని నేను సమరస చేసినాను. మఱొకవిధముగా ఈరెండువచనములకును సార్థక్యము వచ్చేటట్టు కుదిరిచితే న్యాయ్య మగును.

మీదిశ్లోకములో సన్న్యాసము హేతువుగా జెప్పుటచేత బ్రాహ్మణులలోకూడా పునర్వివాహ ముండే దని గ్రహింపనగును. సన్న్యాసము బ్రాహ్మణులకే కాని యితరులకు లేదుగదా!

పునర్వివాహమును అనుమతించిన శ్రుతి—వేదమున నిట్లున్నది:

"ఉదీర్ష్వ నార్యభిజీవలోకమితాసుమేతముపశేష ఏహి,
హస్తగ్రాభస్య దిధిషోస్త్వ మస్య పత్యు ర్జనిత్వ మభిసంబభూవ."

ఈమంత్రము చనిపోయినవానిభార్య, శవముదగ్గఱ పడియున్నపుడు బంధువు లామెను బోధించునప్పటిది. దానియర్థము:—

ఓనారీ! చనిపోయిన యీపెనిమిటివద్దను పడి యుండనేల? లెమ్ము. బ్రతికియున్న యీజీవలోకమునకు రమ్ము. ఇచట దిధిషువును (రెండవ పెండ్లిది) పెండ్లాడగోరుచున్నవానిని పెండ్లియాడుదువు అని. మంత్రములో నీవిషయ ముండుటవల్ల ద్విజులలో పునర్వివాహ ముండె నని సూచించును.

ఈవిషయమును రద్దుచేయు నని వేదమున నింకొకమంత్రమును ప్రతివాదులు చూపుదురు. వారు చెప్పినతాత్పర్యము దానికి రాదు.

"యదేకస్మి న్యూపే ద్వే రశనే పరివ్యయతి. తస్మా దేకో ద్వే జాయే విందతే య న్నైకాగ్ం రశనాం ద్వయో ర్యూపయోః పరివ్యయతి. తస్మాన్నైకా ద్వౌపతీ విందతే"

ఒక్క యూపస్తంభమునకు రెండుత్రాళ్లు కట్టవచ్చును; కావున నిద్దఱుస్త్రీలు ఒకపురుషుని పెండ్లాడవచ్చును. ఒకత్రాటిని రెండుస్తంభములకు కట్టరు; కావున నొకస్త్రీ యిద్దఱు పురుషులను పెండ్లాడరాదు — అని అర్థము. ఈమంత్రము యజుర్వేదమందు గలదు. ఈయర్థమునే చెప్పుమంత్రము ఋగ్వేదమందును గలదు. దానిని చూడుండి.

> "ఏకస్య బహ్వ్యో జాయా భవన్తి, నైకస్యై బహవ
> స్సహ పతయః."

ఒకనికి పలువురు భార్య లుండవచ్చును. ఒకదానికి పలువురు భర్తలు ఒక్కకాలమం దుండరు. మీదిశ్రుతిని, ఈశ్రుతిని కలిపి యేకవాక్యత చేయగా ఏకకాలమందు స్త్రీకి బహుభర్త లుండరాదు. పురుషున కేకకాలమందు బహుభార్య లుండవచ్చు ననియే తాత్పర్యము. కావున భర్త మరణానన్తరము మఱొకభర్తను పొందుటను నిషేధించదు. 'సహ పతయః'—అనుటవల్ల నీయర్థమే వచ్చును. ఈకల్పన నాసొంతము కాదు.

> "గ్రహణం సహశబ్దస్య పర్యాయా ద్బహవో ధవాః,
> స్యురితి ప్రతిపత్త్యర్థం ప్రాజాపత్యవచో యథా."

అని భారతవ్యాఖ్యలో నీలకంఠాచార్యులు వ్రాసిరి. మంత్రములో సహశబ్దమును గ్రహించుటవల్ల నొకనియనన్తరము మఱియొకభర్త యుండవచ్చును - అని తాత్పర్యము.

"నైకస్యై బహుపతయః—సహేతి యుగప ద్బహుపతి నిషేధో నతు సమయభేదేన" అని నీలకంఠాచార్యులు.

ఇక స్మృతులలో నీయర్థమే అంగీకరింపబడెను.

వసిష్ఠస్మృతి :—

> "కన్యాన్యస్మై ప్రదాతవ్యా మృతే సప్తపదాత్పురా,
> పురా పురుషసంభోగా న్మృతే దేయేతి కేచన."

ఇం దుత్తరార్థము నిర్ణయసింధులోకూడా కనంబడును. సప్తపదికి ముందు భర్త మరణించితే మఱొకభర్తకు తండ్రి దానము చేయవలెను. సప్తపది యయినను పురుషసంభోగానికి ముందు చనిపోయినప్పుడుగూడా మఱొకని కివ్వవచ్చునని కొందఱు అనుచున్నారు – అని మతభేదము. సప్తపదికి ముందు పునర్వివాహము ఆచారపక్షపాతులుకూడా అంగీకరింతురు. కలినిషేధమున నీవిభేదము లేనందున నీశ్లోకము వ్యర్థము కాకుండా వాక్యార్థము చెప్పవలెనంటే కలినిషేధము క్షతాపర మంటే ఉభయమున్ను సార్థకము. శ్రుతిలో నాయర్థము లేకుంటే ఈస్మృతు లిట్లెలాగు చెప్పును ?

ప్రతివాదులు దీనిపై ననే దేమంటే పునర్వివాహము కలినిషిద్ధమగును కదా! నిషిద్ధ మాచరింపవచ్చునా ? అని.

దీనికి రెండువిధముల సమాధానము : ౧. నాయర్థముప్రకారము కలినిషేధమే లేదు. కలినిషేధమే యుంటే శూద్రులు దాన్ని ధర్మముగా నేల పాలింతురు? మనమందరము దానిని ధర్మమని ఎట్లుఅనుమతించుచున్నాము? ఆమెకడుపున పుట్టినపిల్లలు సర్వాత్మనా ప్రథమవివాహితయొక్క పుత్రులతో సమముగానే చూడబడుచున్నారే! తల్లికే నింద ఉంటే ఆమెపిల్లలకేల యుండదు ? ఇదంతా అసహనబుద్ధితో ప్రథమవివాహిత శ్రేష్ఠురాలనిపించుకొనుటకు పుట్టినయాచారము. అర్థవాద యనుకొంటే సమరసపడును.

ఈశ్వరచంద్రవిద్యాసాగరులనాడు హిందూలాలో పునర్వివాహశాసనము పుట్టినది. మూడు ప్రసిడెన్సీల పండితులున్నూ అంగీకరించిన సర్టిఫికేట్లు ఆయన చూపి గవర్నమెంటువారిని ఒప్పించినాడు ; వా రందుచేత శాసనము చేసినారు.

ఇక రెండవసమాధానము :— కలిలో చేయకూడ దన్న మేనమామకూతురుని పెండ్లాడుచున్నారుకదా! నిర్ణయసింధులోనే

"గోత్రాన్మాతు స్సపిండాచ్చ వివాహో గోవధ స్తథా,
నరాశ్వమేధౌ మద్యంచ కలౌ పంచ వివర్జయేత్."

'మాతు స్సపిండా ద్వివాహః మాతులకన్యావివాహః' అని దాని వ్యాఖ్య. దానిని ఆచారములో మనవా రేల త్రోసిరాజు చేసినారు? అది ఋషివచనము కాదు, మధ్యవారలు కల్పించినది. అప్పటికాలమును దేశమును అనుసరించి చేసిన దనియే. ఇప్పటి దేశకాలానుసారము సహగమన నిషేధ శాసనము వచ్చినందున తిరిగీ పునర్వివాహావశ్యకత వచ్చినదని. కొంద జిప్పటి పెద్దలు అంగీకరించినారు—అని

శాస్త్రమునకు విరుద్ధమయిన ఆచారమును అంగీకరింపరాదు. శంకర విజయమున— "ఆగమేతిహాసపురాణోక్తాచారాస్తు వేదానుకూల్యవంతో గ్రాహ్యాః, అగ్రాహ్యా ఏవహి తత్ప్రతికూలాః" వేదము ననుసరించినది పున ర్వివాహము కావున నట్టిది ఆచరణీయ మనకతప్పదు. తద్విరుద్ధాచారము ఆచరణీయము కాదు.

నిజముగా విధవలు మంచముమీదనే పరుండరాదు. కూడదన్న పనులే తమ అవసరము చూచి చేయుచున్నారు.

వసిష్ఠ.—

"పాణిగ్రహే మృతే బాలా కేవలం మంత్రసంస్కృతా,
సా చే దక్షతయోని స్స్యాత్పునస్సంస్కార మర్హతి."

మంత్రసంస్కారమాత్రము జరిగి సంభోగము కానిదాని భర్త మరణించితే పునర్వివాహము చేయవచ్చును.

ఇట్లే మనువు.—

"యా పత్యా వా పరిత్యక్తా విధవా వా స్వయేచ్ఛయా,
ఉత్పాదయే త్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే,
సా చే దక్షతయోని స్స్యా ద్గతప్రత్యాగతాపి వా,
పౌనర్భవేన భర్త్రా సా పునస్సంస్కార మర్హతి."

మనువు అక్షతయోని యగు విధవకు పునర్వివాహ మంగీకరించినాడు.

బ్రహ్మపురాణము.—

"యది సా బాలవిధవా బలాత్త్యక్తాథవా క్వచిత్,
తదాభూయస్తు సంస్కార్యా గృహీతా యేనకేనచిత్."

బాలవితంతువును, బలవంతముగా భర్త వదలివేసినదానిని ఎవరైనా ఒకరు చేరదీసి తిరిగీ పెండ్లి చేయవలెను—అని విధి గలదు.

వితంతువివాహమునకు పూర్వాచారము భారతకథ—

"అర్జునస్యాత్మజో ధీమా నిరావాన్నామ వీర్యవాన్,
సుతాయా నాగరాజస్య జాతః పార్థేన ధీమతా.
ఐరావతేన సా దత్తా హ్యనపత్యా మహాత్మనా,
పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీనచేతనా,
భార్యార్థం తాంచజగ్రాహ పార్థః కామవశానుగామ్."

అర్జునుడు సంతానము లేని క్షతవిధవను పెండ్లాడినట్లూ, ఆమెకు సంతానము అర్జునునివల్ల కలిగినట్లూ స్పష్టము. అట్టి క్షతవిధవావివాహమే కలి నిషిద్ధమని నామతము.

బ్రాహ్మణులలో పునర్వివాహము పూర్వము లేదని కొందఱికి భ్రమ. అమరములోనే—

"పునర్భూ ర్దిధిషూ రూఢా ద్విస్తస్యా దిధిషుః పతిః,
సతు ద్విజోఽగ్రేదిధిషుః."

ద్విజులలో పునర్వివాహము చేసుకొన్నవానికి అగ్రేదిధిషు వనిపేరు. శూద్రులలో వానికి దిధిషు వనిపేరు—అనియున్నది కనుక అమరము వ్రాసినప్పటికీయాచార మున్నది. అమరము బుద్ధునితరువాతికాలమందు వ్రాసినది. చూడండి, ఆకాలము కలియుగములోనిదగునో కాదో! కనుక కలినిషేధాలు

అంతకు దరిమిలా వనకతీరదు. నలచరిత్రలో దమయంతి యిద్దఱు పిల్లలు ఉండగా పునర్వివాహమునకు ద్వితీయస్వయంవరము చాటించుట, దేశము అంగీకరించుట ఎట్లు?

పునర్భూపతియు, కొడుకులును శ్రాద్ధపంక్తికి పనికిరా రని కొంద అనుచున్నారు. అది నిందార్థవాదము. ప్రథమవివాహితను పెండ్లాడినవాడు, వానికొడుకున్ను బ్రాహ్మణార్థమునకు శ్రేష్ఠులని దాని తాత్పర్యము. వైద్యుడు, పూజారి, అగ్నిహోత్రము లింటలేనివాడు, వేదార్థ మెఱుంగనివాఁడు, చక్రాంకితములు గలవారు మొదలగువెందఱో బ్రాహ్మణార్థానికి పనికిరారు. కావున నట్టిది యాక్షేపణీయము కాదు—అనికాని లేదా అనింద క్షతవిధవా పతిపుత్రునకే యని సిద్ధాంతపఱుచుకొనవలెను.

పునర్భూభర్తృతరులు బ్రాహ్మణార్థమునకు శ్రేష్ఠు లని తాత్పర్యము కాని పునర్భూభర్త శ్రాద్ధభోజనపంక్తికి పనికిరా డన వీలులేదు.

ఈవివాహతత్త్వమున స్త్రీపునర్వివాహభాగము చాల తక్కువగా నున్నది. కీర్తిశేషులు కందుకూరి వీరేశలింగం పంతులవారు ప్రకటించిన వారి యుపన్యాసములలో విస్తారముగా చర్చించి వ్రాసిరి. అవిసులభముగా దొరకు చున్నవి. కావున నే నిందు ముఖ్యవిషయములే సూచించి తక్కినవిషయము లనవసర మని వదలిపెట్టితిని. నాకు తెలిసినవిషయము ముఖ్యముగా నా యాంధ్రసోదరులకు తెలియవలయు ననియే తెలుగున నాకు శక్యమయినంత సులభశైలిలో వ్రాసితిని.

సర్వేజనా స్సుఖినో భవన్తు.

ఇది శ్రీ భారద్వాజసగోత్ర కావ్యతీర్థ పురాణవాచస్పతి
బంకుపల్లె మల్లయ్యశాస్త్రి ప్రణీత వివాహతత్త్వము
పరదేవతార్పిత మస్తు.